# చతుర

సంపుటి : 6 నవంబర్ 1983 సంచిక 10


## ఈ నెల సమగ్ర నవల

ఆశయాలను ఆచరణలో పెట్టి చూపాలనుకునే సంస్కారం ఉన్న ఆదర్శవంతుడతను. పైచదువులకోసం ఎగబడి కాలం, ధనం వృథాచేయటంకన్నా ఉన్న విద్యను, ఆస్తిని, అంతస్తును తన ఊరి బాగుకోసం సద్వినియోగపరచాలనే కార్యశీలి అతను. మనసిచ్చిన ముస్లిం యువతిని పెద్దలు అంగీకరించకపోయినా సరే పెళ్లాడి తీరాలనుకున్న దృఢనిశ్చయం అతనిది. అలాంటి వ్యక్తి తన ఊరిని, తన చుట్టూ ఉన్నవారిని....





# చైతన్యపథం

వైపు నడపటానికి చేసిన ప్రయత్నం ఎలాంటిది? ఎదురైన అనుభవాలూ, అవాంతరాలూ ఏమిటి? వాటినతను అధిగమించిన తీరు పెద్దల మద్దతును పొందగలదా? గ్రామ రాజకీయాల విషవలయాన్ని అతను ఛేదించగలడా?

## ముద్దంశెట్టి హనుమంతరావు

గ్రామస్థాయికి ప్రాకిన వర్తమాన సాంఘిక సమస్యలను ఆసక్తికరంగా చిత్రించిన "చైతన్యపథం" ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

రెండవ కవరు : ఎల్.ఆర్. గ్రోవర్

మూడవ కవరు : కె.వి. కామేశ్

# చతుర ప్రపంచం




విల్ పవర్ వుండాలేగాని శారీరక లోపాలేవీ మనిషి అభివృద్ధిని నిరోధించలేవన్న సత్యాన్ని ఎంతోమంది నిరూపించారు. అందుకు మరో ఉదాహరణ చంపా రంగనాథన్. ఈమె ప్రస్తుతం టి.వి విమర్శకురాలిగా ప్రఖ్యాతి చెందింది. అయితే ఈమె కేవలం చక్రాల కుర్చీ మీద మాత్రమే తిరగగలదు.

చంప పుట్టిన అర్ధగంటకే వెన్నుపూసకు పెద్ద శస్త్రచికిత్స చేయాల్సి వచ్చింది. సాధారణంగా ఈ శస్త్రచికిత్స చేయించుకొన్న 100 మందిలో 99 మందికి కంటిచూపు పోతుంది. చంప అదృష్టమేమో ఆమె చూపు పోలేదు గానీ నడుం కింద భాగం చచ్చుబడిపోయింది.

అందువలన చంప ఇంట్లోనే వుండి చదువుకొంది. అయిదో తరగతిలోగానీ స్కూలు ముఖం చూడలేదు. అయినా చంప ఎప్పుడూ నిరాశపడలేదు, కృంగిపోనూలేదు. కష్టపడి చదివి ఇంగ్లీష్ లిటరేచర్‌తో బి. ఎ. పూర్తిచేసి ఎమ్.ఎ. కూడా అయిందనిపించింది.

స్థానిక ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లో ఎమ్.ఎ. డిగ్రీని నమోదు చేసిన వికలాంగులలో మొదటి స్త్రీ చంప. తర్వాత అనేక ఉద్యోగాలకు ప్రయత్నించింది కాని ఫలించలేదు. భారతీయ విద్యాభవన్‌లో జర్నలిజం కోర్సు చేసి ప్రముఖ పత్రికల్లో సబ్ ఎడిటర్ పోస్టు కోసం ప్రయత్నించింది. అదీ రాలేదు.

కొన్నాళ్లు చిన్నచిన్న పత్రికల్లో అవీ ఇవీ రాశాక ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో టి.వి. కార్యక్రమాలపై విమర్శ రాసే పని దొరికింది. అప్పటినుండి టి.వి.



విమర్శకురాలిగా తన ప్రతిభను చాటు తోంది చంప. నిర్భయంగా నిజాన్ని చెప్పడం వలన అనేకమంది శత్రువులు ఏర్పడినా ఆమె వారిని ఎప్పుడూ లెక్కచేయలేదు.

'వికలాంగుల గురించి అనేక చర్చలు, సమావేశాలు, సెమినార్లు జరగడమే తప్ప నిజాయితీగా వికలాంగులకి అందిన సహాయం చాలా తక్కువ' అన్నది చంప దృఢాభిప్రాయం.

'నా తల్లిదండ్రుల చేయూతే లేకపోతే నేనెక్కడ వుండేదాన్నో' అనుకుంటుంది చంప. చంప తల్లి ఎప్పుడూ కూతుర్ని అంటిపెట్టుకొనే వుంటుంది. చంప తండ్రి కూతురు రాసిన వాటిని ఆఫీసుకి తీసుకెళ్ళి ఇచ్చేస్తుంటాడు. ఇప్పుడు చంపకి ఏ దిగులూ లేదు. తల్లిదండ్రుల వాత్సల్యంలో వికలాంగిని అన్న విషయమే మర్చిపోతుంది ఆమె.

తృప్తిపడరు. అయితే ఇతర జాతుల వారితో వివాహాల పట్ల వీరికి వ్యతిరేకత ఏమీలేదు. వాళ్ళనీ తమలో ఒకరిగానే చూస్తారు.




## అపోరకం పెళ్ళి

బర్మాలోని షాన్ రాష్ట్రంలోని కొన్ని జాతులవారికి పెళ్ళంటే నూరేళ్ళ పంట అన్న నమ్మకం వుంది. వారు ఇప్పటికీ పాతకాలపు పద్ధతులు ఆచరిస్తూనే ఉంటారు. పెళ్ళి కుదరాలంటే అటు ఏడు తరాలు, ఇటు ఏడుతరాల వారిని భూతద్దం పెట్టి పరిశీలించి మరీ నిశ్చయిస్తారట. రంగూన్‌లో కూడా ఈ పద్ధతి ఇంకా అమల్లో వుంది.

అందుకే అక్కడి గ్రామాల్లో దూరపు సంబంధాల కన్నా దగ్గిర సంబంధాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. అవతలి వారి వంశవృక్షమంతా తిరగేస్తేగాని

ఇప్పుడిప్పుడు అక్కడి యువకులు తామే స్వయంగా పెళ్ళికూతుర్ని ఎన్నుకోవాలనుకుంటున్నారు. మగపిల్లలు తమకు నచ్చిన అమ్మాయికి చూచాయగా తమ ఇష్టాన్ని తెలియజేస్తారు. తర్వాత ఆ అమ్మాయివాళ్ళ వంటగది దగ్గిరో, పొలం దగ్గిరో, ఆమె రోజువారీ పనులు చేసే చోటనో ఓ బహుమతిని వుంచుతాడు. ఆమెకి అతను ఇష్టమైతే ఆ బహుమతిని తీసుకోవచ్చు. ఇష్టం లేకపోతే మర్యాదగా వెనక్కి ఇచ్చేయవచ్చు. బహుమతి తీసుకున్నాక ఆ బ్బాయి అమ్మాయినిరోజూ చూడచ్చు, మాట్లాడచ్చు. వీరు ఎక్కువగా తమలపాకులు నములుతుంటారు. అందుకని తరచూ తమలపాకులు వగైరా పెట్టుకునే పెట్టెలను బహుమతిగా ఇస్తుంటారు. తాంబూలం

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం!

ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!

**మార్గదర్శి**

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● వెహూర్జి రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MCF/81/1

వేసుకున్నప్పుడల్లా ఒకరికొకరు గుర్తు పస్తారన్నమాట.

ఈ బహుమతులు ప్రాంతాల వారీగా మారుతుంటాయి. ఒక ప్రాంతంవారు బంగారపు తలపిన్నులు, చెవిరింగులు, గొలుసులు ఇస్తే పాన్‌రాష్ట్ర రాజధాని చుట్టు పక్కల వుండేవారు వెండినాణాలు, వెండి సామాను, బంగారు, వెండి తలపిన్నులు ఇస్తుంటారు. అమ్మాయిలు సాధారణంగా ఒక అబ్బాయి బహుమతిని మాత్రమే అంగీకరిస్తారు. అరుదుగా ఇద్దరి దగ్గిరనుంచి బహుమతి అందుకున్నా పెళ్ళయ్యాక వాళ్ళవి వారికి తిరిగి ఇచ్చేయాలి. కొన్నాళ్లు యుగళ గీతాలు పాడుకున్నాక పెద్దలు పెళ్ళి తేదీ నిర్ణయిస్తారు. ఇరువర్గాల ఆశీర్వచనాలతో పెళ్ళి జరిగిపోతుంది.

## మహాబలుడు

అతను ఓ బలమయిన గుర్రాన్ని ఎత్తి తలమీద పెట్టుకోగలడు. ఎనిమిదిమంది వ్యక్తులు నృత్యం చేస్తున్నాసరే వారితో సహా పియానాను ఎత్తి తనఛాతీమీద నిలపగలడు. అటూ ఇటూ 154పౌన్ల బరువున్న మనుషులు వేలాడే ఇనప రాడ్‌ను భుజాలమీదకి ఎత్తగలడు. బలమయిన సైనికాశ్వాన్ని ఛాతీమీదనుంచి పరుగెత్తించినా అతని పెదవులమీద చిరునవ్వు చెదరదు.

ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నయినా వుంటాయి అతని ఫీట్లు. అతని పేరు ఎజిన్ శాండో. సాధారణమైన ఆహారం తింటూకూడా ఎవరయినా పహిల్వాన్ అవ్వచ్చని నిరూపించాడు శాండో. 1867లో జన్మించిన ఇతను మ్యూజియంలోని శిల్పాలూ, నాణాలమీది కండలు తిరిగిన మగవారి బొమ్మలు చూసి పదో ఏటే తనూ అలా అవ్వాలని నిర్ణయించుకున్నాడు.



అయితే అతనికి చిన్ననాటినుంచి అనారోగ్యమే. డాక్టర్లు అతను బతికే అవకాశాలే తక్కువని చెప్పేశారు కూడా. అందుకని వాతావరణ మార్పుకోసం అతన్ని ఇటలీ పంపారు. అక్కడ ఎనిమిదేళ్ళు వుండి ఇల్లుచేరిన శాండోని కుటుంబ సభ్యులే గుర్తుపట్టలేకపోయారు. అక్కడ అతను బరువులు ఎత్తడం, జిమ్నాస్టిక్స్ వంటివిచేసి తన అనారోగ్యాన్ని జయించగలిగాడు.

తర్వాత అమెరికా, లండన్, యూరప్‌లలోని సర్కస్‌లు, థియేటర్లలో తన బలప్రదర్శనతో అందర్నీ ఆకట్టుకున్నాడు. శాన్ ఫ్రాన్సిస్కోలో సింహంతో శాండో ముఖాముఖీ పోరాటం చూసి ఆ ప్రదర్శనకు హాజరయినవారు అవాక్కయిపోయారు. మొదట్లో సింహం తన బలం ప్రదర్శించినా తర్వాత శాండో తన భుజబలం, నేర్పుతో దానిమీద ఆధిక్యత సంపాదించాడు. మీదకుదూకిన సింహాన్ని ఒడిసిపట్టి అల్లంతదూరానికి విసిరేశాడు. ఆ దెబ్బకు సింహంకాస్తా





వచ్చి ఊరుకుంది. ఈ పోరాటం రెండు నిముషాల్లో ముగిసిపోయింది. ఇప్పటికీ ఈ పోరాటం ప్రేక్షకుల మనసుల్లో ముద్రించుకొనిపోయివుంది. అనేకమయిన కార్టూన్లు, కామిక్స్ దీని ఆధారంగా వచ్చాయి.

ఇంత బలశాలి అయిన శాండోకి కోపం చాలా అరుదుగా వస్తుంది. ఓసారి మాత్రం శాండోకి చెప్పలేనంత కోపం వచ్చింది. పారిస్‌లో అమెచ్యూర్ వెయిట్ లిఫ్టింగ్ పోటీలో పాల్గొనేటపుడు ఒక ఫ్రెంచ్ వెయిట్‌లిఫ్టర్ శాండోని వెక్కిరిస్తూ మాట్లాడి అతని చెంపమీద కాస్త గట్టిగానే గిచ్చాడు. అంతే! ఒళ్ళెరగని కోపంతో శాండో ఆ ఫ్రెంచి వెయిట్ లిఫ్టర్‌ని పైకిఎత్తి గిరగిరాతిప్పి కింద పడేశాడు. కిందపడిన అతగాడికి రెండు రోజులపాటు స్పృహరాలేదు పాపం. స్పృహవచ్చాక వెంటనే శాండోదగ్గరికి పరిగెత్తి క్షమాపణలు చెప్పుకున్నాడు. ఇంత పేరు తెచ్చుకున్న శాండో 1925లో 58వ ఏట మెదడులోని రక్తనాళాలు చిట్లిపోయి మరణించాడు.

## మందు భాయీలకో మందు

మందుబాబుల మత్తు వదిలించి, వారి అలవాటుకి గుడ్‌బై చెప్పేలా చేసే ఓ మాత్రను కనుగొన్నారట ఈమధ్య చికాగోలో. ఈ మాత్రలో వుండే లిథియం మెదడును ప్రభావితం చేసి తాగుబోతుల్లో మందు పుచ్చుకోవాలన్న కోరిక కలగకుండా చేస్తుందనీ, ప్రాథమిక పరిశోధనా ఫలితాలు చాలా సంతృప్తికరంగా వున్నాయనీ అంటున్నారు.

ఈ పరిశోధన సాగించిన చికాగో ల్యాక్స్ మెడికల్ సెంటర్ సైక్రియాటిస్ట్ డాక్టర్ ఫాసెట్ 20 నుంచి 60 ఏళ్ళున్న 84 మంది మందుబాబులను పరిశీలించారట. వారిలో సగం మందికి లిథియం మాత్రలు ఇచ్చి మిగిలిన వారికి పంచదార మాత్రలు ఇచ్చారు. అందరికీ సైక్రియాటిక్ చికిత్స, ఆస్పత్రిలో ఇతర చికిత్సలు చేశారు.



లిథియం మాత్రలు తీసుకున్న వారిలో 75 శాతం మంది ఒకటిన్నర సంవత్సరంపాటు ఒకచుక్క మద్యం కూడా ముట్టుకోలేదట. లిథియం మాత్రలను క్రమం తప్పకుండా వేసుకోనివారిలో కూడా 35 శాతం మంది 18 నెలలపాటు మద్యం ముట్టుకోలేదట. అయితే మాత్ర వేసుకున్నంత మాత్రాన సరిపోదు. తాగుడు అలవాటు పోడానికి ఆస్పత్రిలో చేరడం, వైద్య చికిత్సతోపాటు మానాలన్న కాంక్ష కూడా వుండాలంటున్నారు. మరిన్ని పరిశోధనలు చేసి మరింత సులభంగా తాగుడు అలవాటును మాన్పే అవకాశాలు వున్నాయేమో తెల్సుకోవాలనుకుంటున్నారు. ఒకవేళ ఈ పరిశోధనలు విజయవంతమై తాగుబోతుల సంఖ్య తగ్గిపోతే మద్యం వ్యాపారులంతా రోడ్డున పడాల్సొస్తుందేమో!

## ప్రవేశపెడుతున్నాం
## టియారా హెర్బల్ సబ్బు
## మీ వంటిని కోమలంగా నున్నగాచేసే
## ప్రకృతి సహజమైన నూనెలతో.

టియారా హెర్బల్ సబ్బు, ప్రకృతిలో లభించే మూడు వనమూలికల సమ్మేళనం. ప్రకృతి సహజమైన నూనెలతో మీ వంటిని కోమలంగా రూపొందిస్తూ, దాంతోబాటే శుభ్రపరచి, తాజాదనాన్నిస్తుంది. టియారా హెర్బల్ సబ్బుతో స్నానంలోని ఆ అనుభవాన్ని పొందండి. ఆ కోమలత్వపు సౌందర్యంతో అలాగే ఉండండి— కేవలం ప్రకృతే యివ్వగల ఆ తీరులో.









# టియారా
## హెర్బల్ సబ్బు

**మీ వంటికివచ్చే ప్రకృతి సహజమైన కోమలత్వం.**

## ఏనుగుల్ని తినేవాళ్లు

ఈ మధ్య ఒరిస్సా రాజధాని భువనేశ్వర్‌కి పదిమైళ్ళ దూరంలోని చందోక రిజర్వ్ ఫారెస్ట్ అధికారులు కొన్ని ఏనుగుల కళేబరాలను చూసి ఆశ్చర్యచకితులయ్యారు. కారణం ఏనుగు కళేబరం ఎవరో సుబ్బరంగా ఊడ్చుకు తిన్నట్లుగా చర్మం తప్ప మరేం లేదక్కడ. చివరికి విచారించగా అడవిలోని గ్రామాలలో నివశించే ఆదివాసులు, హరిజనులు ఏనుగు మాంసాన్ని చాన్నాళ్ళుగా తింటున్నారని తేలింది. ఇదివరలో ఏనుగు మాంసం తినడాన్ని ఊహా మాత్రంగానయినా భరించలేనివారు ఇప్పుడెలా తింటున్నారా అని ఆశ్చర్యపోతున్నారు అధికారులు.

ఈ గ్రామాలు ఒరిస్సా రాజధానికి చాలా దగ్గిరలో వున్నా ఈ మార్పును ఎవరూ గ్రహించలేకపోయారు. ఏటేటా పంటలు నాశనమవడం, ఉద్యోగావకాశాలు లేకపోవడం వలన దిగజారుతున్న ఆర్థిక పరిస్థితులు, ఏనుగు మాంసాన్ని మందుల్లో ఉపయోగించడం వంటి అనేక విషయాలు ఈ మార్పుకి కారణం.

ఇప్పటి వరకూ ఆఫ్రికాలో, నాగాలాండ్, మిజోరంలోని కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఏనుగు మాంసాన్ని తింటున్నారు. చందోక రిజర్వ్ అడవుల్లో ఇదివరకు వందల కొద్దీ ఏనుగులు తిరిగేవి. ప్రస్తుతం వాటి సంఖ్య 55కి పడిపోయింది. ఇప్పుడు ఈ కొత్త అలవాటు వలన ఏనుగుల సంఖ్య మరింత క్షీణించి పోతుందేమోనని అటవీశాఖాధికారులు ఆందోళన పడుతున్నారు. ఆధునికత పెరుగుతోంటే ఇలాంటి రాతియుగం అలవాటు ఆచరణలోకి రావడం వింతే. అందుకే కాబోలు "మనిషిలో ఇరవయ్యో శతాబ్దపు వేషాన్ని తొలగిస్తే ఆదిమానవుడు కనిపిస్తాడు" అన్నాడో చరిత్రకారుడు.

## ఎల్.ఎస్.డి.

"కాలం గడిచిపోతోందన్న సంగతే మర్చిపోయాను నేను. విచిత్రమయిన భయం పట్టుకుంది. ఏదో ధ్యానంలో వున్నట్లుగా అనిపించింది. మృత్యువు సమీపిస్తున్నట్లుగా అన్పిస్తోంది నాకు. అయినా ఏమీ చేయలేకపోతున్నాను. నా ప్రాణం నా శరీరాన్ని వదిలిన అనుభూతి. ఇప్పుడు మృత్యువు అనుభూతికి అందుతోంది. సోఫామీద పడివున్న నా శరీరాన్ని నేను చూడగలుగుతున్నాను. నా ఆత్మ బయటికి రావడం కన్పిస్తోంది.." ఈ మాటలు అన్నది స్విట్జర్‌లాండ్‌కు చెందిన ప్రముఖ రిసెర్చ్‌స్కాలర్ ఆల్‌బెర్ట్ హాఫ్‌మన్.

ఆల్‌బర్ట్‌కి ఈ వింత అనుభవం 1943లో అనుకోకుండా ఎదురయింది. అప్పుడతను ప్రస్తుతం పేరుపొందిన తలనొప్పి మాత్ర 'మైగ్రైన్'ను కనుగొనే ప్రయత్నంలో ఉన్నాడు. పరిశోధన చేసే సమయంలో ప్రమాదవశాత్తు లిసెర్జిక్ ఏసిడ్ (ఆమ్లము) చుక్క ఒక్కటి అతని శరీరంలోకి ప్రవేశించింది. ఆ ఒక్క చుక్క అతన్ని మరణయాత్ర చేయించింది. ఆ సమయంలో స్వయంగా రాసినదే పై వర్ణన.

ఎల్.ఎస్.డి. (లిసెర్జిక్ ఏసిడ్ డైథిలమైడ్) ఇప్పుడు విరివిగా వాడబడుతూ యువతరాన్ని నిర్వీర్యం చేస్తోంది.*





# పెరిగే పాపాయిలకు

## కావాలి ఒక ప్రత్యేకమైన ఘన ఆహారం...

# ఫారెక్స్



**ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం <u>అధిక</u> పుష్టికరమైన ఘన ఆహారం.**

**1.** మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్.

**2.** మీ పాపాయిని రక్తహీనత నుండి సంరక్షించడానికి, పాపాయి యొక్క రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి మరియు ఆరోగ్యవంతమైన రక్తం సమకూర్చడానికోసం, బ్రాండ్ చేయబడిన మరే ఇతర ఘన ఆహారం కన్నా అధిక ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్.

**3.** మీ పాపాయికి గట్టి పళ్లు మరియు ఆరోగ్యవంతమైన ఎముకలు ఏర్పడటానికి అవసరమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్‌ను ఆదర్శవంతమైన నిష్పత్తిలో కలిగిన ఏకైక బ్రాండ్ చేయబడిన ఘన ఆహారం ఫారెక్స్.

**4.** మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది కనుక, ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్.




డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్ ®**

గ్లాక్సో నుండి

CASGLF-42-183 T



# చైతన్యపథం

ముద్దంశెట్టి హనుమంతరావు

చీకటిని పటాపంచలు చేసిన వుదయం స్వచ్ఛంగా, చల్లగా మంచిమనిషి మనసులా వుంది. అక్కడక్కడా యింకా మంచు తెరలు చెదిరిపోలేదు. తూర్పుదిశన బంగారు కాంతులీనుతూ తన రాకను సూచిస్తున్నాడు భాస్కరుడు.

అప్పుడే కాలవగట్టుకి వెళ్ళి తిరిగి వస్తున్న రామినాయుడుకు శివయ్య ఎదురయ్యాడు. అతని చేతిలోని వెండిపిడి వున్న చేతికర్ర హుందాకి మారుపేరుగా అగుపిస్తోంది. నడకలో ఠీవి తొణికిసలాడుతోంది. విశాలమైన మొహంలో సౌమ్యత, సహృదయత లీలగా ప్రస్ఫుటమౌతున్నాయి.

"నమస్కారమండీ శివయ్యగారూ!"

రామినాయుడు వినయపూర్వకంగా అన్నాడు.

"బావున్నావా నాయుడూ?" కుశల ప్రశ్నవేశాడు శివయ్య.

"ఏం బాగోలెండి యిలా వున్నాం... తమరి దగ్గరికోసారి రావాలనుకుంటున్నాను"

"తప్పకుండా రావోయ్" అంటూ ముందుకు సాగిపోయాడు శివయ్య.

రామినాయుడు మరికాస్త దూరం వెళ్ళేసరికి నరహరి కనిపించాడు.

"నమస్కారాలండీ..." మామూలు ధోరణిలో అతనికి నమస్కారం చేశాడు రామినాయుడు.

"ఏమోయ్ నాయుడూ, నీకు చెప్పింది గుర్తుందా?" అన్నాడు నరహరి ముందుకు నడుస్తూనే.

రామినాయుడుకి వెనక్కు తిరిగి నరహరి వెంట నడవక తప్పలేదు.

"గుర్తులేకపోవడమేమిటండీ! ఆ ప్రయత్నంలోనే వున్నాను. రెండు మూడు రోజుల్లో మిమ్మల్ని కలుసుకుంటాను" అన్నాడు నాయుడు.

"వట్టి కలుసుకోవడం వల్ల కలిగే ప్రయోజనం ఏమీ వుండదు. పరిష్కారం జరగాల్సిందే" గంభీరంగా చెప్పుకుపోయాడు నరహరి.

"అట్లాగేనండీ! మరి నేను సెలవు తీసుకుంటాను"

"వెళ్ళు" హూంకరించినట్టుగానే అన్నాడు నరహరి.

రామినాయుడు బరువుగా నిట్టూర్పు విడిచి వెనక్కు తిరిగాడు. శివయ్యకి, నరహరికి మనస్తత్వంలోనూ, మాటల్లోనూ ఎంత అంతరం అనుకున్నాడు మనసులో.

* * *

ఆ వూరు మరీ పల్లెకాదు. అలాగని పట్నమూ కాదు. ఓ అయిదొందల గడప వుంటుంది. ఆ వూరు పక్కనే నాగావళి నది ప్రవహిస్తోంది. నది ఒడ్డున సరుగుడు తోటలు, మామిడి తోటలు, జీడి తోటలు పుష్కలంగా వున్నయ్. చిత్రకారుడు రాసిన రంగుల చిత్తరువులాంటి ఆహ్లాదకరమైన ప్రకృతి సౌందర్యం. దగ్గర్లోనే వున్న శ్రీకాకుళం వెళ్ళానికి బస్సులున్నయ్.

ఆ వూళ్ళో వున్న ఇద్దరు మోతుబరి ఖామందుల్లో శివయ్య ఒకడు. రెండో వ్యక్తి నరహరి. శివయ్యని అంతా ధర్మరాజని పొగిడితే నరహరిని యమధర్మరాజంటారు. శివయ్యతో సాన్నిహిత్యం అదృష్టంగా భావిస్తే, నరహరి ఛాయలకే వెళ్ళడానికి భయపడతారు కొందరు. ఈ వ్యత్యాసాల వల్లనే ఇద్దరూ రెండు రాజకీయపార్టీలకు చెందినవారుగా చెలామణి అవుతున్నారు.





శివయ్య చుట్ట కాల్చుకుంటూ ముందు వరండాలో చాపమీద ఆసీనుడై వున్నాడు. పంచాయితీ ప్రెసిడెంటుగా, ఒక భూఖామందుగా ఆ వేదికమీదే వ్యవహరి స్తున్నాడు. ఆడంబరాలకు పోవడం అతని కెప్పుడూ మనస్కరించదు. ఆ వరండా మెట్ల దిగువన గంగులు నమ్మిన బంటులా కూచున్నాడు.

గంగులు హరిజనుడు. శివయ్యదగ్గర పాతికేళ్ళనించీ పాలికాపుగా పనిచేస్తు న్నాడు.

"ఏరా గంగులూ, మీ అబ్బాయి చదువు బాగా సాగుతోందా?" ప్రశ్నించాడు శివయ్య.

"ఏదో తమరి దయవల్ల ఇంతవరకూ లాక్కొచ్చాడు బాబుగారూ!" కృతజ్ఞతా భావంతో అన్నాడు గంగులు.

"ఇందులో నా దయ ఏముందిరా గంగులూ ! వాడు కష్టపడి చదువు తున్నాడు...ప్రభుత్వం సహాయాన్ని అందిస్తోంది" చుట్ట పొగ వదుల్తూ అన్నాడు శివయ్య.

"అట్టాగనకండి బాబుగారూ... తమరే గనక పూనుకోపోతే, ఆడు అయిస్కూ లుకే యెల్లేవాడు గాదు. తమరూ, సిన్న బాబూ పట్టుపట్టకపోతే ఆడి సదువు యెప్పుడో పూర్తయి, తమరి కాళ్ళదగ్గిరో, మరొకరి కాళ్ళదగ్గరో సాకిరీ సేసుకు సుండేవోడు. తమరిలాగే సిన్నబాబు మనసూ మాదొడ్డదయ్యా. అట్టాంటి వోల్లుంటే మాలాంటోల్లకి ఇబ్బందులేం వుండవు" తన మనసులోని మాట వెళ్ళ గక్కాడు గంగులు.

తమ పిల్లల్ని ఎవరు అభినందించినా తల్లిదండ్రులు మురిసిపోవడం సహజం.

"అశాశ్వతమైన ఈ బతుకులో మనిషి మిగుల్చుకున్నదేమిటి గంగులూ? నలుగురూ చెప్పుకునే మంచితనం, మంచి మనసూను. అవి లేనినాడు ఏ మనిషి కయినా ఎంత ఐశ్వర్యమున్నా, అంతస్తు లున్నా ప్రయోజనం, తృప్తి సున్న".

"ఇవన్నీ తమరి లాంటోల్లెవరో ఆలోసిత్తారుగాని, అందరూ ఆలోసించరు బాబుగారూ! కొందరికి డబ్బే పేణం... అదే పెపంచం.."

"అది తెలివితక్కువ తనంరా గంగులూ! ఈ భూమ్మీదికి వచ్చేటప్పుడూ ఏం తీసుకురాలేదు... పోయేటప్పుడూ ఏవీ తీసుకుపోం. అది గుర్తుంచుకుంటే ఎవ్వరూ అలా అనుకోరు"

"తమరితో ఓ మాట సెప్పాలను కుంటున్నాను బాబుగారూ...." చేతులు నులుముకుంటూ అన్నాడు గంగులు.

"ఏమిట్రా అది?

"మరేంలేదు బాబయ్యా! మా దాసు గాడు డాక్టారు సదవడానికి పరీచ్చ లిస్తాడట. ఆడికెందుకు సెప్పండీ గొంతెమ్మ కోరికలు ? మా బతుకులేటి మేవేటి ! తమరైనా సెప్పండి బాబూ ఆ ఆలోసెన్లు వద్దని. ఓ సుట్టు తమరి దగ్గరికంపుతాను"

"ఓ అదా.. .నాకూ తెలుసులే ఈ విషయం. మావాడూ పరీక్షకి కూచుంటాసం టున్నాడు. విశాఖపట్నం వెళ్తారట..., వెళ్ళనీ. అదృష్టం బావుండి ఇద్దరికీ సీట్లు దొరికితే ఒక్కచోటే చదువుకుంటారు"

"సినబాబుగారికి ఆ సదువు అచ్చొ స్తది బాబుగారూ! మా దాసుగాడికెందుకు సెప్పండి? ఒకేల సీటొచ్చినా, నాసు సదివించగల్నా? 'పూటకే గతిలేదు-, కొడుకుని పైసదువులకి పంపిత్తాట్ట' అని అంతా యెగతాలి సెయ్యారా? ఏటో బాబు

ఎంతోరుచి...
ఎంతోరుచి...

ప్రియలోనే
వుంది.




అన్ని రకాలలోను అనంతమైన రుచులు
కలబోసి అందిస్తై ప్రియ పచ్చళ్ళు.
తలచుకొంటే చాలు తరగిపోని
రుచిరానుభూతికి- ప్రియ.
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి
తీసుకు వెళ్ళండి.

**రుచి... ఎంతో రుచి...-ప్రియ**

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

గారు,నాకు యిష్టంలేదు"

"ఒరేయ్ గంగులూ! ఒకరేదో అంటారని మనం భయపడితే బతకలేం ఈ భూమ్మీద. చదువుకోవాలన్న ఆసక్తే ఈనాటికుర్రాళ్ళలో తగ్గిపోతోంది. అటువంటిది, ఆసక్తివున్న కుర్రాళ్ళని నిరుత్సాహపర్చకూడదు. ఈ విషయం వాళ్ళకే వదిలేద్దాం. వాళ్ళేంజేస్తారో చూస్తూ వుండు" నిబ్బరంగా అనేశాడు.

ఇంకేం అనాలో గంగులుకి బోధపడలేదు. "అంతే అంటారా బాబూ"అమాయకంగా అన్నాడు.

"అంతేన్రా!ప్రస్తుతం మీ వెనకబడిన జాతులవారికి దొరుకుతున్న సౌకర్యాల దృష్ట్యా మీవాడు చదువుకోవడమే శ్రేయస్కరం. నువ్వేం వాణ్ణి నిరుత్సాహపర్చకు."

అయ్యగారు చెప్పిందీ నిజమే అనిపించింది గంగులుకి.

"సరే బాబుగారూ!అంతా తమరిదయ. నేనలా తోటలోకి యెల్లొత్తాను"

"అలాగే వెళ్ళ.."అన్నాడు శివయ్య.

జేబులోంచిమరోచుట్టతీసి వెలిగించాడు శివయ్య. ఆరోజు వార్తాపత్రిక ఇంకా రాలేదేమాని అప్పుడు గుర్తుకొచ్చింది. దానికోసం అతని కళ్ళు ఎదురుతెన్నులు చూస్తున్నయ్.

అప్పుడే రామినాయుడు ఇటువస్తూండటం గమనించాడు శివయ్య. అతని చేతిలో ఏదో దినపత్రిక వుండటమూ గమనించాడు.

"నమస్కారం శివయ్యగారూ!" అల్లంత దూరంనించే అనుకుంటూ వచ్చాడు రామినాయుడు.

"నమస్కారం. రావోయ్ కూచో. ఆఁ అది ఈరోజు పత్రికేనా" ఆత్రుతగా అడిగాడు. శివయ్య.

"ఇది తమరిదే బాబూ! బస్సులో ఇప్పుడే దిగిన నరిసింహులు తమరికి ఇచ్చేయమని నాకందజేశాడు" అంటూ చేతిలోని పత్రికను అతనికిచ్చేసి [illegible] న్నాడు రామినాయుడు.

శివయ్యకి వార్తాపత్రికలంటే పరమపిచ్చి. రాజకీయ వార్తలు మరీ శ్రద్ధగా చదువుతాడు. పత్రిక విప్పి [illegible] హెడ్డింగుల్ని చదవడం ప్రా[illegible]డు. అలా చివరి పేజీవరకు చదివి, అప్పుడు రామినాయుడు కేసి చూశాడు.

"ఏదో అలా చదివేస్తేనే గాని సంతృప్తి వుండదోయ్. మరేం [illegible]" అంటూ ఒకవిధంగా క్షమాపణ [illegible]కున్నట్టే అన్నాడు శివయ్య.

"అబ్బే ఫరవాలేదు [illegible] రామినాయుడు.

"ఆఁ... ఏదో పని మీద వచ్చినట్టున్నావు?"

"ఔనండీ"

"చెప్పవోయ్... సందేహమెందుకు"

రామినాయుడోసారి గొంతు సవరించుకుని చెప్పడం ప్రారంభించాడు—

"అమధ్య మా ఆవిడకి చాలా బాగులేకపోయిందండీ! తప్పనిసరిగా పట్నం తీసుకెళ్ళాల్సి వచ్చింది. అప్పుడు నా దగ్గర డబ్బు లేకపోతే నరహరిగారి దగ్గర ఓ అయిదొందలు తీసుకున్నాను— అప్పుగానే. ఆ అప్పు తీసుకుని రెండేళ్లు కావస్తోంది. ఈ రెండేళ్ళూ పంటలు బాగా దెబ్బతినడం మీకు తెలిసిందే. ఆ బాకీ అట్లానే వుండిపోయింది నరహరిగారు నోటు రాయించుకున్నారు కదా— ఇప్పుడా అసలు వడ్డీతో పాటు వెయ్యి రూపాయలకు పెరిగింది. వున్న పళాన

ఆ అప్పు తీర్చకపోతే నా పొలాన్ని స్వాధీనం చేసుకుంటానని ఆయన బెదిరిస్తున్నారు. పంట చేతికొస్తుందన్న ఆశతో వున్నవాణ్ణి. ఇప్పుడా పొలాన్ని బలవంతంగా స్వాధీనం చేసుకున్నా మా లాంటివాళ్ళం చెయ్యగలిగిందేమీ లేదు. ఈ పరిస్థితుల్లో మీరే నన్ను కాపాడాలి శివయ్యగారూ! పిల్లలుగలవాణ్ణి. నన్నేదో విధంగా ఆదుకుని దారి చూపుతారనే ఆశతో మీదగ్గరికి వచ్చానండీ" అంటూ ముగించాడు రామినాయుడు. అతని కళ్ళు చెమర్చడం చూశాడు శివయ్య.

రామినాయుడు తండ్రి తిరుపతి నాయుడు బతికున్న రోజుల్లో వారిదీ సంపన్న కుటుంబమే. అయితే రామినాయుడు తండ్రీ, అతని చిన్నాన్న ఆస్తుల విషయంలో కోర్టుకెక్కి వున్న ఆస్తుల్ని చాలా వరకు కరిగించుకున్నారు. రామినాయుడు చేతికి ఆస్తి వచ్చేసరికి మిగిలింది చాలా తక్కువ. రామినాయుడు తండ్రి అమ్మిన పొలాన్ని కొనుక్కున్నది శివయ్య తండ్రే.

"అవసరాలు అందరికీ వుంటాయి. కాస్త ఆలస్యమయ్యిందేగాని అప్పు తీర్చకుండా వుంటావాయేవిఁటి? ఈమాత్రం దానికే పొలం స్వాధీనం వరకూ వెళ్ళాడా నరహరి?" సాలోచనగా అన్నాడు శివయ్య.

"ఔనండి...ఆయన మనస్తత్వం మీకు తెలిసిందే కదా! అప్పట్లో గత్యంతరం లేక అప్పు తీసుకున్నాసు గనక, నా నిస్సహాయతని ఆధారంగా తీసుకుని ప్రయోజనం పొందాలనుకుంటున్నాగాయన. ఇది నా దురదృష్టం" బాధగా



అన్నాడు రామినాయుడు.

"ఇందులో ఎవరి తప్పూలేదు నాయుడూ. నీ అవసరం నీది. సరహరి స్వార్థం సరహరిది. ఇటువంటి పరిస్థితులు ఏర్పడితేనే కదా డబ్బున్నవాళ్లు మరింత డబ్బుని వెనకేసుకోడానికి అవకాశముంటుంది. రోజులట్లా మారిపోతున్నాయి. అయినా నాకు తెలీకడుగుతాను-తీసుకునే అప్పేదో ప్రభుత్వం దగ్గరే తీసుకోకూడదూ ? ఇంతగొడవ పడాల్సిన అవసరం వుండదు కదా?"

రామినాయుడు నిరుత్సాహంగా నిట్టూర్చాడు.

"అదీ అనుకున్నానండీ! కాని దానికి ఎన్నో తంటాలు పడాలి. లంచాలిచ్చుకోవాలి. అందుకే ఆ ప్రయత్నం చెయ్యలేదు"

"అదంతా నేను చూసుకుంటాలే!నాతో ఓసారి పట్నంరా"

"అలాగేనండీ! మరి ప్రస్తుతం...."
నసిగాడు రామినాయుడు.

"ఈ సమస్యని వెంటనే పరిష్కరించేద్దాంలే. ఆ వెయ్యి రూపాయలూ నేనిస్తాను. తీసుకెళ్ళి అతని మొహం మీద పారేసి, అతని దగ్గరున్న ఆ నోటుని తీసుకొచ్చేయి. తర్వాత ప్రభుత్వం దగ్గర తీసుకున్న లోనుతో నా అప్పు తీర్చేద్దువుగాని. అర్థమయ్యిందా?"

రామినాయుడి మొహం విప్పారింది.

"మీరు చేస్తున్న ఈ సహాయానికి ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో అర్థం కావడం లేదండీ. ఇటువంటిదేదో సలహా ఇచ్చి ఆదుకుంటారనే మీ దగ్గరికొచ్చాను. నా గౌరవాన్ని నిలబెట్టారు. మీరు చేస్తున్న ఈ మేలును ఎన్నడూ మరువలేను" అన్నాడు రామినాయుడు.

శివయ్య సన్నగా మందహాసం చేశాడు. "మరీ ఇంతగా పొగడ్తలతో ఎత్తెయ్యకోయ్ సన్ను! నేను చేస్తున్న సహాయం ఏపాటిది. రేపు ఉదయం వచ్చి పైకాన్ని తీసుకెళ్లు"

"అలాగేనండీ! మరి సెలవిప్పించండి" లేచాడు రామినాయుడు.

* * *

కమల తీరిగ్గా కూచుని అరుణకి జడ అల్లుతోంది.

"అబ్బ... తొందరగా పూర్తి కానివ్వవే అమ్మా! 'నసీమ్' వచ్చేస్తుంది" విసుగ్గా అంది అరుణ.

కమల మొహం చిట్లించుకుంది. "ఆ తురకాళ్ళమ్మాయితో స్నేహం మానమని ఎన్నిసార్లు చెప్పినా నువ్వు వినిపించుకోవేమిటే అరుణా" అంది చిరుకోపంతో.

అరుణకి ఈ ప్రస్తావన కొత్తకాదు. తల్లికి సంస్కారం తక్కువని మరోమారు అనుకుంది.

"ఆ అమ్మాయి ఆనందంగా, హాయిగా వుంటుందమ్మా! ఎంచక్కా మాట్లాడుతుందనీ? చక్కగా పాడుతుంది కూడాను. నేనంటే దానికెంత అభిమానమో ఇంక చెప్పలేను. పైగా చదువులో అన్ని ఫస్టు మార్కులే" అంది అరుణ.

"సరేలేవే! నీలో రోజురోజుకి మొండి పట్టు యెక్కువవుతోంది. చెప్పిందేదీ ఖాతరు చెయ్యటం లేదు. మీ మామయ్యేమో నిన్ను వెనకేసుకొస్తాడు. అందుకే నువ్వు మరింత బరితెగిస్తున్నావు. ఎలాగో ఏడు..." అంటూ జడవెయ్యటం పూర్తి చేసి, అక్కణ్నించి లేచిపోయింది కమల.

అరుణ కూనిరాగాలు తీసుకుంటూ

తన గదిలోకి వెళ్ళి పుస్తకాలు సర్దుకుంటూంటే "అరుణా...అరుణా" అంటూ వచ్చిందప్పుడే నసీమ్.

"ఆ(.... ఆ .... వ చ్చే స్తు న్నా" లోపల్నించే కేకవేసింది అరుణ.

నసీమ్ సన్నగా రాగం తీసుకుంటూ వయ్యారంగా నుంచుంది - అప్పుడే విరిసిన గులాబీలా.

నసీమ్‌ని చూస్తుంటే, కమలకి వొళ్ళు మండిపోతోంది. తమ ఇంటికి రావద్దని, తన కూతురుతో స్నేహం వద్దని, ఆమెతో చెప్పేయాలనుకుంటూందెప్పటికప్పుడే. కాని కూతురు తుఫాను సృష్టించడం ఇష్టం లేక ఊరుకుంటుంది. ఆరోజూ అలాగే చూస్తూ ఊరుకుండిపోయింది.

అరుణ లోపల్నించి వచ్చి "పదవే" అంటూ నసీమ్‌తోపాటు బైటికి నడిచింది. అరుణ నసీమ్ సరసన పెట్రొమాక్స్ లైటుముందు దివిటీలా వుంది. అరుణ అందంగా వుండడనికాదు గానీ, నసీమ్ మరీ అందగత్తె. అదే కమలకి అసూయ కలిగించిన విషయం. అందుకే ఆమె పదేపదే కూతురుకి చెప్తోంది- నసీమ్‌తో స్నేహం మానమని. నసీమ్ ఆ యింటికి రాకుండా వుండటమే, ఆమెక్కావల్సింది. అన్నయ్య కొడుకు హరిబాబుకి తన కూతుర్నిచ్చి పెళ్ళిచెయ్యాలనేది కమల ధ్యేయం. తనమాట అన్నయ్య కొట్టిపారేయనన్న నమ్మకం, విశ్వాసం ఆమెకున్నాయి. అయితే, నసీమ్‌లాంటి అందమైన అమ్మాయి రోజూ ఇంట్లో అగుపిస్తూవుంటే హరిబాబు మనసు ఎక్కడ దాట్లు వేస్తుందోనని ఆమె భయం.



2

కమల శివయ్యకి ఒక్కగానొక్క చెల్లెలు. శివయ్య, నరహరి మొదట్లో మంచి స్నేహితులు. ఆరోజుల్లో నరహరి, తన తమ్ముడు వాసుకి కమలనిచ్చి పెళ్ళిచెయ్యమని శివయ్యని అడగడమే తడవుగా, శివయ్య అంగీకరించాడు. ఆ వూళ్ళో తనకి దీటుగావుండే కుటుంబం నరహరిదే! అంతేగాకుండా వాసు స్ఫురద్రూపి. కమలకి సరైన జోడు. సత్ప్రవర్తనగల వాడు... ఇవన్నీ యోచించే శివయ్య కమల వివాహం వాసుతో జరిపించాడు.

వాసు అందగాడే కాదు...మంచి గాయకుడు. పౌరాణిక నాటకాల్లో శ్రీకృష్ణ అర్జున, శ్రీరామ మొదలగు పాత్రలు ధరించి ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్న నటుడు. నాటకాల్లో తిరుగుతున్నా, ఏ దురలవాట్లకీ బానిస కానివాడు. అలాగని, కేవలం నాటకాల ధ్యాసే కాదతనికి. అన్నకి తోడుగా ఇంటి బాధ్యతలు, పొలాల వ్యవహారాలు కూడా చూసుకుంటూ, భార్య కమలని, చిన్నారికూతురు అరుణని ఎంతో మురిపెంగా చూసుకునేవాడు. అందుకే, శివయ్యకి వాసుపట్ల అమితానురాగం వుండేది. వాసు నీడలో తన చెల్లెలు జీవితాంతం సుఖంగా కాలం గడుపుతుందని నమ్మకం. అయితే, విధి చిన్నచూపు చూసింది.

ఓరోజు రాత్రి పక్కవూళ్ళో కుచ




క్షేత్రం నాటకమాడి, తెల్లవారుఝామున తిరిగివస్తున్న వాసుని, ఎవరో గుర్తు తెలీని వ్యక్తులు దోచుకుని, బలంగా గాయ పర్చారు. కొనవూపిరితో వున్న వాసుని చూసిన వ్యక్తులు నరహరికి కబురుపంపే సరికే, వాసు ప్రాణాలు అనంత విశ్వంలో కలిసిపోయాయి.

నరహరి తన కుడిభుజం పోయిందని బాధపడుతున్నాడు. ఎందుకిలా జరిగిందో అతనికి అర్థం కాలేదు. కొందరు అది కేవలం దారిదోపిడీ అని నిర్ణయించారు. మరికొందరు ఈ కుట్ర ఎవరో తోటివారు పన్నినదన్నారు. ఏది యేమైనా నిజం అంతుబట్టలేదు.

వాసు మరణం అటు నరహరిని,యిటు శివయ్యని కృంగదీసింది. అయినా పర స్పరం సానుభూతి తెలుపుకోవడం తప్ప చేసేదేముంది.

"నరహరీ ! పోయిన వాసు ఎట్లాగూ తిరిగిరాడు. అతడి ఆత్మశాంతికయినా ఆ వున్న ఒక్క పసికందును అభివృద్ధి లోకి తీసుకురావాలి. ఆ బాధ్యత నా నెత్తిన వేసుకుంటున్నాను. నీకూ అభ్యంతరం లేదనుకుంటాను."అన్నాడు శివయ్య, వాసు చనిపోయిన ఓ నెల రోజులకి.

"అదేమిటి శివయ్యా! ఆ బాధ్యత నీ ఒక్కడిదే కాదుగదా! మనిద్దరిదీను... నాదగ్గరే వుండనీపోనీ" అంటూ, తన అభిప్రాయాన్ని తెలియజేశాడు నరహరి.

"నన్ను అర్థంచేసుకో నరహరీ!కమల నాచెల్లెలు. ఇంత చిన్నవయసులోనే దానికి తగిలిన ఈ ఘాతానికి అది తట్టుకోవడం కష్టం. అందుకే నా ఇంట్లోవుంటే, కొంత ఓదార్పుగా వుంటుంది. దాంతోపాటు, చంటిదీ వుంటుంది. నువ్వు కాదనకు. నా అభ్యర్థనని మన్నించు" ప్రాధేయ పూర్వకంగా అన్నాడు శివయ్య.

నరహరి కాదనలేకపోయాడు. శివయ్య చెప్పింది సబబుగానే వున్నట్టు తోచిందతనికి.

"సరే, నీ ఇష్టప్రకారమే కానీ శివయ్యా! వాళ్ళిద్దరూ ఎక్కడుంటేనేం? మన ఇద్దరికీ కావల్సినవాళ్ళే" అన్నాడు నరహరి.

ఆ విధంగా కమల, అరుణ, శివయ్య ఇంటికి వచ్చేశారు.

అలా మిత్రులుగా, బంధువులుగా మమతానురాగాలతో మసలుతున్న శివయ్య, నరహరిల మధ్య వైషమ్యాన్ని, విరోధ భావాల్నిసృష్టించింది పంచాయితీఎలక్షన్లు. వాళ్ళిద్దరూ సఖ్యతగా వుండాలనుకున్నా వారి అనుయాయులు వుండనివ్వరుకదా! అలాఅలా వారి మధ్య దూరం పెరిగి పోయింది. కమలగాని, అరుణగాని నరహరి ఇంటికే వెళ్ళడం మానుకొన్నారు. నరహరి కూడా వాళ్ళ విషయం అంతగా పట్టించుకోలేదు.

* * *

రామినాయుడు నరహరి ఇంటికి వెళ్ళేసరికి, నరహరి వాలు కుర్చీలో కూర్చుని యేవో కాగితాలు చూసుకుం టున్నాడు.

"నమస్కారమండీ నరహరిగారూ" అన్నాడు రామినాయుడు.

"నమస్కారం. నువ్వాటోయ్నాయుడూ రా...రా. కూచో" ఎంతో అభిమాన మున్నవాడిలా ఆహ్వానించాడు నరహరి.

"ఇదిగోండి మీ పైకం. నా ప్రాంసరీ నోటు యిచ్చేయండి" అంటూ జేబులోంచి వెయ్యి రూపాయలు తీసి నరహరికి అందించాడు రామినాయుడు.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి... దంత క్షయాన్ని ఎదుర్కోండి.

Colgate
DENTAL CREAM
Colgate
STOPS BA

కోల్గేట్ తాలూకు నమ్మకమైన
ఫార్ములా మీ నోటి శ్వాస
శుభ్రంగా, తాజాగా వుండేలా
చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా,
దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.

కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.

ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E.B82.86 TL

నరహరి నిర్ఘాంతపోయాడు. రెండేళ్ళనించీ తన అప్పు తీర్చలేని రామినాయుడు, అంత అర్థాంతరంగా మొత్తం పైకం తెచ్చి చెల్లు చేస్తాడని అతనెప్పుడూ వూహించలేదు. అతడెలాగూ డబ్బు తేలేడు కాబట్టి, పంటతోపాటు పొలం స్వాధీనం చేసుకోవాలన్న తాపత్రయం తోనే వున్నాడింతవరకూ. అయితే, హఠాత్తుగా రామినాయుడు డబ్బు తీసుకోవడం అతణ్ని నిర్విణ్ణుణ్ని చేసింది. క్షణం అలా కళ్ళప్పగించి ఆ నోట్లకేసి చూస్తూ వుండిపోయాడు.

నరహరి ప్రవర్తన గమనిస్తూనే వున్నాడు రామినాయుడు. అతనికి నవ్వొచ్చింది. కాని నవ్వలేదు. "ఏమిటండీ నరహరిగారూ అలా చూస్తున్నారు?" అన్నాడు.

"అబ్బే! ఏం లేదోయ్... మొన్నటి వరకూ ఎలా తీర్చడమా అన్న సందిగ్ధంలో పడినవాడివి, ఒక్కసారి ఇంత మొత్తం ఎలా సంపాదించగలిగావా అని?"

"ఓ అదా అండీ! శివయ్యగారి దగ్గరికి వెళ్ళాను. నా పరిస్థితిని ఆయన్తో మొరబెట్టుకున్నాను. అంతే! ఆయనే ఈ పైకమిచ్చారు. తర్వాత గవర్నమెంటు లోను ఇప్పిస్తామన్నారు" అని రామినాయుడు చెప్తా వుంటే, నరహరి మొహం మ్లానమయ్యింది. తన సమక్షంలోనే శివయ్యని పొగుడుతూ వుంటే సహించలేకపోయాడతను. కాని, ఏం చెయ్యగలడు? అసలు ఈ పరిస్థితి తెచ్చుకోవడానికి కారకుడు తనే! రామినాయుడు పొలం సొంతం చేసుకోవాలన్న స్వార్థంతో ఇదంతా చేస్తే ఆదే తననిప్పుడు వెక్కిరిస్తోంది.

నరహరి సన్నగా ఓ చిరునవ్వు నవ్వేడు. "మంచివాడివేనోయ్ నాయుడూ! ఏదో మాటవరసకి అలా కబురు పంపానే గాని, నిజంగా నీ పొలం స్వాధీనం చేసుకుంటాననే నమ్మావా? ఎంత అమాయకుడివి! ఈపాటి విషయానికి శివయ్య దగ్గరికి వెళ్లావా? నా దగ్గరికే వచ్చి చెప్తే మరికొన్నాళ్లు ఆగేవాణ్నిగా? శివయ్య దగ్గరకెళ్ళి ఆ డబ్బు ఇచ్చేయ్. నీ దగ్గర డబ్బున్నపుడే నాకివ్వు" అన్నాడు లౌక్యంగా.

నరహరిలో వచ్చిన ఈ మార్పుకి రామినాయుడు ఆశ్చర్యపోయాడు. ఆ మార్పుకి కారణాన్ని చప్పున ఊహించలేకపోయాడు. అయితే నరహరి నక్కజిత్తుల మనస్తత్వం తెలిసినవాడు గనుక అతని మాటల వలలో చిక్కుకోదల్చుకోలేదు.

"మీ అభిమానానికి ధన్యవాదాలండీ! మళ్ళీ ఈసారి అవసరమున్నపుడు మీ దగ్గరికే వస్తాను. ఇప్పుడు మాత్రం నేను రాసిచ్చిన ప్రాంసరీనోటు ఇచ్చేయండి" అన్నాడు సౌమ్యంగా.

"అంతేనంటావా?"

"ఈసారికి మరేం అనుకోకండి"

"సరే" అయిష్టంగానే ఆ డబ్బు దీసుకుని, లోపలికి వెళ్ళి ప్రాంసరీ నోటు తెచ్చి ఇచ్చేశాడు నరహరి.

"వస్తానండీ!" లేచాడు రామినాయుడు.

"ఎప్పుడైనా డబ్బు అవసరమైతే రావడానికి ఏం సందేహించకు. మనలో మనకి ఆపాటి సహకారాలు లేకపోతే ఎట్లా" అన్నాడు నరహరి.

"అలాగేనండీ" నిష్క్రమించాడు రామినాయుడు.

నరహరి అలా గుడ్లప్పగించి రామినాయుడుకేసి చూస్తూ క్షణం వుండి



పోయాడు. శివయ్య ఇలా అందర్నీ అడుకుని, తనవేపు తిప్పుకోడానికి ప్రయత్నిస్తున్నాడనిపించిందతనికి. ఒకవేళ అదే నిజమైతే తాను జాగ్రత్తగా మసలుకోవాలి...అనుకున్నాడు నరహరి.

* * *

హరిబాబు, దాసు యం.బి.బి.యస్. ఎంట్రన్స్ పరీక్ష ఇచ్చారు. ఇద్దరూ బాగానే రాశామంటున్నారు. ఫలితాలు తెలిసే వరకూ కూచోవడమెందుకని, బి.యస్సీ.లో చేరారు. దాసు ప్రభుత్వం ఏర్పాటుచేసిన ఉచితవసతిలో ఉంటే, హరి హాస్టల్లో ఉండేవాడు.

ఓ ఆదివారం దాసు వస్తాడని ముందు గదిలో సోఫాలో కూచుని ఎదురు చూస్తున్నాడు హరిబాబు.

దాసు ఇంకా రాలేదుగాని, మెరుపు తీగలా లోపలికి వచ్చింది నసీమ్. అడుగు పెడుతూనే హరిబాబుని చూసి, సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది. ఆమె బంగారు వన్నె మొహం ఒక్కసారి రాగరంజిత మయ్యింది.

హరిబాబు చూపులొక్కసారి ఆమె దృక్కుల్ని ఢీకొన్నాయి. ఏదో తెలీని స్పందన ఆ ఇద్దరి హృదయాల్లోనూ కలిగింది. హరిబాబంటే నసీమ్‌కి ఎంతో ఇష్టం. అతను వూళ్ళో వున్నప్పుడు అరుణకోసం ఎన్నిసార్లు ఆ యింటి కొస్తుందో లెక్కవుండదు. వచ్చినప్పుడంతా దొంగచాటుగా అతణ్ణి చూస్తుంది. అతను ఇంట్లో లేకపోతే, అతని ఫొటో నయినా చూస్తుంది. హరిబాబంటే అంత అభిమానం, ఆరాటం, ఆరాధన.

హరిబాబు చాలారోజులనించి ఆమెని చూస్తున్నాడు. ఇప్పుడిప్పుడే ఆమె విరబూచిన పుష్పంలా యవ్వనాన్ని సంతరించుకుంటూండటంగమనిస్తూనేవున్నాడు. సంపంగి పూవులాంటి ఆ నాసికా, చక్రాల్లాంటి ఆ కళ్ళు, చంద్రహాసాన్ని ధిక్కరించే ఆ నవ్వని పెదాలు, ముత్యాల్లాంటి పలువరస ... ఇవన్నీ చూస్తుంటే అతనికి మతిపోయినట్టే అవుతోంది.

నసీమ్ కేసి అలాచూస్తూ వుండిపోయాడు హరిబాబు. నసీమ్‌కి ఏం చెయ్యాలో తోచలేదు. లోపలికి వెళ్ళిపోవాలనుకుంది. అతనేమనుకుంటాడో అనుకుని మళ్ళీ "అరుణ వుందాండీ?" అంది మృదువుగా.

హరిబాబు వాస్తవ ప్రపంచానపడ్డాడు. "ఆ...ఆఁ వుంది...వుంది. వెళ్ళు లోపలికి" అనేశాడు.

నసీమ్ నిండుగా నవ్వుతుని లోపలికి తుర్రుమంది.

అప్పుడే వీధినుంచి దాసు పిలుపు వినబడింది హరికి. వీధిలోకి నడిచాడు. అతని హృదయ ఫలకంమీద నసీమ్‌రూపం, ఆమె మందహాసం యింకా చెరిగిపోలేదు. దాసుతో కలిసి తోటకేసి వెళ్ళిపోయాడు హరిబాబు.

జడ అల్లుకుంటోన్న అరుణ నసీమ్ రాకను గుర్తించి వెనక్కి తిరిగింది.

"ఏమిటే నసీమ్ ఆ కంగారు? నుదుటిమీద ఆ చిరుచెమటయేమిటి?" నవ్వుతూనే అంది అరుణ.

"అబ్బే... ఏం లేదే! మీ బావగారు ముందుగదిలో కూచున్నారే. ఆయన్ని చూసేసరికి నాకేమిటోలా అనిపించింది"

"మా బావని కొత్తగా చూడంలేదుకదే! ఎందుకా భయం?"

"అదేమోనేమరి! ఇవాళ్ళ వచ్చినంత సిగ్గేసింందనుకో..."

అరుణ ఫకాల్న నవ్వింది.





"కొంపదీసి..." అర్ధోక్తిలో ఆపేసింది నవ్వుతోనే.

"ఫోవే! నీ ధ్యాసంతా అదే..." అంది నసీమ్.

"ఆఁ...ఔనౌను...నా బుగ్గలే సిగ్గుతో ఎరుపెక్కాయి...కదూ? ఒక్కసారి అద్దంలో చూసుకోవమ్మా..." వెటకారంగా అంది అరుణ.

"అబ్బ! ఇక ఆ టాపిక్ కట్టిపెట్టు షికారు వెళ్దామన్నావుగదా...బయల్దేరు"

"ఇదిగో అయిపోయింది... ఎంత సేపు? కూచో..." అంటూ దుస్తులు మార్చుకుందుకు వెళ్ళింది అరుణ.

నసీమ్ అక్కడున్న కుర్చీలో కూలబడింది. ఆమె దృష్టి గోడకి తగిలించి వున్న హరిబాబు ఫొటో మీద పడింది. దగ్గరగా వెళ్ళి,ఆ ఫొటోను చూడాలనున్నా ఎవరైనా చూస్తే బావుండదనిపించి, ఆ ఫొటో మీదే దృష్టిని కేంద్రీకరించింది.

"ఇక పదవే నసీమ్..." అంటూ లోపల్నించి వచ్చింది అరుణ.

అరుణ వెంట కమల కూడా వచ్చి-

"ఇప్పుడెక్కడికే అరుణా?" అని ప్రశ్నించింది.

"అలా తోట్లోకి వెళ్ళొస్తావమ్మా..."

"బావుందే! వయసొచ్చిన ఆడపిల్లలు అలా తిరగొచ్చునా?ఇదేం పట్నంకాదమ్మా పల్లెటూరు. ఎవరైనా ఏమనుకుంటారు?" అంది చెక్కిళ్ళునొక్కుకుంటూ.

"ఏమైనా అనుకోడానికి మేం ఏమీ తప్పుడుపనులు చెయ్యడంలేదుగా! పదవే నసీమ్" అంటూ నిర్లక్ష్యంగా వెళ్ళిపోయింది అరుణ. నసీమ్ ఆమెవెంట బితుకుబితుకుమంటూ నడిచింది.

కమల కళ్ళల్లో కోపం కట్టతెగి ప్రవహించింది.

"నిర్లక్ష్యానికి ఓ హద్దంటూవుండాలి" అని తనలో అనుకుంటూనే బైటికి అనేసింది.

"ఏమయ్యిందమ్మా కమలా?" అప్పుడే వీధినుంచి వస్తోన్న శివయ్య ప్రశ్నించాడు చిరునవ్వుతో.

"అరుణ బొత్తిగా నా మాటల్ని ఖాతరు చెయ్యడం లేదన్నయ్యా!"

శాంతస్వభావుడైన శివయ్య సన్నని మందహాసం చేశాడు.

"వాళ్ళ సరదాగా తిరిగే వయస్సు ఇదేకదమ్మా కమలా! మన వూరుని పల్లెటూరని చిన్నచూపు చూస్తున్నావు. ఇప్పుడిక్కడ హైస్కూలయింది. బస్సులు పడ్డాయి. విద్యుచ్ఛక్తి వచ్చింది. ఆసుపత్రి వచ్చింది. ఇంకేం కావాలి? మన వూర్నిపుడు చిన్నసైజు పట్నంగా చెప్పుకోవచ్చు. అరుణ వయస్సెంత చెప్పు? ఏదో చిన్నతనం. పోతే, ఆ తురకాళ్ళమ్మాయితో తిరగొద్దంటావు... అంతేనా? నీ అభిప్రాయాన్ని ఎవరు విన్నా నవ్వుతారమ్మా! స్నేహానికి మతంగాని, జాతిగాని, కులంగాని అడ్డుగోడలు కావు. నా దగ్గరన్నావు. సరిపోయింది. ఇంకెక్కడా అనకు" అంటూ నెమ్మదిగానే చెల్లెల్ని మందలించాడు శివయ్య.

* * *

చక్రపాణి ఆ వూరు హైస్కూలుకి ఇంగ్లీషు టీచరుగా కొత్తగా వచ్చాడు. స్ఫురద్రూపి. ఒత్తుగా పెరిగిన జుత్తుని క్రమపద్ధతిలో దువ్వినక్రాపు ఆ మొహానికి ఎంతో అందాన్నిస్తోంది. ఎప్పుడూ చిరునవ్వునవ్వుతూ మాట్లాడుతాడు. పాఠాలు హాస్యంగా, లలితంగా చెప్తాడు. అంచేతనే వచ్చి నెలరోజులే అయినా- విద్యార్థి, విద్యార్థినుల అభిమానాన్ని

చూరగొన్నాడు.

అందుకే అరుణ అభిమానాన్నే కాక ఆమె అనురాగాన్నీ కూడా చూరగొన్నాడు. పాఠం చెబుతుంటే ప్రశ్నలు వేస్తే విసుక్కోకుండా జవాబు చెప్పేవాడు.

'ప్రేమ' అన్నది చాలా విచిత్రమైనది. ఎవరు ఎవర్ని ప్రేమిస్తారో, ఎవరిచేత ప్రేమించబడతారో, ఎందుకు ఆకర్షితులౌతారో ఇదమిత్థమని ఎవరూ చెప్పలేదు. 'ప్రేమ'కి అందమొక్కటే ప్రాధాన్యమైనదికాదు. అనురాగం, ఆకర్షణ, ఐశ్వర్యం.... ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో కారణాలుంటాయి. అరుణలోని ఆకర్షణకి దగ్గరయ్యాడు చక్రపాణి. అరుణ చక్రపాణి అందానికి, అతని మాటల తీరుకి సమ్మోహితురాలయింది. తనని అభిమానిస్తున్న చక్రపాణంటే అభిమానం! అయితే, చక్రపాణి మనసులో ఏముందో ఆమెకీ అంతుపట్టలేదు.

"మేస్టారూ, మీదగ్గర మంచి ఇంగ్లీషు నవల ఏదేనా వుంటే ఇవ్వరూ ?" అడిగిందోరోజు అరుణ.

"ఓ ! ష్యూర్...తప్పకుండాను. సోమర్‌సెట్ మామ్ నవల్లంటే నాకెంతో ప్రీతి. వాటిని నేను క్షుణ్ణంగా చదువుతాను. అవి కావాలా?"

"మీ దగ్గరున్న వేవో అవే యివ్వండి. లేనివి ఎక్కణ్ణించి తెస్తారు?" చిలిపిగా అంది.

"అలాగేలే! రేపు తీసుకొస్తాలే"

"థాంక్సండీ!"

"ముందుగానే థాంక్స్ ఎందుకూ" చిరునవ్వుతో అన్నాడు.

"మర్చిపోకుండా తెస్తారని" నిండుగా నవ్వింది.

ఆ నవ్వుకి తికమకపడిపోయాడు చక్రపాణి. మందహాసం చేస్తూ, ముందుకి సాగిపోయాడు.

"ఏవిటే అరుణా ! అతనితో అంత చనువుగా, చొరవగా మాట్టాడుతావు?" అడిగింది నసీమ్.

"ఈ మేష్టారుతో మాట్లాడ్డం సరదాగా వుంటుందే నసీమ్ ... మనిషి ఎంత అందంగా వుంటాడో, ఆ మాటలూ అంత అందంగానే వుంటాయి"

నసీమ్ అరుణకేసి పరిశీలనగా చూసింది. అరుణా ప్రేమలో పడిందేమోనన్న అనుమానం ఆమెకి కలిగింది.

"ఔనూ నాకు తెలీక అడుగుతాను. ఇంగ్లీషు నవలలు అడిగావు కదా నువ్వు. వాటిని చదివి అర్థం చేసుకుంటావనే!" తనలోని సందేహాన్ని వెలిబుచ్చింది నసీమ్.

అరుణ పక్కున నవ్వింది.

"అబ్బే! చదవడానికి ఓపికెక్కడిదే"

"మరి, ఎందుకడిగినట్లు?"

"అతనితో పరిచయాన్ని పెంచుకోవాలని...అంతే"

నిష్కర్షగా చెప్పింది అరుణ.

"అంటే? నువ్వు మేష్టార్ని...." అని ఆగిపోయి, అరుణకేసి చిలిపిగా, నూటిగా చూసింది.

"పోవే! అప్పుడే అనుమానం వచ్చేసిందా నీకు?"

"దీన్ని అనుమానమంటే ఎలా? ఆత్మీయ్యతమను"

"నిజం చెప్పాలంటే నసీమ్, ఇంత వరకూ నేనెవర్నీ ప్రేమించలేదు. కాని, ఈ మేష్టార్ని చూస్తుంటే నాలో ఏదో మార్పు వచ్చేస్తోంది. నేను ఈయన్ని

ప్రేమిస్తున్నానేమోనని అనుమానం కలుగుతోందే"

"ఆ మాట గట్టిగా అనకు. ఎవరైనా వింటారు. విన్నారా, ఇక మీ ఇద్దరి భరతం పట్టేస్తారు" మెల్లగా అంది.

"పిచ్చిదానా! ప్రేమించుకున్నాక భయపడితే ఎట్లాగే! ఎటువంటి పర్యవసానాన్నయినా తట్టుకోగల గుండెనిబ్బరం, ధైర్యం వుండాలి"

"అబ్బ....ఇంత ధైర్యం నీకెట్లా వచ్చిందే అరుణా?"

"మా వంశం ఎటువంటిదో చూస్తున్నావుగా! అందరూ ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. ఆ వంశంలో జన్మించిన దాన్నిగా బట్టి ఆపాటి ధైర్యం వుండొద్దూ?" సగర్వంగా నవ్వింది అరుణ.

నసీమ్ ఇల్లు దగ్గరపడ్డంతో అక్కడితో ఆ ప్రస్తావనకు ఫుల్‌స్టాప్ పడింది.

"వస్తానే" అంటూ ముందుకు సాగిపోయింది అరుణ.



## 3

ఆరోజు మధ్యాహ్నం శివయ్య, హరిబాబు భోజనం చేస్తున్నారు.

"ఆమధ్య నేనూ, దాసు ఎమ్.బి.బి.యస్. సీట్లకోసం పరీక్షకి వెళ్ళాం. గుర్తుందా నాన్నా?" ప్రశ్నించాడు హరి.

"గుర్తు లేకేం! ఫలితాలు ఇంకా రాలేదా?"

"వచ్చాయినాన్నా...దాసు ఒక్కడికే సీటు దొరికింది."

"నీకు దొరకలేదా?"

"లేదు నాన్నా"

"అదేవిట్రా! వాడికంటే నువ్వే తెలివైనవాడివిగా?" విస్తుపోతూ అన్నాడు శివయ్య. అతనికా వార్త ఓ షాక్‌లా తగిలింది.

"సరేలే! అయితే నువ్వేంచెయ్యదల్చుకున్నావు?"

"బి.యస్సీ ఎలాగూ చదువుతున్నానుకదా? అదే కంటిన్యూ చేస్తాను. దాసు విశాఖవెళ్ళి చదువుతాడు"

"చేరాడే అనుకో అక్కడ. ఆర్థికంగా తట్టుకోగలడంటావా ?" సాలోచనగా అన్నాడు శివయ్య.

"వాళ్ళకి ఫరవాలేదు నాన్నా! ప్రభుత్వమే అన్ని ఏర్పాట్లూ చేస్తుంది. ఏదో దుస్తులు, ఇతరత్రా ఖర్చులు చూసుకుంటే చాలు. వాటికి మన సహకారం అందివ్వాలి. నాకు సీటు లేదని మీరు బాధపడకండి"

శివయ్య కొడుకేసి దృష్టిని సారించాడు.

"నీ మనస్తత్వం నాకు నచ్చిందిరా అబ్బాయ్....కేవలం మనమంచికే కాదు. ఎదుటివాళ్ళ మంచిని కాంక్షించడం వుత్తమ లక్షణం. దాసుకి మన సహకారం అవసరమైతే తప్పకుండా ఆదుకుందాం" అన్నాడు శివయ్య.

హరిబాబు తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచాడు. వాళ్ళిద్దరూ అలా భోజనాలు ముగించారు.

సాయంత్రం గంగులు, దాసు కలిసి శివయ్య ఇంటికొచ్చారు.

శివయ్య బైట వరండాలో అతని




యథాస్థానంలో కూచున్నాడు. గంగులు, దాసు ఒకేసారి అతనికి నమస్కారాలు చేశారు. దాసు కాస్త ముందుకొచ్చి శివయ్యకి పాధాభివందనం చేశాడు కూడా.

"అంతా విన్నాను దాసూ! డాక్టర్ చదవడానికి నీకు సీటు దొరికిందటగా. అబ్బాయి చెప్పాడు. చాలా సంతోషం. మన వూళ్ళో ఒకడికి ఇంత గొప్ప అవకాశం దొరకడం వూరికే గొప్ప. అదీ నా దగ్గర పన్జేసే గంగులు కొడుక్కి- ఆ అదృష్టం పట్టడం నాకే గర్వకారణంగా వుంది. ఎప్పుడు వెళ్తావేంటి?" అన్నాడు శివయ్య.

దాసు మొహం దించుకుని, మౌనం దాల్చాడు.

"అదేంట్రా ఇలా ఉన్నావు. ఏమయ్యింది?" అడిగాడు శివయ్య.

దాసు జవాబు చెప్పాలనుకుంటుండగానే గంగులు అందుకున్నాడు-

"ఈడు సదువుకి పోనంటున్నాడు బాబుగారూ!"

శివయ్య విస్తుపోయాడు.

"ఏంరా దాసూ ! ఎందుకు వెళ్ళనంటున్నావు?"

"సినబాబుగారికి సీటు దొరకనే లేదట అందుకని ఈడూ పోడట" మళ్ళీ గంగులే అన్నాడు.

శివయ్యకి అర్థమయింది. వాళ్ళిద్దరి స్నేహసంబంధం ఎటువంటిదో కూడా తెలుసు.

"తప్పురా దాసూ! అటువంటి మొండి పట్టు పట్టకు. నీకున్న అవకాశం వల్ల సీటు దొరికింది. వాడికా అవకాశం లేదు. దానికెవ్వరూ ఏమీ చెయ్యలేరు. వచ్చిన ఈ సదవకాశాన్ని ఎందుకు పోగొట్టుకుంటావురా? తప్పకుండా వెళ్ళు. శ్రద్ధగా చదివి, డాక్టరువై మన వూరికి పేరు తీసుకురా?" అన్నాడు శివయ్య.

"అదికాదు బాబుగారూ! హరిబాబుకి లేని చదువు నాకెందుకు? అతణ్ని విడిచి పెట్టి మరో చోటుకి వెళ్ళాలంటేనే బాధగా వుంది బాబుగారూ" దాసు గొంతు కంపించింది. కళ్ళు చెమ్మగిల్లినై.

"అటువంటి భావన పెట్టుకోవద్దురా దాసూ! స్నేహమన్నది సజీవంగా చిరకాలం వుండాలని ఆశించాలిగాని, మనుషులు ఒకరికొకరు దూరమవ్వకుండా ఎలా సాధ్యం? మీరిద్దరూ ఎక్కడున్నా, ఎంత దూరంలో వున్నా మీ స్నేహానికి అవరోధం ఏర్పడదు.... ఏర్పడ కూడదు. నువ్వు తప్పకుండా వెళ్ళి చేరు"

అప్పుడే లోపల్నించి వస్తూ అంతా విన్న హరిబాబు "ఔను దాసూ! నువ్వు తప్పకుండా వెళ్ళి చేరు. నువ్వు డాక్టరువై మన వూరికి పేరు తీసుకు రావడమే గాకుండా ప్రజలకి సేవ చెయ్యాలి. ఇక నా విషయమంటావా...బి.యస్సీ పూర్తి చేసి, వుద్యోగాలకు ఎగబాకను. ఈ వూళ్ళోనే వ్యవసాయం చేసుకుంటూ బతుకుతాను. చదువుకున్నవాళ్ళు అధునాతన రీతుల్లో వ్యవసాయం చేస్తే ఫలితాలు ఎంత గొప్పగా వుంటాయో అందరికీ తెలియజేస్తాను" అన్నాడు.

"సరే! మీ అందరి ఆశీస్సులతో నేను వెళ్తాను. రేపే బైలుదేరుతాను బాబుగారూ! దీవించండి" అంటూ రెండు చేతులూ జోడించాడు దాసు.

"నా ఆశీస్సులు నీకెప్పుడు వుంటాయిరా దాసూ ! శ్రద్ధగా చదువుకో. ఎప్పుడైనా నీకు డబ్బు అవసరమైతే అభిమానపడి వూరుకోకు. మావాడికి

వృత్తరం రాయి. వుండు కాసేపు....'' అంటూ లోపలికివెళ్ళి, ఓ వందరూపాయల నోటు తెచ్చి దాసు చేతిలో పెట్టాడు శివయ్య.

''బాబుగారూ!మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనేమో" అంటూ శివయ్యకి మళ్ళీ పాదాభివందనం చేశాడు.

శివయ్య దాసు భుజం తట్టుతూ ''వెళ్ళిరా!'' అన్నాడు.

గంగులు కళ్ళవెంబడి ఆనందభాష్పాలు రాలినయ్.

హరిబాబు స్నేహితుణ్ణి ఆప్యాయంగా పొదివి పట్టుకుని వీధిలోకి నడిచాడు.

వెళ్తోన్న వాళ్ళిద్దరికేసి శివయ్య, గంగులు తదేకంగా చూస్తూనే వున్నారు.

"ఒరేయ్ గంగులూ...''

"బాబూ..."

''వీళ్ళిద్దరూ గతజన్మలో స్నేహితులై వుంటారిరా...."

"అంతే బాబూ....అంతే! నేకపోతే, ఆళ్ళలో ఈ అభిమానం వస్తదా?''

''నువ్వు చాలా అదృష్టవంతుడివిరా గంగులూ!''

"తమరి దగ్గిర పాలికాపుగా సేరడమే నా అదురుష్టం బాబుగారూ! మరి, నాకు సెలవిప్పించండి బాబయ్యా! అలా యెల్లొత్తాను''

"సరే..వెళ్ళు..'' అన్నాడు శివయ్య.

గంగులు నిష్క్రమించాక శివయ్య చుట్టతీసి ముట్టించాడు. ఇంతలో "నమస్కారం శివయ్యగారూ" అంటూ వచ్చాడు రామినాయుడు.

''రావోయ్ నాయుడూ ... కూచో" సాదరంగా అన్నాడు శివయ్య.

రామినాయుడు వచ్చి, శివయ్యకి అభిముఖంగా కూచున్నాడు.

"విన్నావా నాయుడూ, మన గంగులు కొడుక్కి డాక్టరు చదవడానికి విశాఖపట్నంలో సీటు దొరికింది'' అన్నాడు శివయ్య.

"ఇంతవరకూ విన్లేదండీ ! మీరు చెబుతుంటే తెలిసింది. అదృష్టవంతుడు గంగులు. కుర్రాడు తెలివైనవాడండీ! మరి, మీ అబ్బాయికి సీటు దొరకలేదాండీ?"

"లేదోయ్ ... మరేంజేస్తాం?'' అని కాసేపాగి "సరేగానీ మీ అబ్బాయిని మరి చదివించడం లేదా?" అన్నాడు శివయ్య.

''లేదండీ ! పట్నంలో చదివించే తాహతేదీ నాకు?"

''మరేం చెయ్యదల్చుకున్నావు?''

''ఉద్యోగప్రయత్నాలు చేస్తున్నాడు. ఆ విషయం మీతో విన్నవించుకోడానికే ఇలా వచ్చాను. మీకు తెలిసిన అధికారులు, నాయకులు చాలా మందున్నారు. వాడికోదారి చూపించి ధర్మం కట్టుకోండి. నా కుటుంబ పరిస్థితులు మీకు తెలీనివి గావు. వాడికేదో వుద్యోగమంటూ అయితే, కుటుంబపరిస్థితులు కాస్తయినా చక్కబడతాయన్న ఆశతో వున్నాను...." అన్నాడు రామినాయుడు.

రామినాయుడు నిస్సహాయతకి శివయ్య జాలిపడ్డాడు.

"పోనీ, మీ అబ్బాయికి చదువుకోవాలన్న ఆసక్తి వుంటే చదివించకూడదూ?"

"ఆ శక్తిలేకనే కదండీ!"

"నేను సహాయం చేస్తాను...నీదగ్గరున్నపుడే ఇవ్వు"

"మీ అభిమానానికి ధన్యవాదాలండీ శివయ్యగారూ! అయితే, ఇంట్లోని పరిస్థితులు మావాడి ఆసక్తిని పీకనులిమి చంపేశాయి"

శివయ్య భారంగా ఓ నిట్టూర్పు





విడిచాడు.

"పరిస్థితులకు తలవొగ్గి నిరుత్సాహ పడకూడదు నాయుడూ! ధైర్యంగా ఎదుర్కోవాలి"

"జీవితంలో నాకంటె ధైర్యంగా నిలబడ్డవాడు మరెవ్వడూ వుండడేమో!"

"అని నువ్వనుకుంటున్నావు. నీలాగే కష్టాల్లో వున్న ప్రతి వ్యక్తీ అనుకుంటాడు. అయితే ఒక్క విషయం. అలా అనుకున్న ప్రతివాడూ చివరికి వేదాంత ధోరణికి అలవాటుపడతాడు"

"మీరన్నది నిజమేనండీ! నేనిప్పుడు అదే అలవర్చుకున్నాను, అంతకంటె చేయగలిగిందేమీలేక. అబ్బాయికి ఉద్యోగం లేదు..అమ్మాయి పెళ్ళికుంది. ఇవన్నీ సమస్యలే! అందుకే ఒక్క సమస్యకయినా పరిష్కారం దొరికితే, మనస్సుకి కొంత వూరటకలుగుతుంది.." నిస్పృహతో అన్నాడు నాయుడు.

"సరేలే! ఈసారి నేను పట్నం వెళ్ళినపుడు మీ వాణ్ణి నాతోపాటు పంపించు"

"ఆ మాటన్నారు చాలండీ! నా రోజులు మారే యోగం రాబోతుందని పిస్తోంది" సంతోషపడిపోతూ అన్నాడు రామినాయుడు.

"అప్పుడే అంతగా సంబరపడిపోకోయ్ .... కార్యసిద్ధికానీయ్ ...." నవ్వుతూ అన్నాడు శివయ్య.

"మీరు అన్నారంటే అది జరిగే తీరుతుందండీ! మరి నేను వెళ్ళొస్తానండీ"

"మంచిది..వెళ్ళవోయ్"



# 4

ఆరోజు ఆఖరు పీరియడు ఇంగ్లీషు క్లాసు పాఠం చెప్పి వెళ్తున్నపుడు తనతోపాటు తెచ్చిన నవల అరుణకి అందించాడు చక్రపాణి. క్లాసులోని కుర్రాళ్లూ, అమ్మాయిలూ వింతగా చూశారు.

"మీరంతా అంతగా ఆశ్చర్యపడనవసరంలేదు. విజ్ఞానసముపార్జనకోసం ఇంగ్లీషు నవలలు అందులోనూ ప్రఖ్యాత రచయితల నవలలు చదవటం చాలా అవసరం. అరుణకి ఆ అభిరుచి వుండటం నాకెంతో ఆనందంగా వుంది. మీలో ఏ ఒక్కరు చదవాలనుకున్నా, నన్నడగండి. పుస్తకాలు ఇస్తాను" అన్నాడు చక్రపాణి.

విద్యార్థుల్లో చెలరేగిన ఆశ్చర్యం సమసిపోయింది. అయితే, మేస్టార్ని పుస్తకాలు ఇమ్మని అడిగే ధైర్యం ఎవ్వరికీ లేకపోయింది.

అరుణ మేస్టారిచ్చిన పుస్తకాన్ని ఓసారి తెరిచిందిఇంట్లో. ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె ఆశించింది అదే అయినా, మేస్టారు అంత తొందరగా చొరవ తీసుకుంటారని అనుకోలేదు. అందులోంచి ఓ ఉత్తరం తొంగి చూసింది. దాన్ని తీసి ఏకాంతంగా చదువుకుంది. అందులో నాలుగే వాక్యాలున్నాయి. మళ్లీ మళ్లీ చదువుకుంది.

"అరుణా! నిన్ను చూసిన మరుక్షణం నించీ నా గుండెల్లో గుబులు... నీ కళ్లల్లో ఏ ఆకర్షణశక్తి వుందో నాకు తెలీదు- గాలం వేసి లాగుతున్నాయ్. నీ నవ్వుకి విలువకట్టటం నాకు చేతనవ్వడంలేదు. నీ స్నేహం కోరుతున్నాను. కాదనకు"

ఆ చిన్న ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదువుకుందో ఆమెకే తెలీలేదు. ఆ ఉత్తరాన్ని గుండెలకు హత్తుకుంది. పెదాలపై స్పృశించి ముద్దుపెట్టుకుంది. అదో అనుభూతి. ఒక కొత్త అనుభూతి. ఆమె కళ్లల్లో ఒక్కసారి చక్రపాణి రూపం తళుక్కుమంది. ఎంత అందంగా వుంటాడు ? అతని మాటల్లో ఎంత మాధుర్యం వుంది? అతనితో మాట్లాడ్డమే ఒక అనుభూతి...ఇలా పరిపరి విధాల అనుకుంది అరుణ. ఆరోజు రాత్రి ఆమెకి సమంగా నిద్రపట్టనేలేదు.

మేస్టారి వుత్తరానికి జవాబురాయడమా,మానడమా అన్నసందిగ్ధంలోపడింది. పోనీ నసీమ్‌ని అడిగితే అనుకుంది. అయితే ఈ అడగడంవల్ల తనే చులకనైపోతుందేమోననుకుని, ఆ తలంపునకి ఫుల్‌స్టాప్ పెట్టింది. అందుకే తనకు తానుగా ఓ నిర్ణయానికొచ్చింది. జవాబు రాసి అదే పుస్తకంలో పెట్టింది.

చక్రపాణి మాస్టారు క్లాసులోంచి వెళ్ళిపోతూ వుండగా ఆ పుస్తకాన్ని అందించింది అరుణ. చక్రపాణి తన వుత్తరాన్ని చూసి అరుణ ఏవిధంగా రియాక్టవుతుందోనని భయపడుతున్నాడు. పరిణామం ఎలా వున్నా, అందుకు సంసిద్ధుడైవున్నాడు కూడా. ప్రేమించాలంటే పిరికితనం పనికిరాదని అతనికి తెలుసు.

"అప్పుడే పుస్తకం పూర్తయ్యిం




దేవిటే అరుణా?" ప్రశ్నించింది నసీమ్.

అరుణ సన్నగా నవ్వింది. అంతేగాని సమాధానం చెప్పలేదు.

"సమాధానం చెప్పవేంటే!" మళ్లీ అంది నసీమ్.

"అసలు ఆ పుస్తకం పేరేంటో చూడలేదే!" నవ్వుతూనే శాంతంగా అంది అరుణ.

"మరయితే ఎందుకు తీసుకెళ్ళినట్టు?"

తనకీ ఆ వూళ్ళో వున్న ఒకే ఒక్క సన్నిహిత స్నేహితురాలు నసీమ్‌కి వున్నది వున్నట్టుగా చెప్పడం తన కర్తవ్యమనిపించింది అరుణకి.

"నిజం చెప్పనా?"

"నాతో నువ్వు అబద్ధం చెబుతావని అనుకోవటంలేదే!"

"అయితే విను. విని నీ మనసులోనే దాచుకో! మేస్టారి మనస్సుని నేను బాగా చదివేశాను. అందుకే పుస్తకం అడిగాను. సరిగ్గా నేను వూహించినట్టే అతని ప్రేమలేఖ ఆ పుస్తకంలో వుంది. అంతే! అదే పుస్తకంలో నా ప్రేమలేఖ ప్రయాణం చేసింది" మెల్లగా అంది ఎవరూ విననట్టు.

నసీమ్ కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. క్షణంపాటు అలాఅవాక్కయిపోయింది.

"నువ్వు చెబుతున్నది నిజమేనా? లేక నన్ను ఆటపట్టిస్తున్నావా?" నమ్మలేకపోతూ అంది నసీమ్.

"అబద్ధం చెప్పాల్సిన ఖర్మ నాకేం లేదే! మనిద్దరిమధ్యా రహస్యాలంటూ ఏమీ వుండకూడదనే నిజం చెప్పాను"

"ఇంత ధైర్యం నీకెట్లా వచ్చిందే?"

"నా మనసుకి నచ్చిన పనులు చెయ్యడానికి, నేనెప్పుడూ భయపడనని నీకు తెలుసుగా!"

"మిగతా విషయాలు వేరు. ప్రేమ విషయాలు వేరూను"

"అన్నీ ఒకటే!"

"ఇది జీవితానికి సంబంధించింది. ఆలోచించి ముందుకు సాగాలి. లేకపోతే జీవితాంతం బాధపడాల్సిందే!"

"అన్నీ ఆలోచించే ముందడుగు వేశాను"

"మరి, మీ హరిబాబు బావకిచ్చి నీకు వివాహం చేస్తారటగా!"

"ఎవరో ఏదో నిర్ణయిస్తే, దానికి నేను తలఒగ్గాలంటావా?"

"ఎవరో ఏమిటి? నిర్ణయించింది. నిన్ను కన్నతల్లి...నీ మేనమామా"

"వాళ్లు నిర్ణయిస్తే నాకేం? నేనెప్పుడూ మా బావని ఆ దృష్టితో చూళ్ళేదు. బహుశా మా ఇద్దరం ఒకేచోట పెరగటమే దీనికి కారణం అయ్యుండొచ్చు"

"అయితే మరి మీ బావకి నీమీద అనురాగం లేదంటావా?"

"అనే అనుకుంటాను"

"మీ అమ్మా, మావయ్యా బలవంతం చేస్తేనో?"

"అబ్బే! అటువంటి పరిస్థితి రాదే! మా అమ్మ మాట ఎలా వున్నా, మా మావయ్య నా మనోభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించడు"

"నీలో అంత ధైర్యం ఉన్నపుడు మరిక నేనేం చెప్పలేను. కాని, ఒక్క విషయం విస్మరిస్తున్నావేమో?"

"ఏమిటది?"

"మేష్టారు మీ కులంవాడు కాదు. ఆయన మీకన్నా అగ్రకులంవాడు"

అరుణ కిలకిల నవ్వింది.

"పిచ్చిదానా! ప్రేమకి కులాలు, మతాలు అవరోధం కాకూడదు....కావు

కూడాను. అదే నిజమైన ప్రేమంటే!" అంది.

అరుణ మాటలు నసీమ్‌కి అమృతపు జల్లులా తోచినయ్. ఆమె వెన్ను ఎవరో అదృశ్యవ్యక్తి తట్టినట్టయింది. తనలో పెరుగుతున్న అనురాగ పుష్పాల్ని ఒక్కసారి వూహించుకుని తృప్తిగా నవ్వుకుంది. ఇళ్ళు దగ్గరపడ్డంతో, ఆ టాపిక్ కట్టిపెట్టేశారు.

* * *

ఆదివారం హరిబాబు పెందరాళే లేచి స్నానం చేసి, రామాలయానికి బైలు దేరాడు.

పూజారి కృష్ణయ్య అప్పటికే పూజ చేస్తుండటం చూసి, కాస్తంత దూరంలో నిమీలిత నేత్రుడై, చేతులు జోడించి నిల్చున్నాడు హరిబాబు.

ఊళ్ళో ఉన్నప్పుడంతా రోజూ ఆలయానికి వెళ్ళి ఆ దివ్యమంగళ విగ్రహాన్ని సేవించడం అతనికి అలవాటు. ఆ పూజారికికూడా హరిబాబంటే అభిమానం. మారిపోతున్న కాలంలో ఆధ్యాత్మిక చింతన క్రమంగా రూపు మాసిపోతున్న తరుణంలో హరిబాబులాంటి విద్యార్థులు ఆధ్యాత్మిక చింతన పెంచుకుంటూ వుండటం కృష్ణయ్యకి ఎంతో ఆనందం.

పూజ ముగిసింది. నైవేద్యం పెట్టేసి హారతి సమర్పించాడు స్వామివారికి కృష్ణయ్య. ఆ హారతిని అక్కడున్న భక్తులకు అందిస్తూవుండగా, అతని దృష్టి హరిబాబు మీద పడింది.

"ఎంత సేపయ్యింది హరీ నువ్వొచ్చి?" అన్నాడు.

"మీరు పూజచేస్తుండగా వచ్చానండీ!" హారతి కళ్ళకద్దుకుంటూ అన్నాడు హరి.





అదే సమయంలో కాస్తంత ముందుగా నిల్చున్న కాంతం వెనక్కితిరిగి చూసింది. హరిబాబు ఆమెనీ చూశాడు. అభ్యంగన స్నానంచేసి కురులు విరబోసుకుని వున్న కాంతం తెల్లని పట్టుచీరలో ఆకర్షణీయంగానే కనిపించిందతనికి.

వారిద్దరి కళ్ళే పలకరించుకున్నాయి గానీ ఎవరికీ నోట మాట రాలేదు. చాలా రోజుల్నుంచీ వాళ్లు దూరదూరంగానే వుంటున్నారు.

అప్పుడప్పుడూ హరిబాబుకి అని పిస్తుంది - అర్థంలేని పెద్దల పట్టుదలలు పిల్లల్ని ప్రభావితం చేస్తాయెందుకోనని. ఆరోజూ అదే అనుకున్నాడు.

అంతలో కృష్ణయ్య వచ్చి ప్రసాదం చేతిలో పెట్టాడు. హరిబాబు కళ్లుమూసుకుని నమస్కరించి అక్కణ్నించి కదిలాడు. మందిరానికి ముందున్న మంటపం మీద కూచుని ప్రసాదం సేవిస్తున్నాడు.

కాంతం కూడా అక్కడికే వచ్చింది. ఆమె చేతిలో కొబ్బరిచెక్క వుంది. కృష్ణయ్య అందించిన పుష్పాన్ని కళ్ళకద్దుకుని తల్లో తురుముకుంటూ హరిబాబుకి కాస్తంత దూరంలో కూచుంది.

అప్పటికి చాలామంది వెళ్ళిపోతున్నారు. హరిబాబుకి అక్కడ కూచోవడం ఇబ్బందిగానే తోచింది. లేచిపోవాలనుకున్నాడు. అదిగమనించినకాంతం "కూచో బావా! నీతో మాట్లాడాలి" అంది.

చాలా రోజుల తర్వాత కాంతం నోట ఆ మాట వినడం హరిబాబుకి ఆశ్చర్యమూ ఆనందమూ కలిగించినయ్. తన తండ్రి, నరహరి మావయ్య మధ్య మన స్పర్థలు పెరిగి- రాకపోకలు, ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం ఆగిపోయి చాలా రోజులయ్యింది. మళ్ళీ ఇన్నాళ్ళకి మోడువారిన బంధుత్వానికి చిగురుపట్టి

నట్లయ్యింది.

హరిబాబు మళ్ళీ కూచుని కాంతం కేసి తిరిగాడు.

"చెప్పు కాంతం ఏవిటి?" మొహం దించుకునే అన్నాడు.

కాంతం హరిబాబుకేసి తదేకంగా చూసింది. అప్పుడప్పుడూ హరిని చూస్తున్నా, అంత సామీప్యంలో అతణ్ణి చూడ్డం చాలా రోజుల తరువాత అదే ప్రథమం. అతనిలో బాగా మార్పు వచ్చినట్లనిపించింది. ఆ మొహంలో కొత్త ఆకర్షణ కొట్టొచ్చినట్టు కనిపించింది.

"ఆడపిల్లను-నేను మొహం దించుకోవల్సింది. అటువంటిది నువ్వు మొహం దించుకున్నావేంటి బావా ?" నవ్వుతూ అంది కాంతం.

"అబ్బే...ఏంలేదులే! నా స్వభావం నీకు తెలిసిందేగా! ఏదో మాట్లాడాలన్నావు. చెప్పు" ఆమె కేసి ఈసారి సూటిగా చూస్తూ అన్నాడు హరి.

"పెద్దల పట్టుదలల పర్యవసానంగా మనం ఇలా దూరంగా వున్నాంగాని, లేకుంటే ఎంత సన్నిహితులుగా తిరగవల్సినవాళ్ళమో ఒక్కసారి ఆలోచించు" అంది కాంతం.

"ఔను. అదే నేనూ అప్పుడప్పుడు అనుకుంటూ వుంటాను"

"ఔనా! మరి అటువంటప్పుడు ఈ తరంవాళ్ళమైన మనం ఎందుకు వాళ్ళని మార్చకూడదు? మన కుటుంబాల మధ్య ఏర్పడ్డ ఈ అగాధాల్ని ఎందుకు మనం పూడ్చకూడదు"

"ఈ విషయంలో నేను నీతో ఏకీభవిస్తాను కాంతం! కాని, వాళ్ళు మనం చెప్పినా మారుతారన్న నమ్మకం నాలో కలగడంలేదు"

"మనం ప్రయత్నించకుండా ఆ నిర్ణయానికి రాకూడదేమో"

"మా నాన్నని ఒక దారికి తీసుకురావచ్చు. కానీ, మీ నాన్న విషయమే అనుమానాస్పదం"

"ప్రయత్నిస్తే అసాధ్యమైన పని ఏమీ వుండదు. చదువుకున్నవాడివి... యోగ్యుడివి. నువ్వే ఈ ప్రయత్నానికి పూనుకోవాలి. నా సహకారం ఎప్పుడూ వుంటుంది"

"సరే! అవకాశం చూసి ప్రయత్నిస్తాన్లే"

"మా చెల్లాయి అరుణ బాగా చదువుకుంటుందా?"

"అనే అనుకుంటున్నాను"

"స్కూలు ఫైనల్‌తో దాని చదువు ఆపేస్తున్నావా?"

"ఆపేయడానికి నేనెవర్ని ? అరుణ ఇష్టం"

కాంతం హరిబాబుకేసి అదోలా చూసింది. "అదేవిటి బావా, అలా అంటున్నావు? నీకు కాబోయే అర్ధాంగి చదువు విషయంలో నీ యిష్టం, నీ ప్రమేయం లేకుండా ఎలా?"

విస్తుపోయి కాంతం కేసి చూశాడు హరిబాబు.

"అరుణ నాకు కాబోయే అర్ధాంగా? అలా అని ఎవరు చెప్పారు?" ఆశ్చర్యపోతూనే అడిగాడు.

"వూళ్ళో అందరూ అనుకుంటున్నదే! మా నాన్న కూడా అదే అన్నారు"

"ఎవరేం అనుకున్నా నేను మాత్రం అటువంటి అభిప్రాయంతో లేను కాంతం! ఒకవేళ అటువంటి ప్రతిపాదన ఏదైనా వచ్చినా నేను అంగీకరించను. వివాహ విషయంలో ఎవరి స్వేచ్ఛ వారిది...." నిష్కర్షగా చెప్పాడు హరిబాబు.



కాంతం ఏవిషయం రాబట్టుకోవాలని ఈ ప్రస్తావన తెచ్చిందో, ఆ వుదంతం తెలిసిపోయింది. ఒకసారి తనతో నాన్న అన్న విషయం జ్ఞప్తికొచ్చింది. అరుణని వివాహం చేసుకోడానికి ఎలాగో హరిబావ సుముఖంగా లేడుగాబట్టి, తను చెప్ప దల్చుకున్నది చెప్పొచ్చుననుకుంది.

"సరిగ్గా నా అభిప్రాయమూ అదే బావా! నిజానికి ఇవ్వాళ నీతో మాట్లాడానికి నేను సాహసించానంటే కారణం ఆ సాహసమే" నవలలు విపరీతంగా చదువుతుందిగాబట్టి డొంకతిరుగుడుగా చెప్పింది.

హరిబాబుకి ఆమె మాటలు అర్థం కాలేదు.

"అంటే..?"

"అదే బావా...'ప్రేమ'! నీ గురించే నేనెప్పుడూ కలలుగంటూ వుంటాను. నీ స్వరూపమే నా కళ్ళల్లో ఎప్పుడూ కదలాడుతుంది. మనం పెళ్ళిచేసుకుంటే, ఇంతవరకూ బద్ధవైరులుగా వున్న మన రెండు కుటుంబాల్లోని పెద్దలు బంధుత్వాన్ని పెంపొందించుకుంటారు. అది ఒక్క మన కుటుంబాలవరకే పరిమితం కాదు. ఈ వూరికే శ్రేయస్కరం. నీకు తెలుసు–నేను చాలా ఖచ్చితంగా మాట్లాడే మనిషినని. అందుకే నా మనసులోని మాట వున్నది వున్నట్టు వెల్లడించాను... నువ్వు 'ఊ' అంటే చాలు. మా నాన్నని నేను ఒప్పిస్తాను...ఏమంటావ్?" గుక్క తిప్పకుండా అంది కాంతం.

హరిబాబుకి ఒక్కసారి కళ్ళు తిరిగినట్టయ్యాయి. మరో కొత్త సమస్య ప్రారంభంకాబోతుందేమోననుకుని కలవరపడ్డాడు. కాంతం అంటే అతనికి మొదట్నుంచీ సదభిప్రాయం లేదు. ఆమె కుండబద్దలుకొట్టినట్టు మాట్లాడే స్వభావం అతనికి నచ్చదు. అదీగాక అతను ఆరాధించే మనిషి వేరే వుంది. అటువంటప్పుడు ఈ సమస్యను ఆదిలోనే అంతం చెయ్యడం శ్రేయోదాయకమనుకున్నాడు.

"నీ నిజాయితీని నేనెంతగానో హర్షిస్తున్నాను కాంతం. అయితే నా హృదయం అప్పుడే ఒకరికి అంకితమయ్యింది. అందుకని నీలో ఆశల్ని రేకెత్తించడం నాకిష్టంలేదు. నీ అభిలాషలను, అనురక్తిని మనసులోంచి తుడిచేసుకో! మరేం అనుకోకు. వస్తామరి!" అంటూ ముందుకు సాగిపోయాడు హరిబాబు.

కాంతం మొహం జేవురించింది. ఒక విధంగా అవమానం పొందినట్టే అయ్యిందామెకి.

ఏడుపొచ్చినట్టయ్యింది. హరి ఎంత సున్నితంగా తృణీకరించాడు? ఇంతకీ అతని హృదయం అంకితమయ్యిందెవరికి? ఈ వూళ్ళోనా? లేక పట్నంలోనా?..ఆమె అంతరంగం ఆలోచించింది. కాని సమాధానం దొరకలేదు. మెల్లగా లేచి ఇంటికేసి నడిచింది.

* * *

నసీమ్ తండ్రి హుస్సేన్ ఆ వూళ్ళో ఇరవై ఏళ్ళనించీ వుంటున్నాడు. అతడా వూరు భార్యతోకలిసి వచ్చేడు. అక్కడికి వచ్చాక నసీమ్ పుట్టింది..ఆ దంపతులకు నసీమ్ ఒక్కతే సంతానం. తర్వాత ఓ అబ్బాయి పుట్టి చనిపోయాడు. వున్న ఒక్క కూతుర్ని అల్లారుముద్దుగా పెంచుతున్నారు.

హుస్సేన్ ఆ వూరు వచ్చేసరికి ఒకే ఒక్క టైలర్ వుండేవాడు. హుస్సేన్ వచ్చి టైలరింగు షాపు పెట్టిన అనతి కాలంలోనే మంచి పేరుతెచ్చుకున్నాడు. చేతినిండా పనుండేది. వూళ్ళో అందరి




తోనూ మంచిగా వుంటూ అందరి అభిమానాన్ని చూరగొన్నాడు.

హుస్సేన్ ఆ వూరు రావడానికి కారణం శివయ్యే. ఆయన బంధువొకరు విజయనగరంలో వున్నాడు. అప్పట్లో ఆ బంధువు ఓ ఉత్తరం రాస్తూ హుస్సేన్‌ని శివయ్య దగ్గరికి పంపించాడు. శివయ్య హుస్సేన్‌కి ఓ చిన్న ఇల్లు చూసిపెట్టి ఆదరించాడు. మొదట్లో అతనికి ఏ ఇబ్బందీ కలక్కుండా ఆదుకున్నాడు. అందుకే శివయ్య కుటుంబం పట్ల హుస్సేన్‌కి కృతజ్ఞతాభావం. జీవితంలో తనకో మార్గం చూపించిన వ్యక్తి అని శివయ్య పట్ల అభిమానం.

ఆ వూళ్ళో మరో ముస్లిమ్ కుటుంబం లేకపోయినా, మసీదు లేకపోయినా హుస్సేన్ ఎప్పుడూ బాధపడలేదు. నియమం ప్రకారం నమాజు చదువుకునేవాడు. వూళ్ళోవాళ్ళంతా తనవాళ్ళే అనుకునేవాడు. అందుకే ఎవరితోనూ అతనికి విరోధం వుండేదికాదు. జీవితం సాఫీగా సాగిపోయేది.

ఇటీవల హుస్సేన్ దంపతులకు సమస్య ఎదురయింది. అమ్మాయి నసీమ్ యుక్తవయస్కురాలయ్యింది. ఆమెకి పెళ్ళి చెయ్యాలి. అంటే, సంబంధాలు వెదకాలి. ఆ పల్లెటూర్లో ముక్కుమూసుక్కూమంటే సంబంధాలు రావని వారికి తెలుసు. అలాగని, ఇప్పుడు కొత్తగా పట్నం మకాం మార్చాలంటే ఎన్నో ఇబ్బందులున్నాయి.

హుస్సేన్ భార్య ముంతాజ్ భర్త చెప్పిందాంతో పూర్తిగా ఏకీభవించింది. "అక్కడి జీవితం ఖరీదైనది. మనలాంటి సామాన్యులకు అందుబాటులో వుండదేమో అండీ"

"అయితే, మన సమస్య ఎలా పరిష్కారమవుతుంది? తలవని తలంపుగా మనం అనుకోవటంకాదు గాని, అమ్మాయి కాస్త అందమైనది కావటం వల్ల అందరి కళ్ళు దానిమీదే వుంటాయి. రోజులు మంచివికావు. అందుకే దానికి పెళ్ళి చేసేస్తే మన బాధ్యత తీరుతుంది. ఇంక మనం నిశ్చింతగా జీవితాన్ని గడిపేయొచ్చు" అన్నాడు హుస్సేన్.

"ఓసారి పట్నం వెళ్ళి వాకబు చేసి రండి — మనమ్మాయికి తగిన అబ్బాయి ఎవరైనా దొరుకుతాడేమో" అంటూ సలహా ఇచ్చింది ముంతాజ్.

"కాదు. అంతకుమించి వేరే మార్గం లేదు" అన్నాడు హుస్సేన్.

"అవసరమనుకుంటే అమ్మాయిని కూడా మీతోపాటు తీసుకెళ్ళండి. ఏమంటె ఓ రెండు రోజులు మీ చిన్నాన్న ఇంట్లో వుంచి వస్తారు" అంటూ ప్రతిపాదించింది ముంతాజ్.

హుస్సేన్ కాదనలేక పోయాడు. ఒక విధంగా అలా చెయ్యటమే మంచిదనిపించింది కూడా.

"అలాగే చేద్దాం ముంతాజ్" అన్నాడు.

రెండురోజుల తర్వాత కూతురు నసీమ్‌ని తీసుకుని పట్నం బైలుదేరాడు హుస్సేన్.

బస్సుస్టాండు దగ్గరికి వెళ్ళేసరికి అక్కడ హరిబాబు కలిశాడు. హరిబాబుని చూడగానే ఒకసారి సంబరపడిపోయిన నసీమ్, మరోవంక సిగ్గుతో మొహం దించుకుంది. "ఏమిటండీ హుస్సేన్‌గారూ, మీరూ పట్నమేనా?" ప్రశ్నించాడు హరిబాబు.

"అవును బాబూ! మా చిన్నాన్నగారింటికి వెళ్ళాలి" సమాధానం చెప్పాడు

హుస్సేన్.

హరిబాబు చదువుకున్నవాడూ, ఒక అంతస్తుగల కుటుంబానికి చెందిన వాడూ అయినా తనలాంటి ఒక సామాన్య కుట్టు పనివాణ్ణి గౌరవ పూర్వకంగా సంబోధించడం, మాట్లాడ్డం హుస్సేన్‌కి ఆనందం కలిగిస్తుంటుంది. అందుకే అతనంటే హుస్సేన్‌కి గౌరవం.

"ఓ...అలాగా! వారం రోజులుంటారా అక్కడ?"

"అబ్బే ... లేదు బాబూ! ఓరోజు, లేకపోతే రెండ్రోజులూను వీలున్నంత త్వరగా వచ్చేస్తాం. నాకు చేతినిండా పనుందిక్కడ. వుండిపోతే ఎలా?"

అంతలో బస్సు వచ్చింది. అందరూ వెళ్ళి కూచున్నారు.

"ఏదో మీ నాన్నగారి పుణ్యమా అంటూ ఈ బస్సు పడిందిగాని పూర్వం పట్నం వెళ్ళాలంటే ఓ పెద్ద సమస్య అయ్యేది" అన్నాడు హుస్సేన్.

"పంచాయతీ సమితులు ఈమాత్రం సౌకర్యాన్ని కలిగించకపోతే పల్లెలు అభివృద్ధి చెందేదెట్లా?"

బస్సు కదిలింది. కండక్టరు టిక్కెట్లకి వస్తే, హరిబాబు మూడు టిక్కెట్లు తీసుకున్నాడు.

"అదేంటి బాబూ....నేను తీసుకుంటానుగా" అన్నాడు హుస్సేన్.

"ఎవరైతే ఏంలెండి! ఈసారి మనం బస్సులో కలిసినపుడు మీరిద్దురుగాని. సరేనా?" చిన్నగా నవ్వుతూ అన్నాడు హరి.

"సరేలే బాబూ! నీ మనసు చిన్న పుచ్చడం ఎందుకు ?" అనేసి వూరుకున్నాడు హుస్సేన్.

"పట్నంలో మీకుచాలామంది బంధువులున్నారా?"

"చాలా మంది వున్నారని చెప్పలేను గాని, సుమారుగా ఓ పదిళ్ళ వాళ్ళున్నారు. ముఖ్యంగా మా చిన్నాన్నగారున్నారు. ఇప్పుడు వెళ్ళడం వాళ్ళింటికే"

"అయితే, ఏదో పని మీదే వెళ్తున్నారనుకొంటాను?"

"ఔను బాబూ, మనవూళ్ళో మావాళ్ళెవరూ లేరని నీకూ తెలుసు. మరి, మా నసీమ్‌కి పెళ్ళి చెయ్యాలంటే ఏవో సంబంధాలు చూడాలి కదా? పట్నంలో మా చిన్నాన్న ద్వారా చూడాలనుకుంటున్నాను"

అంతవరకూ ఎంతో వుత్సాహంగా మెరిసిపోతున్న హరిబాబు మొహంలో హఠాత్తుగా రంగులు మారినయ్. నసీమ్ కూడా తృళ్ళిపడినట్టయింది. ఆమెకి అంతవరకూ తెలీదు, తనని పట్నం ఎందుకు తీసుకు వెళ్తున్నారో. మామూలుగా తాతయ్యగారింటికి వెళ్తున్నామనే అనుకుంది. అసలు విషయం తెలిగానే బెదురు చూపులతో క్రీగంట హరిబాబుకేసి చూసింది. ఆ చూపులో అనురాగం, ఆకర్షణ, దీనత్వం అన్నీ మిళితమై వింత కాంతి ప్రస్ఫుటమౌతోంది.

కొద్ది క్షణాలు మౌనం...

హరిబాబు ఆలోచనల్లో పడ్డాడు. అయితే తాను మౌనంగా ప్రేమిస్తూ, ఆరాధిస్తోన్న నసీమ్‌కి పెళ్ళి కాబోతుందన్న మాట. ఈ అనురాగపూరిత దృక్కులు తనని ఎప్పుడో బంధించాయి. ఆరోజు అలాగే చూసింది. ఆ చూపుల్లో ఎంత దైన్యం వుంది. ఇంతకీ ఆమె తనని ప్రేమిస్తున్నట్టా లేదా? ఈ మూగ అనురాగానికి అర్థం లేదేమో! తన హృదయాన్ని విప్పి ఆమెకి చెప్పుకోలేక




పోవటం తన బలహీనతే కావొచ్చు. తనే ధైర్యంచేసి చెప్పలేకపోతున్నపుడు, ఆమె స్త్రీ...సిగ్గు విడిచి చెప్పగల సాహసం వుంటుందా? ఏది ఏమైనా ఆమెకి తన మనసులోని మాట చెప్పటం లేదా తెలియజెయ్యటం చాలా అవసరం. అయితే ఎలా...? ఈవిధంగా ఆలోచనల్ని సాగించాడు హరిబాబు.

"ఏంటి హరిబాబూ, అంత తీవ్రంగా యోచిస్తున్నావు?" అడిగాడు హుస్సేన్.

"అబ్బే...ఏం లేదు. హుస్సేన్ గారూ" తొట్రుపాటు పడుతూ అనేశాడు.

బస్సు ఆగింది.

మూడుకాఫీలు తీసుకున్నాడు హరిబాబు. తానొకటి తీసుకుని, మిగిలిన రెండూ హుస్సేన్ కి, నసీమ్ కి అందించాడు.

"ఇప్పుడెందుకు బాబూ ఇవన్నీను?" అంటూనే అందుకున్నాడు హుస్సేన్. కూతురు తీసుకోడానికి సంశయిస్తూంటే 'తీసుకో బేటీ!' అన్నాడు.

నసీమ్ అందుకుంది. చిత్రకారుడు బొమ్మలో గీసినట్టున్న పొడుగాటి ఆమె చేతి వేళ్ళు చూసి ముగ్ధుడయ్యాడు హరిబాబు.

బస్సు మళ్ళీ స్టార్టయ్యింది.

"ఔనూ, డాక్టరీ చదవడానికి నీకు సీటు దొరక్కుండా, దాసుకి దొరికిందని విని ఎంతో విచారించాను బాబూ!" ప్రస్తావన ప్రారంభించాడు హుస్సేన్.

హరిబాబు చిన్నగా మందహాసం చేశాడు. "విచారించడం దేనికండీ! నా స్నేహితుడికేకదా దొరికింది. అందే నాకు దొరికినట్టే. మన ఊరివాడొకడు



డాక్టరీ చదువుతున్నాడంటే మన మందరమూ సంతోషించాలి" అన్నాడు.

హరిబాబు మనస్తత్వాన్ని హుస్సేనే కాదు – నసీమ్ కూడా మనసులోనే అభినందించారు.

"మీదీ మీ నాన్నగారిలాంటి మనస్సే హరిబాబూ" అన్నాడు హుస్సేన్.

ఇలా ఏవో సంభాషణలు సాగినయ్. ఈ వ్యవధిలో ఎన్నోసార్లు హరిబాబు, నసీమ్ దృక్కులు మౌనంగా పలకరించుకుంటూనే వున్నాయి. ఆ ఇరువురి మనసుల్లో వింత అనుభూతి.

బస్సు శ్రీకాకుళం చేరుకుంది. హుస్సేన్, నసీమ్ దిగారు. వారివెంట హరిబాబు కూడా దిగాడు.

"మరి, వెళ్ళొస్తాం హరిబాబూ!" అన్నాడు హుస్సేన్.

"మంచిదండీ" అన్నాడు హరిబాబు.

"వస్తానండీ!" అనుకోకుండా చెప్పేసి తీరా చెప్పాక నాలిక కర్చుకుంది నసీమ్. అయితేనేం మించిపోయిందప్పటికే.

హరిబాబు తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు. నసీమ్‌కి అంత ధైర్యం ఎలావచ్చిందో అనుకున్నాడు. "వెళ్ళిరా" అనేశాడు చిరునవ్వుతో. ఆమె కూడా ముసిముసిగానవ్వుకుంది.

విడివిడిగా ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.

* * *

చక్రపాణి, అరుణల పరిచయం క్రమంగా ప్రేమగామారి, సాన్నిహిత్యం పెరుగుతున్నట్టు చూచాయగా విన్న శివయ్య హతాశుడయ్యాడు. కొందరు అమ్మలక్కలు చెప్పగా తెలుసుకున్న కమల కూతుర్ని చెడామడా తిట్టింది.





చెయ్యి చేసుకోబోయింది. కాని అరుణ అరుణకాంతుల్ని చిమ్ముతూ చూసిన చూపులకు స్తంభించిపోయింది. "నేనింకా చిన్న పాపనే అనుకుంటున్నావేమిటమ్మా. తిట్టడానికి, కొట్టడానికీను. పద్దెనిమిదేళ్ళు వచ్చినయ్. కొద్ది నెలల్లో మైనారిటీ కూడా తీరిపోతుంది. నా జీవితం ఏమిటో, నా భవిష్యత్తేమిటో, నా భర్తగా ఎవర్ని ఎన్నుకోవాలో నాకు తెలుసు. నేనేం చదువులేనిదాన్ని కాదు. నా స్వేచ్ఛ నాకు కావాలి. నా భవిష్యత్తుని నిర్మించుకునే హక్కు నాకు కావాలి. అందుకే నేను ప్రేమించాను. ప్రేమించడం తప్పుకాదు" అంటూ ఆవేశంతో చెప్పుకుపోతోంది అరుణ.

పక్క గదిలోకి వెళ్తూ అరుణ మాటల్ని విన్న శివయ్యకి ఒళ్లు మండిపోయింది, కళ్లు ఎరుపెక్కినయ్. అరుణ అంతగా రెచ్చిపోయి మాట్లాడ్డానికి కొంత వరకూ తాను ఆమెని వెనకేసుకురావడమే నేమోనని తనని తానే నిందించుకున్నాడు. మెల్లగా ఆ గదిలోకి అడుగుపెట్టాడు.

"అరుణ విషయంలో నేనెన్నిసార్లు నీతో చెప్పినా నువ్వు వినిపించుకోలేదన్నయ్యా! అసలు దాని చదువు ఎనిమిదో క్లాసుతోనే ఆపించేయమన్నాను. నువ్వూ, హరి కూడా దాన్ని చదివిస్తామని పట్టుబట్టారు. ఇప్పటికయినా మించిపోయిందేమీ లేదన్నయ్యా! అరుణకి చదువు మాన్పించేస్తేసరి. హరి చేత ఆ మూడు ముళ్ళూ వేయించేస్తే అక్కడికి సమస్యే వుండదు"

శివయ్య క్షణం యోచించాడు. చెల్లాయి చెప్పిందే శ్రేయస్కరంగా తోచింది.

"అలాగే చెల్లాయ్...అబ్బాయ్‌రానీ. వాడితో మాట్లాడుతాను" అన్నాడు.

తన మనసులోని మాట వ్యక్తం

చేసెయ్యాలనుకుంది అరుణ. ఇంక వుపేక్షిస్తే తరుణం మించిపోవచ్చనుకుంది.

"ఆ ప్రయత్నం మానుకోండి మావయ్యా" అంది ధైర్యంగా.

శివయ్య, కమల విస్తుపోయి అరుణ కేసి చూశారు.

"అంటే ఏమిటి నీ ఉద్దేశం అరుణా?" కోపంగా అడిగింది కమల.

"హరి బావని పెళ్ళి చేసుకోవాలనే తలంపుగాని, ఆ అభిప్రాయంగాని నాకు లేదమ్మా! మొదట్నుంచీ బావని ఆ దృష్టితో చూళ్ళేదు. నాకేకాదు...బహుశా బావకీ ఇదే అభిప్రాయం వుండొచ్చు" అంది అరుణ.

కమల స్తంభించిపోయింది. ఆమె నిర్మించుకున్న వూహా సౌధాలన్నీ ఒక్కసారి కూలిపోయినట్టయ్యింది.

"పెద్ద ఆరిందలా మాట్లాడుతున్నావేమిటే అమ్మాయ్! నీ వయస్సెంత? నీకీ వూహ ఎలా కలిగింది? ఏమిటోనమ్మా.. నీ గురించి నేనెంతగా ఆరాటపడుతున్నానో అందులో నూరోవంతయినా నీ గురించి నువ్వు యోచించడం లేనట్టుంది. జీవితమంటే బొమ్మలాట కాదమ్మా... నూరేళ్ళపంట..'' అంది.

"ఆ మాటే నేనూ అంటానమ్మా! జీవితమంటే నూరేళ్ళపంటగాబట్టే నాకు నచ్చిన వ్యక్తిని నా జీవిత భాగస్వామిగా చేసుకోదలిచాను."

అరుణ మాటల్లో వచ్చిన పరిణతికి విస్తుపోయాడు శివయ్య. కేవలం ఓ శ్రోతలా అవన్నీ వినదల్చుకోలేదు.

"అంటే నీ వుద్దేశంలో నీకు నువ్వే స్వతంత్రురాలివన్నమాట! ఏమే....?" గద్దించాడు శివయ్య.

''ఈ ఒక్క విషయంలో ఆపాటి స్వేచ్ఛ వుండకూడదా మావయ్యా?''

శివయ్య భారంగా ఓ నిట్టూర్పు విడిచాడు.

''నిన్ను చాలా తప్పుగా అంచనా వేశాను అరుణా! నువ్వీ ఇంటి కోడలివై ఈ ఇంటిని తీర్చిదిద్దుతావనుకున్నాను. కాని నీలో అటువంటి బాధ్యతాయుతమైన ఆలోచనల్లేవు. పైగా 'స్వేచ్ఛ' 'స్వాతంత్ర్యం' అంటూ వుపన్యాసాలిస్తున్నావు. నీ వుపన్యాసాల్ని వినడానిక్కాదు మేం వున్నది. నిన్నో మార్గాన పెట్టడానికే వున్నాం. ఊళ్ళో అందరికీ సలహాలిచ్చే ఈ శివయ్య నీ సలహాలు వినడు. అది గుర్తుంచుకో. నలుగురూ మనల్ని హర్షించే విధంగా మన ప్రవర్తన వుండాలిగాని విమర్శించే విధంగా కాదు. ఆలోచించుకో! ప్రస్తుతానికి నువ్వు చదవనక్కర్లేదు. నువ్వు చదివి వుద్యోగాలూ చెయ్యనవసరం మనకిలేదు. వూళ్ళు ఏలనవసరం లేదు. ఇప్పుడు కర్తవ్యం ఏమిటో హరి బావ వచ్చాక నేను ఆలోచిస్తాను..'' అని తన నిర్ణయాన్ని తెలియజేస్తూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

అరుణ నిశ్చేష్టురాలయ్యింది. ఇప్పుడేం చెయ్యాలో ఆమె వూహకి అందలేదు. చక్రపాణిని చూడకుండా తను వుండగలదా? స్కూలు మానేస్తే అతణ్ణి చూడ్డం ఎలా? ఎలా కలవడం?.... ఆలోచనల్లో పడింది. ఆమె మొహంలో కత్తివేటుకు నెత్తురుచుక్కలేదు. అలా వెళ్ళి కుర్చీలో కూలబడిపోయింది.

కమలకి దుఃఖం ఆగడం లేదు.

"నువ్విలా తయారవుతావని నేనెప్పుడూ అనుకోలేదమ్మా! మీనాన్నగారు దురదృష్టవశాత్తు చనిపోయినా నిన్ను చూసుకుని, నీ భవిష్యత్తుని ఉజ్వలంగా

పూహించుకుని సంతృప్తితో కాలం గడుపుతున్నాను. అటువంటిది నాకిప్పు డంతా నిరాశే మిగిల్చావు. అది నా దుర దృష్టమమ్మా! ఎవర్నని ఏం లాభం?" అనేసి, చీరచెంగుతో కళ్ళొత్తుకుంటూ అక్కణ్నించి వెళ్ళిపోయింది.

అరుణ ముఖం మసక బారిపోయింది. ఆమె మొహమునిండా ఆలోచనలే!

* * *

నరహరి భార్య శాంతమ్మ అనా రోగ్యంతో మంచమెక్కింది. ఆ పూళ్ళోని ఆయుర్వేద వైద్యుడు, హోమియో వైద్యుడు ఆమెకి చికిత్స చేసి, విఫలు రయ్యారు. ఆమెకి పట్టిన జ్వరం తగ్గడం లేదు. క్రమక్రమంగా నీరసించిపోతోంది. నరహరికి భయంపట్టుకుంది ఆమె ఏమై పోతుందోనని. ఉపేక్షించకుండా పట్నం తీసుకెళ్ళాడు. అక్కడి డాక్టర్ల పరీక్ష చేసి, విశాఖ తీసుకుపొమ్మన్నారు. చేసేదిలేక భార్యను వాల్తేరు తీసుకుపోయి కె.జి. హాస్పిటల్లో చేర్పించాడు.

నరహరి దాయాది కాళిదాసు వాల్తేరు లోనే ఉంటున్నాడు. అతనికి కలెక్ట రాఫీసులో ఉద్యోగం కె.జి. హాస్పిటలుకి దగ్గర్లోనేఅతనో అద్దెఇంట్లోఉంటున్నాడు. అతను చేస్తున్నది యు.డి. క్లర్కే అయినా, రెండుచేతులా ధనార్జన చేస్తూం డటం వల్ల జీవనసరళి కాస్త పైఅంతస్తులోనే ఉంటుంది. ఓ స్కూటర్ మెంటెయిన్ చేస్తున్నాడు. ఫ్రిజ్ ఉంది. టేప్‌రికార్డరు, రికార్డుప్లేయరూ - ఇవన్నీ ఉన్నాయి. అతనీస్థాయి జీవితాన్ని సాగిస్తూ ఉండటం కేవలం పైరాబడి వల్లనే కాదు - స్థిరాస్తులున్నాయంటాడు కొందరు. ఏది ఏమైనా, అతను జీవితాన్ని సుఖమయం చేసుకున్న మనిషి.

కాళిదాసు ఇంట్లోనే ఉంటున్నారు నరహరి, కాంతం కూడాను. మేనమామే గాబట్టి కాంతంకి బాగా చనువు ఏర్పడింది.

హాస్పటల్లో రికమండేషన్లూ, లంచాలు విచ్చలవిడిగా ఉన్నాయంటారు-అయినా సరే! అందరూ అక్కడికే వెళ్తారు- అక్కడ నిపుణులైన డాక్టర్లూ, విదేశాల్లో డిగ్రీలు తీసుకుని వచ్చిన స్పెషలిస్టులూ ఉన్నారు గాబట్టి.

శాంతమ్మని హాస్పిటల్లో చేర్చాక ఏవేవో పరీక్షలు చేశారు... చేస్తూనే ఉన్నారు.

ఆరోజు నరహరి ముందు గదిలో కూచుని కాఫీ తీసుకుంటున్నాడు. కాంతం ఏదో వారపత్రిక చదువుకుంటోంది. అప్పటికే కాళిదాసు భార్య వాళ్ళిద్దరికీ కాఫీ తెచ్చి అందించింది.

"అమ్మా లక్ష్మీ! నీకు శ్రమ అవు తోందమ్మా..." అన్నాడు నరహరి. కాఫీ సిప్ చేస్తూ.

లక్ష్మి చిన్నగా నవ్వింది. ఆ నవ్వే చెబుతోంది-ఆమెలో అంతులేని సహనం ఉందని.

"ఇందులో శ్రమేముంది బాబాయ్? మీరు పరాయివాళ్లు కాదు. పిన్నికి బాగు లేక ఇలా వచ్చారుగాని లేకుంటే, వస్తారా? మిగురించి ఈపాటి చెయ్యకపోతే, ఇంకేం బంధుత్వాలు చెప్పండి?" అంది సౌమ్యంగా

"అమ్మాయి కాంతం, నువ్వు అక్కకు సహాయపడుతూ ఉండాలమ్మా" కాంతంని ఉద్దేశించి అన్నాడు నరహరి.

"నన్ను ఏ పనీ చేయనివ్వదు నాన్నా! నేనేం చెయ్యను?" అంది కాంతం.

"బాబాయ్! మీరీ విషయంలో బాధ పడకండి. అవసరమొచ్చినపుడు కాంతంకి నేనే పనులు పురమాయిస్తాను.

 

సరేనా?"

"అలాగేనమ్మా! నువ్వేమీ సంకోచించకు... ఇంతకీ, మీ పిన్ని ఇంకెన్నాళ్లు హాస్పిటల్లో ఉండాల్సి వస్తుందో, ఏమిటో? అంతవరకూ నేనిక్కడ కూచుంటే అవ్వదు. నాలుగు రోజులు పోయాక ఓసారి వెళ్ళిరావాలనుకుంటున్నాను. కాళిదాసుతో చెప్తాలే!"

"అలాగే వెళ్లిరండి బాబాయ్! మేం ఉన్నాంగా!"

"ఆ ధైర్యంతోనే వెళ్తానంటున్నానమ్మా" అన్నాడు నరహరి తృప్తిగా.

"నిశ్చింతంగా వెళ్లిరండి..." అనేసి అక్కణ్నించి లోపలకు వెళ్లిపోయింది లక్ష్మి.

కాఫీ తీసుకోవడం పూర్తి చేసి, ఖాళీ కప్పుని బల్లమీద పెట్టాడు నరహరి.

"నాన్నా! మీరు మన వూరు వెళ్ళకపోతే అవ్వదా? ఇప్పుడంత అవసరం ఏముందని?" అడిగింది కాంతం.

"ఇది పంట సమయం కదా! ఓసారి వెళ్లిరావాలి. లేకపోతే ఇవ్వాల్సిన పైకం ఎగ్గొట్టేస్తారు. ఏదీ... ఓ వారం రోజులుండి వచ్చేస్తాను. ఈ వారం రోజులూ నువ్వు అమ్మని చూస్తూ ఉండాలమ్మా!"

"ఇంతకీ డాక్టర్లు ఏం చెబుతున్నారు నాన్నా?"

"ఇదమిత్థమని ఇంకేమీ చెప్పడం లేదమ్మా! మా ప్రయత్నాలు మేం శక్తి వంచన లేకుండా చేస్తున్నామంటున్నారు తప్పించి, ఏం చెప్పలేకపోతున్నారు. మనం మాత్రం ఇంకేం చెయ్యగలం చెప్పు?" నిస్పృహతో అన్నాడు నరహరి.

నరహరి భారంగా నిట్టూర్పు విడిచాడు. జీవితంలో ఎప్పుడూ అనుభవించని ఆవేదనని ఇప్పుడు అనుభవిస్తున్నాడు. భార్య అస్వస్థత అతణ్ణి బాగా కృంగదీస్తోంది.

"అమ్మాయి, కొడుకువయినా, కూతురివయినా నువ్వేనమ్మా మాకు. కొడుకులు లేరన్న విచారం, నిస్పృహ నాకెప్పుడూ లేదు... వుండదు కూడాను. ఉన్న ఒకే ఒక్కదానవు నువ్వు. నిన్నో మంచివాడికిచ్చి పెళ్ళిచేసేస్తే నా బాధ్యత తీరిపోతుంది. అయితే నేనాశించిన ఆ మంచి సంబంధం ఏదీ కుదరడంలేదు. భగవంతుడు అంతులేని ఐశ్వర్యం ఇచ్చాడు. కాని ఎందుకు? ఎవరనుభవించడానికి? వున్న వాళ్ళం మన ముగ్గురం హాయిగా, సుఖంగా, నిశ్చింతగా బతికితే అదే చాలనిపిస్తుంది. కాని, ఆ సుఖమూ, ఆ నిశ్చింత అందుబాటుకి రాకపోవడం నా దురదృష్టమే" నిరాశతో అన్నాడు నరహరి.

"ఇప్పటికయినా మించిపోయిందేమీ లేదు నాన్నా! మీ నైజాన్ని మార్చుకోండి. ధనార్జనాకాంక్షను వదిలి పరోపకారం ధ్యేయంగా పెట్టుకోండి. అప్పుడు చూడండి మిమ్మల్ని ఎంతమంది అభిమానిస్తారో. మీరూ శివయ్య మావయ్యలా అందరికీ హితులే అవుతారు. సన్నిహితులవుతారు. నాన్నా...ఒక్క విషయం అడగనా?" సూటిగా తండ్రికళ్ళల్లోకి చూస్తూ అంది కాంతం.

"అడుగమ్మా"

"శివయ్య మావయ్య కుటుంబానికీ, మన కుటుంబానికీ మధ్య వుండే వైరుధ్యం ఏమిటి నాన్నా? ఇంతదగ్గరి బంధువులం, అంతగా దూరమవ్వడానికిగలకారణం ఏమిటి నాన్నా?"

కూతురు వెలిబుచ్చుతోన్న అభిప్రాయాలకు, వేస్తోన్న ప్రశ్నలకు కాస్సేపు తబ్బిబ్బవుతున్నాడు నరహరి.

బయిటేసేం జరిగినదాంట్లో ఏ ఒక్కటీ సబబుగా అగుపించలేదు. అందుకే కోపగించుకోలేకపోతున్నాడు.

"ఎందుకలా అంటే నిష్ఠూరంగా 'ఏలాగా' అని ఏం చెప్పలేకపోయా! అంతదగ్గరివాడై యుండి కూడా సందాయపతి ప్రెసిడెంటు పదవికోసం నాకెప్పుడూ ప్రత్యర్థిగానే నిల్చి ఆ పదవిని గెల్చుకుంటున్నాడు శివయ్య."

"అది అతని పలుకుబడికి నిదర్శనం కాదా నాన్నా! అటువంటి పలుకుబడిని సంపాదించుకోవాలని మీరూ ప్రయత్నించండి. అప్పుడా పదవి మిమ్మల్ని వరిస్తుంది. అంతేగాని ఆయనమీద అసూయను పెంచుకుంటే ఎలా?"

"పోనీ అది వదిలిపెడదాం. మీ చిన్నాన్నని ఎవరో హత్యచేస్తే ఆ హత్య వెనుక పరోక్షంగా నా చేయివుందని నిందించాడట. అది విన్నప్పట్నించీ నా ఒళ్ళు దహించుకుపోయిందనుకో. రక్తం పంచుకున్న నా సొంత తమ్ముణ్ణి చంపించుకునేంతటి దుర్మార్గుణ్ణా నేను చెప్పమ్మా? అటువంటి వ్యక్తితో ఏవిధంగా నేను బంధుత్వాన్ని, స్నేహాన్ని పెంచుకోగలను!" నరహరి గొంతు కాస్త బీరపోయింది.

"ఈ విషయంలో మీతో నేను ఏకీభవించలేను నాన్నా" అంది కాంతం.

నరహరి కూతురుకేసి ఆశ్చర్యంగా చూశాడు.

"కారణం?" విసుగ్గా అన్నాడు.

"శివయ్య మావయ్య మీ సమక్షంలోనే ఇలా మిమ్మల్ని నిందించాడా?"

"నా సమక్షంలో కాదనుకో! కరణం కనకయ్య దగ్గరంటే అతను నా మనిషి కాబట్టి అది దాచుకోలేక నాతో చెప్పాడు"

"అక్కడే మీరు పొరబడ్డారంటాను. శివయ్య మావయ్య అలా అని వుంటాడని నాకు నమ్మకంలేదు."

"అంటే... కనకయ్య కల్పించి చెప్పాడంటావా?"

"అదే నా ఉద్దేశం"

"దానివల్ల అతడికి ఒరిగేదేవిటి?"

"మీ ఇద్దర్నీ విడదీయడమే. మీ ఇద్దరి మధ్య మనస్పర్థలు కల్పించి ఒక అగాధం ఏర్పర్చడమే! పోనీ నిజానిజాలు తెలుసుకుందుకు మావయ్యని నిలదీసి అడిగారా మీరు?"

"లేదు..."

"అంటే మీకు కనకయ్యమీదుండే నమ్మకం శివయ్య మావయ్యమీద లేకపోయిందన్న మాట. చాలా బావుంది నాన్నా! చెప్పుడు మాటల్ని వినడం ఒక బలహీనతగా చెప్పుకుంటారందుకే. ఈ బలహీనత ఎన్ని అనర్థాల్ని తీసుకొస్తుందో చెప్పలేం. అందుకు ఎన్నో నిదర్శనాలున్నాయి"

నరహరి మౌనంగా ఆలోచనల్లో పడ్డాడు. అమ్మాయి చెప్పినట్టు కనకయ్యే కల్పించి చెప్పాడేమో అన్న సందేహం ప్రప్రథమంగా అతని మెదడులో మెదిలింది. శివయ్యకి, కనకయ్యకి ఒకప్పుడు విరోధం వుండేది. దానికి ప్రతిగా ఈ అవకాశాన్ని వినియోగించుకున్నాడేమో?

"నువ్వు చెప్పింది కొంతవరకూ సబబుగానే వుంది కాంతం! నేనే తొందరపడ్డానేమో. అదే నిజమయితే సరిదిద్దుకునే ప్రయత్నం చేస్తాను" అనేశాడు.

కాంతం తృప్తిగా నిట్టూర్పింది. తండ్రిలో ఆపాటి మార్పు రావడం శుభసూచకం అనుకుంది.

"చాలా సంతోషం నాన్నా మీరలా




నిర్ణయించడం"

"నేనలా వెళ్ళొస్తానమ్మా" లేచి బైటికి నడిచాడు నరహరి.


5

హరిబాబు పట్నం నుంచి వచ్చాక, అరుణ విషయం అతడితో చెప్పాడు శివయ్య. కమల అక్కడే వుందప్పటికి.

హరిబాబు క్షణం మౌనం వహించాడు. ఏం చెప్పాలో అతనికి అర్థంకాలేదు.

"చూడు హరీ! యిది మన వంశ గౌరవానికి సంబంధించింది. అరుణని నీకిచ్చి పెళ్ళి చెయ్యాలనే అనుకున్నాం కదా... ఇప్పటికీ నేను అదే అభిప్రాయంతో వున్నాను. నువ్వు 'వూ' అంటే వివాహం జరిపించేస్తాను. ఏవంటావు?" అన్నాడు శివయ్య కొడుకు అభిమతాన్ని తెలుసుకోవాలని.

"అరుణని పెళ్ళి చేసుకోవాలనే తలంపు నాకు లేదు నాన్నా! అది ఇప్పటి అభిప్రాయంకాదు. మొదట్నుంచీ అదే అనుకుంటున్నాను. మా ఇరువురం అన్నా చెల్లెళ్లానే పెరిగాం తప్పించి, కాబోయే భార్యా భర్తల్లా పెరగలేదు. అంచేత అరుణ మనసిచ్చిన ఆ చక్రపాణికిచ్చి వివాహం చెయ్యడం శ్రేయస్కరంగా వుంటుంది నాన్నా" అంటూ తన మనసులోని మాటను వివరించాడు హరిబాబు.

శివయ్య ఆశ్చర్యపోలేదు. ఎందుకూ అంటే, ఇంతకు ముందే ఈ విషయాన్ని అరుణ చెప్పింది. ఒకవేళ హరి ఒప్పుకున్నా, అరుణ అంగీకారాన్ని సంపాదించడం అతి కష్టం అన్న విషయాన్ని శివయ్య ఎప్పుడో గ్రహించాడు.

కమల స్తబ్ధురాలైంది. ఆమె మనసు ఆరాటంతో వూగిసలాడుతోంది.

"అలా అంటే ఎలారా హరీ! మీలా ఒకే ఇంట్లో పెరిగి పెద్దవాళ్ళయిన వాళ్ళెంతమంది పెళ్ళిళ్ళు చేసుకోలేదు?" అంది కమల.

"అందరి మనస్తత్వాలు ఒక్కలా వుండవత్తా! నాకు ఇష్టంలేదంటే" ఖచ్చితంగా చెప్పేశాడు.

కమలకి ఏడుపొచ్చింది.

"నా ఖర్మగాలి ఆయన పోయారు. లేకుంటే మా అమ్మాయి వివాహంగురించి ఇంత సతమతమయ్యే అవసరం వుండేది కాదు. అంతా దాని దురదృష్టం" అంటూ ఏడుపులంకించుకుంది.

ఆ మాటలు శివయ్యకి చుర్రుమనిపించాయి.

"అలా అనొద్దు కమలా, నీ పసుపు కుంకుమలు పోవడం నీ దురదృష్టమే.. కాదనను. అయితే మీ అమ్మాయి బరువు బాధ్యతలు నావి కాకుండా ప్రవర్తించడం లేదు నేను. ఈ పరిస్థితుల్లో మీ ఆయన సజీవంగా వున్నా చేయగలిగిందేమీ వుండదు. ఎందుకూ అంటే, హరి మనోభీష్టానికి వ్యతిరేకంగా అరుణని వాడికి కట్టబెట్టలేము. అంతేకాదు అరుణ కూడా ఖచ్చితంగా చెప్పేసింది - హరిని పెళ్ళి చేసుకోనని. ఈ పరిస్థితుల్లో ఎవరైనా చెయ్యగలిగిందేవిటో చెప్పు" అన్నాడు శివయ్య.



హరిబాబు ఆశ్చర్యంగా కళ్ళింతలు చేసుకుని చూశాడు, తండ్రికేసి.

"ఏవిటి నాన్నా మీ రంటున్నది? అరుణ నన్ను వివాహం చేసుకుందుకు నిరాకరించిందా?" ఉత్సుకతతో అడిగాడు

"అలాగని కాదురా! నువ్వు వెలిబుచ్చిన అభిప్రాయమే అదీ వ్యక్తంచేసింది. మీరిద్దరూ కూడబలుక్కుని చెప్పినట్టుగానే వున్నయ్ మీ అభిప్రాయాలు"

హరిబాబు కాస్త స్థిమితపడ్డాడు. "నిజానికి మేమిద్దమూ ఈ విషయంలో ఎప్పుడూ మాట్లాడుకోలేదు నాన్నా! మా అభిప్రాయాలు ఒకటికావడం కేవలం కాకతాళీయమే. అరుణ అభిప్రాయమూ తెలుసుకున్నారు గనక, యింక ఆ ప్రయత్నం విరమించుకోక తప్పదు. అంచేత మనం అరుణ మనసిచ్చిన వ్యక్తితో సంప్రదించడం మంచిదేమో"

"అంతకు మించి మరి మార్గంలేదు. ఓసారి ఆ అబ్బాయిని మనింటికి తీసుకురా" అంటూ శివయ్య అక్కణ్ణించి జారుకున్నాడు, ఇంక చెల్లెలి మాటలేం వినిపించుకోవటం యిష్టం లేక.

కమల మాత్రం ఇంకేం అనగలదు? పరిస్థితులు అనుకూలంగా లేనపుడు ఎదురీదడం కంటే, అనుకూలమైన పరిస్థితులతో రాజీపడ్డం మంచిదనుకుంది. "ఎవ్వరమూ వూహించని పరిణామాలు వచ్చిపడ్డాయిరా హరీ... ఏం చేస్తాం? అంతా అరుణ దురదృష్టమే అనుకోవాలి" నిస్పృహతో అంది కమల.

"దురదృష్టమనే ఎందుకు అనుకోవాలి అత్తయ్యా! చక్రపాణి విద్యాధికుడు. బహుశా ఆర్థికంగా వున్నవాడే కావొచ్చు. మనిషి అందగాడు. ఇంక కావాల్సిందేమిటి? నువ్వు వూరికే కంగారు పడకు. మన అరుణ అతణ్ని ప్రేమించిందీ అంటే అతని విలువల్ని గ్రహించే ప్రేమించి వుంటుంది" అంటూ ఆమెలో ఆశల్ని పెంచాడు హరిబాబు.

ఆ మాటలు కమలకి ఎంతో తృప్తినిచ్చాయి. హరి చెప్పిందే నిజమైతే, అంతకంటె కావల్సిందేవిటి అనుకుంది మనసులో.

"అది సరేగాని, నువ్వు మాత్రం అతని వివరాలన్నీ కూలంకషంగా తెలుసుకోవాలా హరీ"

"అలాగే అత్తా! నువ్వు వేరేగా చెప్పనక్కర్లేదు. నా బాధ్యత నాకు తెలుసు" అన్నాడు.

వీళ్ళ సంభాషణంతా పక్కగదిలోంచి వింటున్న అరుణ చప్పున వచ్చింది హరిబాబు సమక్షానికి.

"చాలా థాంక్స్ బావా" అంది.

"థాంక్స్ ఎందుకూ?"

"అనుకోకుండా నాతో అన్ని విషయాల్లో ఏకీభవిస్తున్నందుకు. నా మనసుని అర్థం చేసుకుని నాకు సహకరిస్తున్నందుకు" అంది అరుణ.

హరిబాబు చిన్నగా మందహాసం చేశాడు.

"మీ మేష్టార్ని నేను కలిసే ముందు నిన్ను కొన్ని ప్రశ్నలు వేస్తాను. నిజం చెప్తావా?" అడిగాడు సూటిగా ఆమె మొహంలోకి చూస్తూ.

"అడుగు బావా"

"మీ మేష్టార్ని ఏం చూసి ప్రేమించావు?"

"అతని అందం, అతని మాటల తీరు, అతని మంచితనం"

"అతను కొత్తగా ఈ వూరొచ్చాడు. ఈ కొద్దిపాటివ్యవధిలో అతని మంచితనం





ఎలా గ్రహించావు?"

"అతని మాటల తీరులోనే తెలిసి పోతుంది బావా! నువ్వు అతనితోమాట్లాడు నీకే అర్థమైపోతుంది"

"అతణ్ని నువ్వు ఒంటరిగా ఎప్పుడైనా కలుసుకున్నావా?"

"ఒకే ఒక్కసారి"

"అసభ్యంగా ఏమైనా ప్రవర్తించాడా?"

"అబ్బే... కళ్ళతోనే మాట్లాడేవాడు. అతని రూపం చూస్తూ ఎన్ని గంటలైనా వుండిపోవచ్చు బావా"

హరిబాబు ఓ నిట్టూర్పు విడిచాడు. "అరుణా! వయస్సు చిన్నది గాబట్టి జీవితానుభవం నీకు చాలా తక్కువ. రూపాన్ని చూసి, మాటల తీరు మాధుర్యం చూసి మనిషి మంచితనాన్ని, మంచి మనసుని పసిగట్టలేం. దానికి ఎంతో అనుభవం కావాలి. సరే... ఆ విషయం నాకు వదిలేయ్" అంటూ అక్కడికా ప్రస్తావన ఆపేసినట్టు ముగించాడు హరిబాబు.

"అరుణా...అరుణా" అంటూ అప్పుడే బైట్నుంచి వచ్చింది నసీమ్.

వస్తూనే ఆమె దృష్టి హరిబాబుపై పడింది. వారిరువురి దృక్కులూ మౌనంగా మాట్లాడుకున్నాయి క్షణం పాటు. చప్పున మొహం దించేసుకుంది నసీమ్.

అరుణ వారిరువురి మౌనభావాల్ని ఇట్టే పసిగట్టేసింది.

"ఏంటి బావా... అలా కళ్ళప్పగించి చూస్తున్నావు?" అంది నవ్వుతూ.

హరిబాబు తుళ్ళిపడినట్లయి-"వూఁ... అబ్బే... ఏం లేదు" అనేసి చరచరా లోపలికి పోయాడు.

అరుణ ఒక్కసారి పగలబడి నవ్వేసింది. నసీమ్ దగ్గరగా వెళ్ళి ఆమె రెండు భుజాలు పట్టుకుని వూపేస్తూ-

"ఏవిటే నసీమ్... ఇది మూగ ప్రేమా?" అంది.

"ఛీ ఫో" అనేసి ఆమెని తీసుకుని పక్కగదిలోకి పోయింది నసీమ్.

నసీమ్‌ని తన మంచం మీద కూచోబెట్టింది అరుణ.

"ఇప్పుడు చెప్పవే నసీమ్ ఏవిటి విశేషం? మా బావ ఏమంటాడేవిటి" ప్రశ్నించింది.

"అసలు మాట్లాడనిదే"

"సిగ్గేమో"

"ఏమో"

"నువ్వు మాట్లాడు"

"అమ్మ బాబోయ్"

"ప్రేమకి పిరికితనం పనికిరాదే పిచ్చిదానా... ధైర్యం వుండాలి" అంది అరుణ.

"అబ్బ! పోనీ ఆ విషయం ఇప్పుడెందుకులే"

"అర్థమయ్యిందిలే... ఆ విషయం నువ్వు చూసుకుంటానంటావు ఏం?"

"అబ్బబ్బ! నీతో వాదించడం మహా కష్టమే అరుణా! నువ్వు స్కూలు ఎందుకు మానేశావని అందరూ అడుగుతున్నారే?" టాపిక్ మార్చేసింది నసీమ్.

"నువ్వేం చెప్పావు?"

"ఒంట్లో బాగులేదని చెప్పా"

"ప్రస్తుతానికి అది చాల్లే...మేష్టారు ఏం చెప్పలేదా?"

"నిన్నోసారి కలుసుకోవాలని వుందట. ఆయన నాతో మాట్లాడుతూ వుంటే ఇంక అందరి కళ్లూ నామీదే! నాకు అదోలా అనిపించిందనుకో"

"నిజమేమరి! నువ్వేం అనుకోకు. ఎప్పుడు, ఎక్కడ కలవాలో తర్వాత చెప్తాను. మా ఈ సమస్యకి పరిష్కారం కొద్దిరోజుల్లో జరగవచ్చు. అందాకా ఆగాల్సిందే!"

నసీమ్‌కి ఏమీ అర్థంకాలేదు.

"అంటే?"

"మా ఇద్దరి వివాహం జరిపించడానికి మా బావ ప్రయత్నించుతున్నాడు. మా మామయ్య కూడా గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు" అంది ఉత్సుకతతో అరుణ.

"ఓహ్! మరింకేం? నాకు చాలా ఆనందంగా వుందే! నీ ఆశలు ఫలించాలని మనసారా కోరుకుంటున్నాను" అంటూ అరుణని కౌగలించుకుంది నసీమ్.

కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుకున్నాక నసీమ్ వెళ్ళిపోయింది.

* * *

నరహరి విశాఖపట్నంనుంచి స్వస్థలం చేరుకున్నాక తల్లికి కాఫీ, భోజనం తీసుకుని వెళ్ళే బాధ్యత కాంతం పైనబడింది. విసుగు అనుకోకుండా ఆమె కర్తవ్యాన్ని నిర్వర్తిస్తోంది కాంతం. ఆమెతోపాటు అప్పుడప్పుడూ మేనమామ భార్య లక్ష్మిగాని, ఒక్కొక్కప్పుడు కాళిదాసుగాని వెళ్తూ వుండేవారు.

శాంతమ్మ ఆరోగ్యం కాస్త కుదుట పడుతున్నా మరో నెలరోజులపాటు హాస్పటల్లోనే వుండాలంటూ డాక్టర్లు సలహా యిచ్చారు.

అప్పుడప్పుడూ మేనమామ కాళిదాసుతోపాటు బీచ్‌కి వెళ్తూవుండేది కాంతం. కాంతంని స్కూటరు మీద తీసుకెళ్తూ వుండటం కొత్త అనుభూతిగా భావిస్తూ వుండేవాడు కాళిదాసు. నిజానికి కాంతంని అతనే వివాహం చేసుకోవల్సింది.




అయితే తన అల్లుడు మాంచి హోదాలో వుండాలన్న సంకల్పంతో నరహరి వుండే వాడు గాబట్టి కాంతంని కాళిదాసుకివ్వ డానికి ఇష్టపళ్ళేదు. అంచేత తనే స్వయంగా వేరే సంబంధం చూసి కాళి దాసుకి పెళ్ళి చేశాడు నాలుగేళ్ళ క్రితం. లేకుంటే తాను కాంతంని ఇలాగే ఎప్పుడూ స్కూటరుమీద తిప్పుతూనే వుండేవాడు. బావ ఆస్తంతా తనకే సంక్రమించివుండేది. తన జీవితం ఇప్పటి కంటె మరీ ఉజ్వలంగా ఉండేది అను కున్నాడు. కాళిదాసు ఆరోజు స్కూటర్ మీద కాంతంని బీచ్‌కి తీసుకువెళ్తూ లక్ష్మితో పోలిస్తే ఎంత పల్లెటూరి పిల్ల యినా కాంతం అందంగా, నాజూగ్గా ఉంటుంది అనుకున్నాడు. అటువంటి కాంతంని భార్యగా పొందే అదృష్టం తనని వరించనందుకు ఇప్పటికీ బాధపడుతూనే ఉంటాడు.

స్కూటర్ రోడ్డుమీద ఆగింది. పక్కనే స్టాండ్ వేసి కాంతంతోపాటు కాస్తంత ముందుకుపోయి ఇసుకలో కూల బడ్డాడు కాళిదాసు. అతనికి ఓరెండడుగుల దూరంలో కూచుంది కాంతం.

సాయంకాలపు నీరెండలో సముద్రం తమాషాగా మెరుస్తోంది. దూరంలో ఉన్న పడవలు ఉయ్యాలలూగుతున్నట్టున్నయ్. ఒడ్డును తాకుతున్న కెరటాలు వింత సంగీతాన్ని సృష్టిస్తున్నట్టున్నయ్.

"ఒక విషయంలో నేను చాలా దుర దృష్టవంతుణ్ని కాంతం" ప్రస్తావన ప్రారంభించాడు కాళిదాసు నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ.

"ఏ విషయంలో...?" లేచిపడుతున్న కెరటాలవంకే దృష్టిని సారిస్తూ పర ధ్యానంగా అంది కాంతం.

"నువ్వు కోపగించుకోవుగదా?"

"కోపగించుకోవడానికేముంది? చెప్పు మావయ్యా"

"నిన్ను నా అర్ధాంగిగా పొందలేక పోవడంలో నేను దురదృష్టవంతుణ్నే కదూ?" ఆమెకేసి చూస్తూ అన్నాడు.

కాంతం మావయ్యవేపు దృష్టిని మర ల్చింది. ఎప్పుడూ లేనిది అతని నోట కొత్త మాటలు వింటోందామె. ఇంతకు ముందు కాళిదాసు ఎన్నోసార్లు వాళ్ళ వూరొచ్చాడు. ఒంటరిగా తిరిగారు. ఎప్పుడూ యిటువంటి ప్రస్తావన రాలేదు. మరి యిప్పుడిలా అనడంలో అతని అంతర్యం ఏమయ్యుంటుందా అని క్షణం పాటు ఆలోచించింది.

"మా నాన్నగారికి యిష్టంలేక పోయిందిగా! అదీగాక అప్పట్లో నేనింకా చిన్నదాన్నే! అయినా యిప్పుడివన్నీ ఎందుకులే మావయ్యా?"

"ఏదో నాలో హఠాత్తుగా అటువంటి భావన మెదిలింది గాబట్టి మనసులో దాచుకోకుండా వ్యక్తంచేశాను. ఒక్కొ క్కపుడు మనం కోరుకున్నవి, కాంక్షిం చేవి లభ్యంగాకపోతే ఆ ఆవేదన వర్ణనా తీతం. అది చాలాకాలంవరకూ అంటి పెట్టుకునే ఉంటుంది...ఏమంటావు?"

"నేనేమంటాను? అటువంటి ఆవేదనకి ఎవరు గురవుతారో వారికే ఆ అనుభూతి తెలుస్తుందిగాని అందరికీ తెలుస్తుందా?"

"అంటే అటువంటి ఆవేదనకి నువ్వె ప్పుడూ గురికాలేదన్నమాట"

"లేదు మావయ్యా" ముక్తసరిగా జవాబు చెప్పింది.

"కాని, నిన్ను వివాహం చేసుకోలేక పోయాననే అన్న ఆవేదన, బాధ నన్ను ఇంతవరకూ వేధిస్తూనే వున్నాయి

కాంతం. బహుశా నువ్వు నమ్మకపోవచ్చు. కాని, ఇది నిజం" అన్నాడు.

కాంతంకి ఆ సంభాషణ వెగటు కలిగి స్తోంది. ఆమె ముఖకవళికలు అప్పుడే మారిపోయినయ్. కాళిదాసు మావయ్య ఇప్పుడా ప్రస్తావన ఎందుకు తెస్తున్నాడు అని మళ్ళీ మరోసారి అనుకుంది.

"నిజం అయ్యుండొచ్చు మావయ్యా అయితే, ఈ నిజం 'లక్ష్మి' అక్కయ్యకు తెలిస్తే, సాఫీగా సాగుతున్న మీ సంసారంలో అపశ్రుతులు పలకడం మాత్రం తథ్యం. ఇటువంటి పిచ్చి పిచ్చి ఆలోచనలకు దూరంగా వుండటం మంచిది. ఇక మనం బైలుదేరుదామా?" అంటూ లేచింది కాంతం.

"అప్పుడేనా?" తెల్లబోతూ అడిగాడు కాళిదాసు. అంతకుముందు బీచ్‌కి వచ్చినపుడెప్పుడూ ఇంత తొందరగా తిరుగుముఖం పట్టలేదు. ఈరోజు ఎందుకలా అంటున్నదో కాంతం అతని వూహకి అందలేదు. తన ప్రస్తావనే ఇందుక్కారణమని అతను గ్రహించుకోలేకపోయాడు.

"ఔను మావయ్యా, ఇంకా ఇక్కడుంటే, నీలోని ఆవేదన పరాకాష్ట నందుకుని, ఎలా పరిణమిస్తుందోనని నాభయం పద పోదాం" కాస్తంత వెటకారంగానే అంది కాంతం.

కాంతం మాటల్లోని వ్యంగ్యాన్ని అర్థం చేసుకోలేనంత తెలివితక్కువవాడు కాదు కాళిదాసు. తన ప్రయత్నం బెడిసి కొట్టినందుకు లోలోన బాధపడ్డాడు. నిజానికి కాంతం వట్టి భోళామనిషనుకున్నాడుగాని తన అభిప్రాయం తప్పని ఇప్పుడు గ్రహించుకున్నాడు.

"నా మీద కోపం వచ్చిందా ఏమిటీ కాంతం" నడుస్తూనే అన్నాడు.

"అబ్బే! నీ మీద కోపమెందుకు? తలనొప్పిగా వుందేనూ, ఇంటికి పోవాలనిపించిందంతే"

"అంతేగదా?" అనేశాడు తేలిగ్గా వూపిరి పీలుస్తూ.

పదడుగులు వేశారో లేదో, దాసు అగుపించాడు కాంతంకి. అతనితోపాటు మరో ఇద్దరు స్నేహితులు, ఇద్దరు అమ్మాయిలు కూడా వున్నారు.

"నమస్కారమండీ" అన్నాడు దాసు.

దాసుతో కాంతంకి అంతగా పరిచయం లేదు. చిన్నప్పుడు ఎప్పుడో మాట్లాడేవారు. తర్వాతఆ మాటలూ లేవు. అయితే పరాయి ప్రదేశంలో చూసేసరికి, ఆమెని పలకరించకపోతే తనలో అహంభావం పెరిగిందని ఆమె అనుకుంటుందేమోనన్న సందిగ్ధంలో పడి, ఆవిధంగా పలుకరించాడు దాసు.

మొదట్లో కాంతం కాస్తంత ఆశ్చర్యపోయినా, దాసు తనకిచ్చిన గౌరవం దృష్ట్యా అతను పలుకరించినందుకు అంతగా పట్టించుకోలేదు. ఒకవిధంగా ఆనందించింది కూడా. నిజమేమరి. అతడి స్నేహితుల సమక్షంలో తననో అంతస్తులో నిలిపినందుకు ఆమెకెంతో గర్వంగా వుంది.

"నమస్కారం...బావున్నావా?"

"ఆ... బాగానే వున్నానండీ"

దాసు కాంతం కంటే వయసులో పెద్దవాడే అయినా, అతణ్ణి కాంతం ఏకవచనంతో సంబోధిస్తూ వుండటం దాసు స్నేహితులకీ, కాళిదాసుకీ ఆశ్చర్యం కలిగించింది. వారి అంతస్తుల అంతరం వాళ్ళకి తెలీదు మరి.

"మీరెప్పుడొచ్చారు?" అడిగాడు దాసు.

"నెలరోజులు కావస్తోంది. మా అమ్మకి





ఒంట్లో బాగోలేకపోతే తీసుకొచ్చాం"

"అలాగా! ఇప్పుడు బావుందాండీ?"

"కాస్త బాగానే వుంది"

"ఓసారి వచ్చి చూడొచ్చునా" సందేహంగా అడిగాడు.

"తప్పకుండా" అంటూ కాళిదాసు కేసి తిరిగింది కాంతం. "మావయ్యా! ఇతను మావూరివాడే. ఇక్కడ మెడిసిన్ చదువుతున్నాడు" అంటూ పరిచయం చేసింది.

"నమస్కారం" పరస్పరం అభివందనాలు చేసుకున్నారు వాళ్ళిద్దరూ.

దాసుకూడా కాంతంని తన స్నేహితులకు, స్నేహితురాండ్రకు పరిచయం చేశాడు-ఓ పెద్ద భూకామందుగారమ్మాయని, తన స్నేహితుడి మేనకోడలని.

"మా హరి బావున్నాడాండీ?" అడిగాడు దాసు.

"బాగానే వున్నాడు.మరివస్తా"అంటూ ముందుకు సాగిపోయింది కాంతం. కాళిదాసు ఆమెని అనుసరించాడు.

"ఈ అమ్మాయి చాలా తమాషాగా మాట్లాడుతుందే దాసూ"అన్నాడో స్నేహితుడు దాసును వుద్దేశించి.

"ఆమె మనస్తత్వమే అంత" ముక్తసరిగ అనేశాడు దాసు.

వాళ్ళంయిదుగురూ కాఫీ కార్నర్‌కి దారి తీశారు.

* * *

రాత్రి పదకొండు గంటలు కొట్టింది గోడ గడియారం. కాంతంకి అప్పటి వరకూ నిద్రపట్టనమే లేదు. మావయ్య ప్రస్తావన మొదట్లో గుర్తుకొచ్చి, అతని మనసులో వక్రబుద్ధేమయినా చోటు చేసుకుందేమో నన్న అనుమానం కలిగింది కూడాను. ఏమైనా, తాను జాగ్రత్తగా ఉండటం మంచిదనుకుంది.

ఆతర్వాత ఆమెకి దాసు జ్ఞప్తి కొచ్చాడు. అతడు తనపట్ల కనబర్చిన గౌరవం, వినయం ఆమెని ముగ్ధురాల్ని చేశాయి. మునుపటి దాసులా ఇప్పుడు లేడు. రూపంలోనూ, మాటల తీరు, వేషధారణలో బాగా మార్పు రావడం గుర్తించింది కాంతం. అతణ్ని ఇప్పుడు చూస్తే 'హరిజనుడు' అని ఎవ్వరూ అనుకోరు. అతనితోపాటు తిరుగుతున్న అమ్మాయిలు ఎంతో అందంగా ఉన్నారు. జాతివిచక్షణ, అంటరానితనం ఇవన్నీ పల్లెల్లోనే ఎక్కువగా ఉంటాయేమో అనిపించిందామెకి. దాసు గురించి ఎప్పుడూ లేని ఆలోచనలు ఎన్నో ఆమె మస్తిష్కంలో గిర్రున తిరిగాయి. మరి కొన్నాళ్ళకి దాసు డాక్టరై పోతాడు. అప్పుడతని అంతస్తే వేరు. హోదా వేరు- ఇలా ఆలోచిస్తూ ఉంటే మెల్లగా నిద్ర మైకం కమ్మేసిందామెకి.

* * *

హరిబాబు చక్రపాణి అద్దెకుంటోన్న రూమ్‌కి బైలుదేరాడు. ఆ రూమ్ అతనికి తెలీకపోయినా, తెలుసుకోవడం ఏమంత కష్టమనిపించడం లేదు.

అప్పుడే చీకటిపడింది. కొత్తగా వేసిన విద్యుద్దీపాలు వీధుల్ని కాంతివంతం చేస్తున్నాయి. హరిబాబు వెళ్ళేసరికి చక్రపాణి ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు.

"నమస్కారం మేష్టారూ" అన్నాడు హరిబాబు ద్వారం దగ్గర్నించే.

చక్రపాణి తలెత్తి చూశాడు. హరిబాబుతో అతనికి పరిచయం లేకపోయినా అతడు 'ఫలానా' అని తెలుసు. అందుకే అతన్ని చూడగానే కాస్తంత తత్తరపాటు

కలిగింది పాణికి. తనలో కలిగిన ఆ మార్పుని బలవంతంగా సర్దుకున్నాడు.

"నమస్కారం... రండి" అంటూ చేతిలో ఉన్న పుస్తకాన్ని బల్లమీద పడేసి లేచి ముందుకొచ్చాడు.

హరిబాబు లోపలికి వెళ్ళాడు.

"కూచోండి" ఆసనాన్ని చూపించాడు చక్రపాణి.

చెరో కుర్చీలో కూచున్నారు.

"నేను హరిబాబుని....అరుణ బావని" అని తనను తాను పరిచయం చేసుకున్నాడు హరి.

"ఔను..తెలుసు"

"ఎలా తెలుసు...?"

"ఈ ఊళ్లో ప్రముఖ వ్యక్తులు గదా మీరు. తెలియకుండా ఉంటారా చెప్పండి"

"పట్నంలో బి.యస్సి. చదువుతున్నాను"

"బాగా సంతోషం...మీ చదువెలా సాగుతోంది?"

"సంతృప్తికరంగా లేదులెండి మేష్టారూ! ఈరోజుల్లో ఎక్కడ చూసినా రాజకీయాలేగా"

"అదీ నిజమేలెండి... ఏమిటిలా వచ్చారు?" ప్రశ్నించాడు చక్రపాణి.

"మా నాన్నగారు మిమ్మల్నోసారి రమ్మన్నారు"

చక్రపాణి చలనరహితుడయ్యాడు క్షణంపాటు. శివయ్యగారు ఆ ఊరికి మకుటం లేని మహారాజన్నది విని ఉన్నాడు. అతనిలో కపటం, కుత్సితం, స్వార్థం, దౌర్జన్యం వంటి గుణాలేవీ లేవని కూడా విన్నాడు. అటువంటి శివయ్యగారి సమక్షంలో నిల్చోడానికే తనకు అర్హతలేదు. అలాంటిది అతనెందుకు పిలిపించాడో అర్థం చేసుకోలేకపోయాడు చక్రపాణి. అక్కడికి వెళ్ళాక పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోలేకపోయినా, ఏదో భయం అతణ్ని లోలోన వణికించేసింది. మొహం స్వేదంతో నిండింది. అక్కడే ఉన్న తువ్వాలు తీసుకుని మొహం ఒత్తుకున్నాడు.

"ఏమయ్యిందండీ?" అడిగాడు హరి.

"అబ్బే...ఏమీ లేదండీ! గాలి లేదు. ఇంతకీ మీ నాన్నగారు నన్నెందుకు రమ్మన్నట్టు?"

"నాకు తెలీదు మేష్టారూ...పదండి వెళ్దాం. ఇటీజ్ ఎ మేటర్ ఆఫ్ సమ్మినిట్స్! అంతే" అన్నాడు హరిబాబు. చక్రపాణి పడుతున్న ఇబ్బందిని గమనిస్తుంటే అతనికి నవ్వొస్తోంది.

"ఇప్పుడే వెళ్ళాలంటారా?" పాణి గొంతు కాస్తంత జీరవోయింది.

"నాతో తీసుకు రమ్మన్నారు"

"రేపొస్తేనో?"

"రేపటికీ, ఇప్పటికీ వ్యత్యాసం ఏముంది? లేవండి...బట్టలేసుకోండి" ఆజ్ఞాపించినట్టుగా అన్నాడు హరిబాబు. ఈసారి అతని మాటల్లో కరకుదనం ధ్వనించింది.

చక్రపాణి మరేం అనలేకపోయాడు. లేచి బట్టలేసుకుని, హరిబాబుతోపాటు బైటికి నడిచాడు - రూమ్‌కి తాళం వేసి.

వారిద్దరూ వెళ్లేసరికి శివయ్య లోపలి గదిలో వున్నాడు. హరిబాబు చక్రపాణిని అక్కడికి తీసుకెళ్ళాడు. వెళ్తున్నప్పుడు అరుణ చిరునవ్వుతో అగుపించినా, ఆ వాతావరణంలో చక్రపాణి మందహాసం చెయ్యలేకపోయాడు. గది లోపలికి వెళ్తూనే-

"నమస్కారం సార్" సవినయంగా అన్నాడు.





"చక్రపాణి ఇతనే నాన్నా! హైస్కూల్లో మేష్టారు" పరిచయం చేశాడు హరిబాబు.

"నమస్కారం. నువ్వేనన్నమాట చక్రపాణి మేష్టారువి" సూటిగా అతని కేసి చూస్తూ అన్నాడు శివయ్య.

శివయ్య మాటల్లోని గంభీరత చక్రపాణిని తికమకపర్చిందనే చెప్పాలి.

"అవును సార్" తడబడుతూనే అన్నాడు.

"ఊ...కూచో"

"థాంక్స్" కూచున్నాడు కుర్చీలో చక్రపాణి. అతనికి పక్కనే హరిబాబు మరో కుర్చీలో కూచున్నాడు.

శివయ్య జేబులోంచి చుట్ట తీసి ముట్టించాడు.

అంతలోనే అరుణ కాఫీతో లోపలికి వచ్చి చెరొకటి అందించింది. చక్రపాణి కాఫీ తీసుకుంటున్నపుడు అతని చేతి వేళ్ళు వణుకుతూ వుండటం గమనించి నవ్వుకుంది కూడా. పిచ్చి మేష్టారు...తమ ఇద్దరి వివాహం ఏర్పాటు చెయ్యాలనే అతణ్ని రప్పించినట్టు అతను గ్రహించలేదు పాపం! ఏమంటారోనని పూరికే కంగారుపడిపోతున్నట్టున్నాడు- అనుకుని గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది.

కాఫీ తీసుకోవటం ముగించారు ముగ్గురూను. ఖాళీ కప్పులు తీసుకోవడానికి మళ్ళీ వచ్చి వెళ్ళింది అరుణ.

"అయితే మేష్టారూ..నువ్వు స్కూల్లో సమంగా పాఠాలు చెప్పడం లేదన్న మాట" సూటిగా ప్రశ్న వేశాడు శివయ్య.

ఆ ప్రశ్నకి చక్రపాణి తబ్బిబ్బయి పోయాడు.

"ఎ...ఎవరు చెప్పారండీ మీకా విషయం?" కాస్తంత కంగారుపడుతూనే అన్నాడు.

"ఎవరో చెప్పాలేమిటోయ్? పాఠాలు సక్రమంగా చెప్పే అలవాటు వుంటే ప్రేమ వ్యవహారాలకు సమయమెక్కడుంటుంది?"

శివయ్య అలా అనేసరికి చక్రపాణి అవాక్కయి మొహం దించుకున్నాడు. ఏం సమాధానం చెప్పాలో అతనికి తోచలేదు. తాను దేని గురించి భయపడ్డాడో అదే ప్రస్తావన వస్తుండటం గమనించిన పాణికి గుండెల్లో గుబులు బయల్దేరింది.

"సమాధానం చెప్పవేం? అమాయకులైన అమ్మాయిల్ని ఆకర్షించి, వారిని కల్లబొల్లి మాటల్తో నమ్మించి ప్రేమించడానికి నీలాంటి ఉపాధ్యాయులు సిగ్గుపడాలి" గంభీరంగా అన్నాడు శివయ్య.

చక్రపాణి మనసులో భగవంతుని ప్రార్థించడం మినహా మరో ఆలోచనకి తావివ్వలేకపోయాడు. అంతా చాటుగా వుండి వింటున్న అరుణ విస్తుపోయింది. కంగారుపడింది కూడాను. మేష్టార్ని పిలిచి పెళ్ళి విషయం మాట్లాడుతామన్న మావయ్య ఎందుకిలా అతణ్ని భయపెడుతున్నాడో ఆమెకి అవగాహన కాలేదు.

శివయ్య చక్రపాణికేసి మళ్ళీచూశాడు. అతని మొహం చెమటతో నిండింది. పెదాలు సన్నగా వణుకుతున్నయ్. తన మాటలు అతనిలో ఎటువంటి భయోత్పాతాన్ని సృష్టించాయో అర్థం చేసుకున్నాడు. తనే తొందరపడుతున్నాడేమోననిపించి ఆవేశాన్ని అణచుకున్నాడు.

"సరేగాని, నీ పేరేవిటన్నావు?" మెల్లగా అడిగాడు.

శివయ్యలో వచ్చిన ఆ మార్పునకి చక్రపాణి హృదయం కాస్త చల్లబడింది.


చతుర ... లవ్

పేంటు జేబులోంచి రుమాలు తీసి మొహాన్ని ఒత్తుకున్నాడు.

"చక్రపాణి సార్..."

"అయితే నువ్వు మా మేనకోడలు అరుణని ప్రేమించావన్నమాట....?" మామూలు ధోరణిలోనే అడిగాడు శివయ్య.

"ఔనండీ" తడబడకుండా చెప్పాడు.

"ఏం జూసి ప్రేమించావు? మా కుటుంబపు అంతస్తు చూశా? లేక..." అర్థోక్తిలో ఆపేశాడు సమాధానం అతని నుండి రప్పించాలనుకుని.

"ఈ వూరికి కొత్తవాణ్ని. మీ కుటుంబపు అంతస్తేవిటో నాకు తెలీదు. అసలు ఆమె ఎవరో కూడా నాకు మొదట్లో తెలీదు. ఆమెను మొట్ట మొదటిసారి చూసిన క్షణంలోనే ఆకర్షితుడనయ్యాను. ఆమె అందం, అందాన్ని మించిన ఆకర్షణ...ఆకర్షణీయమైన ఆమె కళ్లు నన్ను ముగ్ధుణ్ని చేశాయి. అంతేగాని ఆమె డబ్బు చూసి నేనెప్పుడూ ప్రేమించలేదు" హుషారుగా చెప్పుకుపోయాడు.

చక్రపాణి మాటలకు సమ్మోహితుడయ్యాడు శివయ్య.

"మీ అమ్మా, నాన్నా ఎక్కడుంటున్నారు?"

"వాళ్లిద్దరూ లేరండీ! నేను చాలా కష్టపడి పైకొచ్చాను. మా మేనమామ దగ్గరుండి చదువుకున్నాను"

"అతనిప్పుడెక్కడున్నాడు?"

"రాజమండ్రిలో"

"అతనికి పెళ్లీడు అమ్మాయిలెవరైనా వున్నారా?"

"లేరండీ"

"అసలు విషయం మర్చాను. నీకు పెళ్ళయిందా?"

"అదేంటి సార్! పెళ్ళయ్యుంటే వేరే అమ్మాయిని ప్రేమించే ధైర్యం ఎలా వస్తుంది చెప్పండి! మా మేనమామ నా కోసం వధువుని వెదుకుతున్నాడు"

"అయితే మా అరుణని వివాహం చేసుకోవడం నీకు సమ్మతమేనా?"

"నన్ను పరీక్షిస్తున్నారా సార్? ప్రేమ వేరు, పెళ్ళివేరు అని నేననుకోను. ప్రేమించి పెళ్ళిచేసుకోవడంలోనే జీవిత మాధుర్యం వుంది. అరుణని పెళ్ళిచేసుకోడానికి నేను సంసిద్ధంగా వున్నాను. అయితే మా మేనమామతో ఒక్క మాటగా చెప్పడం నా ధర్మం కదా"

"అలాగే, తప్పకుండా అతని సలహా తీసుకో. లేదంటే, అతణ్ణి ఇక్కడికోసారి తీసుకురా"

"అలాగేనండీ"

"నీకు శ్రమ కలిగించామోయ్. మరేం అనుకోకు. మీ మావయ్య దగ్గరికోసారి వెళ్ళి సంప్రదించిరా...లేదా అతణ్ణి తీసుకొచ్చెయ్. వెళ్ళిక" అన్నాడు శివయ్య.

చక్రపాణికి హృదయం తేలికపడింది. "వస్తాను సార్" రెండు చేతులూ జోడించి సవినయంగా అన్నాడు చక్రపాణి.

"మంచిది... వెళ్ళిరా" అన్నాడు శివయ్య.

"మిస్టర్ హరీ! సెలవ్"

"మంచిది మేష్టారూ....మనం బంధువులం కాబోతున్నందుకు నాకెంతో ఆనందంగా వుంది" అన్నాడు హరిబాబు,

"ఐ టూ ఫీలిట్" అనేసి, హరికి షేక్‌హాండిచ్చి బైటికి నడిచాడు.

పక్క గదిలో నుంచుని ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతూ, క్రీగంటి చూపుల్తో చక్రపాణిని పలుకరిస్తున్న అరుణని చూసి ముసిముసిగా నవ్వుకున్నాడు హరిబాబు.





అరుణ సిగ్గుతో అక్కణ్నించి వెళ్ళి పోయింది.

హరిబాబు వీధి వరకూ అంపకం పెట్టి తండ్రి వున్న గదిలోకి వచ్చాడు.

"కుర్రాడు మంచివాడిలానే వున్నాడ్రా అబ్బాయ్" అన్నాడు శివయ్య.

"అలాగే కనిపిస్తున్నాడు నాన్నా! అరుణ అదృష్టవంతురాలే. ఫరవాలేదు"

"అంతా ఆ శ్రీరాముడి దయ" అనేసి బైటికొచ్చాడు శివయ్య. హరిబాబు తన గదిలోకి వెళ్ళిపోయాడు.

కమల కూతుర్ని కౌగిలించుకుంది.

* * *

తల్లి ఆరోగ్యం క్రమంగా కుదుట పడుతున్నందుకు కాంతం వుప్పొంగి పోయింది. ఆమె త్వరగా కోలుకుంటే తమ వూరు వెళ్ళిపోవచ్చునని ఆరాటపడు తోందామె. ఆమెకి మేనమామగారింట్లో వుండడానికి మనస్కరించడంలేదు. మేన మామ భార్య లక్ష్మి అనాదరణేమీ లేదు గానీ మేనమామయిన కాళిదాసు ప్రవర్తన పట్ల విశ్వాసం లేకపోతోంది.

ఆరోజు నీటుగా ముస్తాబై లక్ష్మి దగ్గరికొచ్చింది. అప్పటికి నాలుగున్నర అయ్యింది.

"అక్కా! అలా బీచ్‌కి వెళ్ళొస్తాను" అంది కాంతం.

"ఒంటరిగానా?" ఆశ్చర్యంతో కళ్ళింతలు చేసుకుని అడిగింది లక్ష్మి.

"తప్పేముందక్కా? ఇలా మనం భయపడ్డం వల్లనే స్త్రీల పరిస్థితి ఇంత అధ్వాన్నంగా వుందీ దేశంలో. వేగిరం వెళ్ళి, వేగిరం తిరిగొచ్చేస్తాను"

"పోనీ మీ మావయ్య వచ్చాక



ఆయన్తో పాటు వెళ్ళకూడదూ?"

"చిన్నపిల్లలా ఎప్పుడూ ఎవర్నో తీసుకెళ్ళడమేవిటి? అందుకే ఒంటరిగా వెళ్ళాలనిపిస్తోంది" నవ్వుతూ అంది కాంతం.

"చిన్నపిల్లవని కాదు కాంతం ఆడపిల్లవని" నవ్వుతూ అనేసి "సరే, నీ ఇష్టం. జాగ్రత్తగా వెళ్ళిరా! రోజులు బావులేవు" హెచ్చరించింది కాంతం.

ముసిముసిగా నవ్వుకుంటూ అక్కణ్ణించి నిష్క్రమించింది కాంతం.

కాంతం బీచ్‌లో అడుగుపెట్టేసరికి అప్పటికే చాలా మంది వస్తున్నారు. ఆ సంజవెలుగులో సూర్యుని కిరణాలు సముద్రంపై ప్రతిఫలిస్తూ వుంటే మనోజ్ఞంగావుంది.

కాంతం ఎవరూ లేని ఓ చోట కూచుంది. ఆమె దృక్కులు మాత్రం ఎవరి కోసమో వెదుకుతున్నట్టున్నాయ్. కాస్సేపు కూచున్నాక ఆమెలో విసుగు పెరిగింది. తాను ఎదురు చూస్తోన్న వ్యక్తి జాడ అగుపించక పోయేసరికి వెళ్ళిపోవాలనుకుంది. ఆమెఅంతరంగంలో కాస్తంత నిరాశ చోటుచేసుకుందికూడాను లేచి నుంచుంది. ఇంటికి వెళ్ళిపోవాలన్న వుద్దేశంతో బైల్దేరింది.

అంతలోనే దాసు స్నేహితులతో రావడం గమనించింది కాంతం. ఈసారి అమ్మాయిలెవ్వరూ లేరు. మరో ఇద్దరు స్నేహితులే అతనితో వున్నారు.

"నమస్కారమండీ" అన్నాడు దాసు కాంతంని చూడగానే.

"నమస్కారం" వుత్సుకతతో అందామె.

"ఇవ్వాళ ఒంటరిగా వచ్చారేం?"

"మావయ్యకి రావడానికి వీలు పళ్ళేదు. అందుకని"

"ఓ...అలాగా! అప్పుడే బైలుదేరి పోయారేం"

"మావయ్య రాలేదుగా? ఒంటరిగా వెళ్ళొద్దూ?"

"మీకు అభ్యంతరం లేకపోతే మీకు తోడుగా అందాకా వచ్చేదా?"

"మీకు వీలుంటుందా?"

"దానికేముందండీ! మీరు ఒంటరిగా వెళ్ళడం మంచిది కాదుకూడాను. పదండి నేనొస్తాను"

"థాంక్స్" అంది లోలోన మురిసి పోతూ. 'దాసు ప్రవర్తనలో ఎంత నమ్రత, సౌమ్యత ఉంది?' అనుకుంటూ సంబరపడిపోయింది. బహుశ ప్రవర్తనకి, జాతికి సంబంధమేలేదేమో అని కూడా భావించింది.

"నేనలా వెళ్ళొస్తాను...మీరిక్కడే వుంటారా?" స్నేహితుల్ని అడిగాడు దాసు.

"ఇంక నువ్వు తిరిగొచ్చేదేమిట్లే హాస్టల్లోనే కలుసుకుందాం...విష్ యూ ది బెస్ట్..." నవ్వుతో అనేశారు వాళ్ళు.

దాసు చాలా ఇబ్బందిఫీలయ్యాడు వారి మాటలకి. అయినా, అక్కడేం అన లేకపోయాడు.

"పదండి ..." అంటూ ఆమె వెంట నడిచాడు.

"మా స్నేహితులు అన్నమాటలకి మీరు మరోలా భావించకండి కాంతం గారూ!"

"అబ్బే! ఫరవాలేదు..." చిరునవ్వుతో అనేసింది కాంతం.

ఓ అయిదునిమిషాలు ఇద్దరూ మౌనం గానే నడిచారు.

"దాసూ, మరి నువ్వు మనవూరు వెళ్ళ




దమే మానేశావేం దాసూ?" అడిగింది కాంతం.

"తీరికవుండక" ముక్తసరిగాచెప్పాడు. అయితే నిజమైన కారణం వేరేవుందని ఆమెకి చెప్పలేకపోయాడు. అక్కడికి వెళ్తే, ఆ గుడిసెల్లో వుండడానికే ఎబ్బెట్టుగా వుంటుందతనికి. అది చెప్పడం ఇష్టంలేకపోయింది.

"మెడిసిన్ చదివాక, ఏం చెయ్యా లనుకున్నావు?"

"ఎక్కడో వుద్యోగం చూసుకోవాలి"

"మనవూళ్ళో ప్రాక్టీసు పెట్టుకో కూడదూ?"

"అంత వచ్చెక్కడిది?"

"పోనీ, మనవూరి హాస్పటల్లో డాక్టరుగా వచ్చేయ్..."

"అది ఇప్పట్నుంచే వూహించలే మండీ! మొదట వుద్యోగమంటూ ఒకటి దొరకాలి. తర్వాత పోస్టింగ్... ఏదో సామెతచెప్పినట్టు నా చదువే ఇంకా పూర్తి కాలేదు. ఆ తర్వాతి విషయాలు ఆలోచించ డంలో అర్థంలేదు" నవ్వుతూనే అన్నాడు దాసు.

ఆ నవ్వు ఎంతో నిర్మలంగా తోచింది కాంతంకి. అతన్ని అంతదగ్గరగా, పరిశీల నగా చూడ్డం అదే ప్రథమం ఆమెకి. మనిషి బాగానేవున్నాడు. తనంటే ఎంత గౌరవం ఇస్తున్నాడు? ఎంత నమ్రత...! అప్రయత్నంగా అతని పట్ల ఓవిధమైన సద్భావం తనలో ఏర్పడిపోతోందన్న విషయం ఆమె గ్రహించింది.

"అమ్మని చూడ్డానికి వస్తానన్నావు... రాలేదేం?"

"రేపొస్తానండీ! నేనొస్తే, మీ అమ్మ గారేం అనుకోరుకదా?" తన సందేహాన్ని బైటపెట్టాడు దాసు.

"అబ్బే! అలా అనుకునే మనిషికాదు మా అమ్మ. సరేగాని నీ అడ్రసు నాకివ్వు..."

విస్తుపోయి చూశాడు దాసు. ఆమెతో మాట్లాడ్డానికే తాను భయపడిపోతూంటే, ఆమె తన అడ్రసు ఎందుకడుగుతోందో?

"నా అడ్రసెందుకండీ?"

"ఏం ప్రశ్న అది? మనవూరెళ్ళాక నేను అవసరమనుకుంటే వుత్తరం రాస్తాను... తప్పా?" చిలిపిగా అంది.

"అబ్బే! తప్పని అనడం లేదండీ! కాని...కాని..." మాటల్ని మింగేశాడు.

"కానీలేదు....అర్థాలేదు. నీ అడ్రస ివ్వు..." అంది కాంతం.

దాసు మరేం అన్లేకపోయాడు.

"ఇప్పుడే యిమ్మంటారా?"

"జేబులో పెన్నుందిగా! ఏదో కాగితం ముక్కచూసి రాసిచ్చేయ్..."

"సరే!" అంటూ జేబులోంచి ఓ కాగితం ముక్కతీసి, అడ్రసురాసి ఆమెకి అందించాడు దాసు.

"నేను వుత్తరంరాస్తే నువ్వు జవా బిస్తావుకదూ?"

దాసుమొహంలో రంగులు మారాయి. అతనిలో ఏవో వూహాలుచెలరేగి భయం పట్టుకుంది.

"నన్ను జవాబు రాయమంటారా?"

"ఏం రాయకూడదా?"

"అదేంకాదండీ! మీ నాన్నగారు నా వుత్తరంచూస్తే..."

కాంతం కిలకిల నవ్వింది.

"మా నాన్నకి అంతతీరిక ఎక్కడుందీ? అటువంటి భయాలేంపెట్టుకోకు ... తప్ప కుండా రాయి"

"అలాగే" ముక్తసరిగా అనేశాడు దాసు. కాంతంకి తనపట్ల హఠాత్తుగా

ఎందుకంత అభిమానం ఏర్పడిందో అతడి వూహకి అందలేదు.

"ఇదిగో మా మామయ్యగారిల్లు దగ్గరపడింది ... సువ్వెళ్ళిక. వాళ్ళింటికి తీసుకెళ్ళేదాన్నే నిన్నుగాని, మామావయ్య మంచివాడుకాదు. మరేం అనుకోకు... వస్తా..."

"మంచిదండీ! వెళ్ళొస్తానండీ!" అనేసి మళ్ళీ వెనక్కి వెళ్ళిపోయాడు దాసు.

కాంతం ముసిముసిగా నవ్వుకుని ముందుకుసాగిపోయింది. నడుస్తున్న దాసు మెదడులో అసంఖ్యాకమైన ఆలోచనలు వుత్పన్నమయ్యాయి.




నరహరి స్వస్థలం వచ్చేశాక మారిన మనిషిలా అగుపించాడు అందరికీ. ఈ మార్పుకి కారణం ఏమిటోనని అందరికీ ఆశ్చర్యం కలిగింది. అతనికి కుడి భుజంగావుండే విశ్వాసపాత్రుడైన దూరపు బంధువు కామరాజుకూడా విస్తుపోయాడు.

ఓరోజు ఉదయం నది ఒడ్డుకి వెళ్ళి తిరిగొస్తున్నాడు నరహరి.

అప్పుడే కాలవగట్టుకేసి బైలుదేరిన శివయ్య ఓ చోట తారసపడ్డాడు. ఇంతకు ముందు అలా తారసపడిన సమయాలు లేకపోలేదు. అప్పుడు మొహాలు పక్కకి తిప్పుకుని సాగిపోయేవారు.

"ఏమిటి నరహరిబావా! మా చెల్లెమ్మకి ఒంట్లో బాగులేదట. వాల్తేరు తీసుకెళ్ళావట. ఇప్పుడెలా వుంది?" ప్రశ్నించాడు శివయ్య ఎదురవుతూనే

నరహరి వున్నపాటున స్తంభించిపోయాడు. 'ఏమిటి తాను వింటున్నాడు? మాట్లాడుతున్నది శివయ్య బావేనా? లేక తాను కలగంటున్నాడా? ఎన్నేళ్ళ తర్వాత ఆయన తనతో మాట్లాడుతున్నాడు?' అనుకుని తలెత్తి చూశాడు. ఎదురుగా శివయ్య బావ మందహాసాన్ని పెదాలపై చిందిస్తూ అగుపించాడు. తాను కష్టాల్లో ఉన్నట్టు తెలుసుకుని పలుకరించిన శివయ్య సహృదయాన్ని మనసులో అభినందించకుండా ఉండలేకపోయాడు. శివయ్యలోనిగొప్పదనమేమిటో, అతని మాటల్లోని మహిమ ఏమిటో యిప్పుడర్థమయ్యింది నరహరికి. అటువంటి వ్యక్తిని యిన్నేళ్ళు దూరంచేసుకున్న తన తెలివితక్కువతనానికి లోలోన బాధపడ్డాడు. అంతేకాదు తనని తాను అసహ్యించుకున్నాడు కూడాను.

"అవును బావా! పట్నంలో చూపించినా లాభంలేకపోయింది. అందుకే వాల్తేరు తీసుకెళ్ళాను. ఇప్పుడు కాస్త నయంగా వుంది. మరి కొద్ది రోజులు ఉండాలన్నారు. అందుకే అక్కడుంచాను" అంటూ సమాధానం చెప్పాడు నరహరి. అలా చెప్తున్నపుడు ఏదో తప్పుచేసినవాడిలా ఫీలయ్యాడు.

"పోనీలే ఆ రాముడి దయవల్ల ఇప్పుడు నయంగావున్నందుకు చాలా సంతోషం" అనేసి ముందుకు సాగిపోయాడు శివయ్య.

నరహరి యింటికేసి నడిచాడు. అతని మస్తిష్కం ఆలోచనలతోనిండిపోయింది. ఇన్నాళ్ళ తర్వాత తనని పలకరించినందు

వల్ల శివయ్య బావ నష్టపోయిందేవిటి? తాను పొందిన లాభం ఏమిటి? ఆధిక్యత, గెలుపు తనదే అయినట్టా? కాదు. అదెన్నటికీకాదు. ఆధిక్యత శివయ్యదే. అంతటి సంస్కారం అందరికీ ఉండదేమో...అనుకుంటూ యిల్లు చేరాడు.

నరహరి స్నానం ముగించి కాఫీ తీసుకుంటుండగా అక్కడే వున్న కామరాజుతో ఆనాటి సంఘటన చెప్పాడు. కామరాజు ఆశ్చర్యపోలేదు.

"శివయ్యగారిది అమృతహృదయం నరహరి బాబూ! మీరేదో స్పర్థలు పెంచుకున్నారని ఆయన యిన్నాళ్ళూ వూరుకున్నారుగాని లేకుంటే ఎవ్వరితోనూ విరోధం తెచ్చుకోవడం అతనికి సరిపడదని నాకు తెలుసు. అయినా మీరు ఆ కనకయ్య చెప్పిన మాటలు విని అకారణంగా శివయ్యగారిమీద ద్వేషం పెంచుకున్నారు. అతనిపై కక్షగట్టారు. నిజానిజాలు తెలుసుకోడానికి ప్రయత్నించారు కాదు" అన్నాడు కామరాజు.

"అమ్మాయి కూడా ఈమాటే అంది రాజూ!" సాలోచనగా అన్నాడు నరహరి.

"ఎవరైనా అలాగే అంటారుబాబూ! పల్లెల్లో కరణం పాత్ర ఎటువంటిదో అందరికీ తెలిసిన విషయమే! వాళ్ళతో చాలా జాగ్రత్తగా వుండాలి. అప్పట్లో నేను ఈ విషయంలో సలహాయిచ్చినా, నా మాట కాదనేశావు ఆవేశంలో"

"ఇప్పుడనిపిస్తుందోయ్ రాజూ తప్పు నాదేనేమోనని. అనాలోచితంగా ప్రవర్తించానేమో"

కామరాజు ఓ నిట్టూర్పు విడిచాడు. "నరహరిబాబూ! ఓ చిన్న తప్పు, ఓ చిన్న అనాలోచిత చర్య ఓ రెండు సన్నిహిత కుటుంబాలమధ్య ఎంతటి అగాధాన్ని సృష్టించిందో చూశారా?" అన్నాడు బాధగా.

"నిజమే కామరాజూ! అదిప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్నాను. ఇందులో ఎక్కువగా నష్టపోయింది నేనేనని కూడా ఇప్పుడే గ్రహించగలుగుతున్నాను" పశ్చాత్తాపుడై అన్నాడు నరహరి. అప్పుడతనికనిపించింది అసలు కనకయ్య చెప్పిందాంట్లో ఎంత నిజముందో తెలుసుకోవాలని.

"కామరాజూ! నువ్వెళ్ళి ఓసారి కనకయ్యని తీసుకురా. విషయం ఏమీ చెప్పకు. అర్జంటు పనుందని చెప్పి తీసుకురా. నిజానిజాలు తెలుసుకునేవరకూ నా మనసులోని ఆరాటం, ఆందోళన చల్లారదు. వెళ్ళు"

"అలాగే బాబూ" అంటూ బైలుదేరాడు కామరాజు.

కరణం కనకయ్య ఇల్లు నరహరి ఇంటికి సమీపంలోనే ఉందిగాబట్టి, పదిహేను నిమిషాల్లో వచ్చేశారు కనకయ్య, కామరాజూను.

"నమస్కారమండీ!" సవినయంగా అంటూ గదిలోకి ప్రవేశించాడు కనకయ్య.

"నమస్కారం... కూచో"

"చెల్లెమ్మగారికి ఎట్లావుంది?"

"కాస్త నయంగా వుందిలే!"

"ఎప్పుడొస్తారు?"

"మరో పది – పదిహేను రోజుల్లో"

"సంతోషం"

"సరేగాని, ఓ విషయం అడుగుతాను. వున్నది వున్నట్టు చెప్తావా?" నరహరి కాస్తంత గంభీరంగా ప్రశ్నించాడు.

కనకయ్య జిత్తులమారి అయ్యుండొచ్చుగాని ధైర్యశాలి కాదు. అందుకే, నరహరి గంభీరతకి గతుక్కుమన్నాడు.



"ఏ విషయంలోనండీ!"

"ఏ విషయంలోనయినా సరే! అది నీకు తెలిసిందే"

"అడగండి"

"ఆనాడు మా తమ్ముడు చనిపోయినపుడు నువ్వేం చెప్పావు? మా శివయ్య బావ మా తమ్ముడి హత్యలో నా ప్రమేయం వుండి వుంటుందని అన్నట్టు చెప్పావు గుర్తుందా?" సూటిగా కనకయ్య కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు నరహరి.

ఎన్నో ఏళ్ళనాటి విషయం యిప్పుడలా నిగ్గదీసి అడుగుతూవుంటే, కనకయ్య నిజంగానే కంగారుపడ్డాడు. అసలా విషయం కాలం మరుగున పడిపోయిందే అనుకున్నాడుగాని, మళ్ళీ ఇన్నాళ్ళ తర్వాత వెలుగులోకి వస్తుందని అతడూహించలేదు. అదిప్పుడెలా పరిణమిస్తుందోనని ఆందోళనపడ్డాడు. అయితే ముందుగానే చిన్న పేచీ వెయ్యాలనుకున్నాడు.

"అలా చెప్పానంటారా?" అమాయకుడిలా మొహం పెడుతూ అన్నాడు.

"ఏమన్నావ్? చెప్పానా. అని ఎదురు ప్రశ్న వేస్తున్నావా? చెప్పినట్లు నీకు గుర్తులేదూ? నిజంచెప్పు. మా శివయ్య బావ అసలలా అన్నాడా? ఊఁ.. చెప్పు" కాలర్ని గట్టిగా బిగించేసరికి కనకయ్యకి ప్రాణం పోతున్నట్టనిపించింది.

కనకయ్యకి మరోమార్గం లేకపోయింది. తన ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోకముందే నిజం చెప్పేయాలనుకున్నాడు లేకుంటే నరహరి అంతపనీ చేస్తాడని అతనికి తెలుసు. అందుకే ఉపేక్షించకూడదనుకున్నాడు.

"బాబూగారూ నన్ను క్షమించండి.." అంటూ నరహరి కాళ్ళమీద పడిపోయాడు కనకయ్య.

నరహరి నివ్వెరపోయాడు. "అంటే నువ్వు చెప్పిందంతా శుద్ధ అబద్ధమా? నీ స్వకల్పితమా?" నిప్పులు చెరుగుతున్న కళ్ళతో విసురుగా అడిగాడు–ఒక్కవూపున అతణ్ణి ఎత్తి నిలబెట్టూ.

"నా తప్పును ఒప్పుకుంటున్నాను బాబూ! క్షమించమని వేడుకుంటున్నాను. ఇంకెప్పుడూ ఇటువంటి వెధవపని చెయ్యను" సుమారు రుద్ధ స్వరంతో అన్నాడు.

"క్షమించాల్సిందినేనుకాదుకనకయ్యా! శివయ్య బావ క్షమించాలి. అప్పుడే నీకు ముక్తి" అంటూ "కామరాజూ! శివయ్య బావని నేను రమ్మన్నానని చెప్పు. అర్థించు. వున్నపాటున రమ్మను" అన్నాడు కామరాజుకేసి చూసి.

నరహరిలో ఇప్పటికయినా అటువంటి మార్పు వచ్చినందుకు పరమానంద భరితుడైన కామరాజు చప్పునబైలుదేరాడు.

మరో పదినిముషాల్లో శివయ్యవచ్చాడు. నరహరి కబురు పంపించాక, వెళ్ళకపోవడం సభ్యతగా ఉండదనుకొనివచ్చాడు. అంతేగాని, తానెందుకు వాళ్ళింటికి వెళ్ళాలన్న అహంకారం శివయ్యకు లేకపోయింది.

"రా బావా! నీ మొహం చూడ్డానికి నాకే సిగ్గువేస్తోంది. ఇన్నాళ్ళూ మన మధ్య పెద్ద అగాధాన్ని సృష్టించిన ఈ పెద్దమనిషిని చూడు..." అంటూ సగౌరవంగా శివయ్యని ఆహ్వానించి కనకయ్యని చూపించాడు నరహరి.

శివయ్యకి ఇదంతా ఏమీ అర్థంకాలేదు. గదిలోపలికి వచ్చి కనకయ్యని చూశాడు. కనకయ్య మొహంలో కళ లేకపోవడాన్ని





గమనించాడు.

శివయ్య ఓ కుర్చీలో ఆశీనుడయ్యాడు. నరహరి జరిగినదంతా చెప్పాడు. అంతా విన్న శివయ్య ఆశ్చర్యపోయాడు. నేరస్థుడిలా రెండు చేతులూ కట్టుకుని, మొహం దించుకుని నుంచున్న కనకయ్య కేసి చూశాడు.

"కనకయ్యా! నిజానికి నువ్వు క్షమార్హుడివి కాదు. మా రెండు కుటుంబాల మధ్య నువ్వు సృష్టించిన అగాధం మాకెంతో నష్టం కలిగించింది. అయినా నిన్ను క్షమిస్తున్నాను... ఇక ముందెప్పుడూ యిటువంటి వెధవ పనులు చెయ్యకు. నువ్వు చేసిన ఈ తప్పును కలకాలం జ్ఞప్తికుంచుకుని పశ్చాత్తాపంతో ప్రవర్తించు. వెళ్ళు..." గంభీరంగా అన్నాడు శివయ్య.

కరణం కనకయ్య అవనతముఖుడై కంటతడి పెట్టుకుంటూ అక్కణ్ణించి మెల్లగా నిష్క్రమించాడు.

"ఇలాగయినా మనం మళ్ళీ కలుసుకున్నాం... అందుకు నాకెంతో ఆనందంగా వుంది బావా" అన్నాడు శివయ్య.

"నీకేకాదు.మన రెండు కుటుంబాల్లోని వ్యక్తులకూ ఇది ఆనందదాయకమైన విషయమే. ఈ మన కలయికకు కారణ భూతమైన మా కాంతంని ముఖ్యంగా అభినందించాలి" అంటూ ఆరోజు కాంతం తనతో వాదించిన తీరును చెప్పాడు నరహరి.

అంతలో కామరాజు యిద్దరికీ కాఫీ తెచ్చి అందించాడు.

"అప్పుడే కాఫీ తయారయ్యిందబ్బోయ్" అన్నాడు శివయ్య.

"బాబుగారూ! మీరిద్దరూ కలవడం నా ఒక్కడికే కాదు వూరందరికీ ఆనందాన్నిస్తుంది. అటువంటి తరుణంలో కాఫీ యేమిటి అమృతమే పంచాలి లభ్యమైతే" నవ్వుతూ అన్నాడు కామరాజు.

శివయ్య, నరహరి నవ్వుతూ కాఫీ సేవించారు. "వస్తాను బావా! నువ్వోసారి రా యింటికి" అంటూ నిష్క్రమించాడు, శివయ్య ఎంతో వుత్సాహంతో.

నరహరి తృప్తిగా నవ్వుకున్నాడు.

* * *

తమ కుటుంబం, నరహరి మావయ్య కుటుంబం చాలాకాలం తర్వాత మళ్ళీ సత్సంబంధాల్ని, అనుబంధాల్ని పెంపొందించుకున్నందుకు మహదానందం పొందాడు హరిబాబు. అసలు అదెలా సాధ్యపడిందో తండ్రి వల్ల విషయమంతా తెలుసుకుని, తండ్రిని అభినందించకుండా వుండలేకపోయాడు.

"మీరాపాటి విశాల హృదయాన్ని ప్రదర్శించి అత్తయ్య ఆరోగ్యం విషయం అడిగేసరికి, మావయ్య బహుశా చిత్తయిపోయుంటాడు. అప్పుడే అతనిలో మార్పు వచ్చి వుంటుంది. అందుకే మిమ్మల్ని వాళ్ళింటికి ఆహ్వానించాడు" వూహిస్తూ అన్నాడు హరి. శివయ్య మాట్లాడలేదు.

"ఏమైనా ఇది శుభసూచకం... మనకే కాదు నాన్నా ఈ ఊరికి..." ఆనందంతో అన్నాడు హరిబాబు.

"ఈ ఊరికా? ఏ విధంగా?" ఆశ్చర్యపోతూ అడిగాడు శివయ్య.

"ఔన్నాన్నా! మీరిద్దరూ దూరంగా ఉన్నంతకాలం వూళ్ళోని చాలామంది స్వార్థపరులు ఇష్టమొచ్చినట్టు ప్రవర్తించి ఏదో ఒకపక్షంవహిస్తున్నామన్న ధైర్యంతో మసలేవాళ్ళు. గ్రామపురోభివృద్ధి కోసం ఎవ్వరూ పాటుపడ్డం లేదు. అందుకే



అంటున్నాను-మీరిద్దరూ ఒకటైతే ఈ గ్రామం బాగుపడుతుంది. ముఖ్యంగా మనకో ఆసుపత్రి కావాలి నాన్నా. వీధులు తీరూతెన్నూ లేకుండా ఉన్నాయి. వాటిని బాగుచెయ్యాలి. పోతే హరిజన వాడ గురించి ఎవ్వరమూ ఆలోచించలేదు. వాళ్ళకి సరైన వసతులేర్పర్చి, వాళ్ళ పిల్లలు చదువుకునే అవకాశాలు కల్పించాలి..."

శివయ్య చిన్నగా నవ్వేడు.

"మనం కల్పించడమేమిట్రా! వాళ్ళ పిల్లల్ని స్కూలుకు పంపితే మనం వద్దంటున్నామా? మరి దాసు ఎలా చదువు కున్నాడు చెప్పు"

"దాసు సంగతి వేరు నాన్నా! నిజం చెప్పాలంటే, దాసుకి మన ప్రోత్సాహం లభించింది గాబట్టి వాడిలో ఆ ఉత్సాహం, శ్రద్ధ కలిగాయి. కాని మిగిలినవారికి అటువంటి అవకాశాల్లేవు"

"సరే! చూద్దాం. అన్నట్టు ఆ మేష్టారు చక్రపాణి విషయం ఏమయ్యిం దిరా? వచ్చాడా ఊర్నించి?".

"ఈరోజు వాకబు చేస్తాలే నాన్నా? అలా ఆలయానికి వెళ్ళొస్తా నాన్నా"

"వెళ్ళిరా!"

హరిబాబు అక్కణ్నించి నిష్క్ర మించి, ఆలయం కేసి నడిచాడు.

* * *

హరిబాబు నేరుగా స్కూలుకి పోయాడు. చక్రపాణి మేష్టారు గురించి వాకబు చేస్తే అతను రాజీనామా పంపించాడని తెలిసింది. నిశ్చేష్టుడయ్యాడు హరి. ఎంత నాటకమాడాడు ? వాళ్ళ మావయ్యతో సంప్రదించాలని చెప్పి వెళ్ళి ఇదా వాడు చేసిన నిర్వాకం ? చక్రపాణి మీద వల్ల





మాలిన కోపం వచ్చింది. అయినా ఆ కోపాన్ని ప్రదర్శించకుండా చక్రపాణి అడ్రసు సంపాదించి వచ్చాడు.

ఇల్లు చేరుకున్నాడేగాని, చక్రపాణి విషయం ఎలా చెప్పడమా అన్న సందిగ్ధంలో పడ్డాడు హరిబాబు. అతడిలా సందిగ్ధావస్థలో పడి కొట్టుకుంటూ వుండగా, శివయ్యే అడిగాడు "ఆ మేష్టారు విషయం ఏమైనా తెలిసిందిరా అబ్బాయ్?" అని.

హరిబాబు బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"వాడో మోసగాడులా వున్నాడు నాన్నా! మన దగ్గర ఇన్ని కబుర్లు చెప్పి వెళ్ళాడా..అక్కడికి వెళ్ళాక రాజీనామా వుత్తరం పంపాడు. దొంగ రాస్కెల్"

శివయ్య నిర్ఘాంతపోయాడు. ఇటువంటి పరిస్థితిని అతనెప్పుడూ ఎదుర్కోలేదు గాబట్టి, ఆందోళన కలిగింది. దాంతోపాటు ఆవేశమూ పొడచూపిందతని కళ్ళల్లో.

"ఏమిటి? రాజీనామా పంపించాడా?" విసురుగానే అన్నాడు.

"ఔన్నాన్నా"

"చూశావా ఎంత పన్జేశాడో? అసలు తప్పు మన అరుణది. ఆ వెధవ సంగతి పూర్తిగా తెలుసుకోకుండా వాడి రూపం చూసి ప్రేమించడం దాని తప్పు. చెప్పాలంటే, ఇప్పుడిదో ఫాషనయ్యిం దిరా. ఇప్పుడేం చేస్తాం? వాణ్ని ఎక్కడ పట్టుకుంటాం? అయినా అటువంటి ప్రయత్నం మరింత అప్రతిష్టకాదా మనకి" అతనిలో ఉద్భవించిన యెన్నో ప్రశ్నల్ని బైటపెట్టాడు శివయ్య.

"వాడి అడ్రసు సంపాదించాను నాన్నా! రాజమండ్రి నుండి పంపాడా రాజీనామా పత్రాన్ని. అక్కడికి వెళ్ళి వాణ్ని తీసుకొస్తాను" చిరుకోపంతో

అన్నాడు హరిబాబు.

శివయ్య భారంగా ఓ విశ్వాసాన్ని వదిలి పెట్టాడు.

"నువ్వు యువకుడివి గాబట్టి అలా అనేశావు. కాని అలా చేస్తే విషయం రచ్చకెక్కదా? నిదానంగా ఆలోచించు" సాలోచనగా అన్నాడు.

అదీ నిజమేననిపించింది హరికి. "అయితే మరేం చేద్దామంటారు...?" పేలవంగా అన్నాడు. అరుణ జీవితంలో ఇటువంటి సంఘర్షణ రావడం అతనికెంతో బాధనిపించింది. ఆమె ఆశలు ఈవిధంగా మట్టిగొట్టుకుపోవడం సహించలేకపోతున్నాడు.

"ఇటువంటి దొంగ వెధవ అరుణకి భర్తగా అవాంఛనీయుడు! ఇంతా చూస్తే వాడు మనతో చెప్పిందంతా శుద్ధ నిజమని నమ్మలేం కూడాను. అసలు వాడు బ్రహ్మచారో లేక పెళ్ళయినవాడో కూడా నిర్ణయించుకోలేం. అందుకని వాడి ప్రసక్తే వదిలేద్దాం. అరుణకి మరో మంచి సంబంధం చూసి పెళ్ళి చేద్దాం" అంటూ తన నిర్ణయాన్ని వెల్లడించాడు శివయ్య.

"అరుణ అంగీకరిస్తుందా నాన్నా?"

"అంగీకరించక ఏం చేస్తుందిరా? చక్రపాణిలాంటి మోసగాణ్ని చేసుకుని ఏం సుఖపడుతుందని? మీ అత్తయ్యని, అరుణని ఓసారి ఇలా రమ్మను. వాళ్ళతో సంప్రదిద్దాం"

హరిబాబు గదిలోంచి బైటికొచ్చేసరికి కళ్లొత్తుకుంటూ అరుణ కనిపించింది.

"అంతా విన్నావన్నమాట?"

"పోను బావా" రుద్ధ స్వరంతో అంది అరుణ.

"అత్తయ్యని తీసుకొస్తాను. నువ్వు



లోపలికి పద" అంటూ కమలని తీసుకుని వెంటనే వచ్చాడు.

కమల, అరుణ సమక్షంలో చక్రపాణి విషయం వెల్లడించాడు. అరుణ వెక్కి వెక్కి ఏడవడం మినహా మరేం మాట్లాడలేకపోయింది. కమల ఆందోళనతో కుమిలిపోసాగింది.

అప్పుడే పోస్ట్‌మన్ కేక వినిపించడంతో హరి చప్పున వెళ్ళి వుత్తరం అందుకున్నాడు. అదో కవరు త్తరం. దాన్ని ఆత్రంగా విప్పాడు. కింద సంతకం చూశాడు. చక్రపాణిది. తండ్రి వున్న గదికొచ్చాడు చరచరా.

"చక్రపాణి దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది నాన్నా" అన్నాడు.

అక్కడున్న వాళ్ళందరి కళ్ళూ ఆశతో మెరిశాయి. అరుణ హృదయం పుల్కాంగిపోయింది. చక్రపాణి దగ్గర్నుంచి ఏదో శుభవార్తే వచ్చి వుంటుందని ఆశించింది. ఆ వుత్తరంలోని వివరాలు తెలుసుకోవాలన్న ఆసక్తితో ఆమె కళ్లు ఎదురు చూస్తున్నాయి.

"ఏం రాశాడో చదువు" అన్నాడు శివయ్య.

హరిబాబు వుత్తరాన్ని చదవడం ప్రారంభించాడు.

"మైడియర్ హరిబాబూ!

నా దగ్గర్నించి ఈ వుత్తరం రాకముందు నా గురించి మీరంతా ఏమేమో వూహించుకుని వుంటారని నాకు తెలుసు. మీరేం వూహించుకున్నా నా గురించి మీకు తెలిసింది చాలా తక్కువే. మీ సమక్షంలో నేను చెప్పిందాంట్లో చాలా వరకు అసత్యమే. నేను అవివాహితుణ్ని కాదు. వివాహితుణ్ని. ఒకబ్బాయి కూడా వున్నాడు. నాకు తల్లిదండ్రులున్నారు. అయితే నేనెందుకు అబద్ధం చెప్పానని మీరనుకోవచ్చు. దానికికారణం కేవలం మీ అందరినుండి అప్పటికి తప్పించుకోవాలనే. అరుణని ఆకర్షించడంలో నా తప్పేమీ లేదు. ఆమె నేనంటే అభిమానాన్ని, అనురాగాన్ని పెంచుకుంది. నాలోని ఏదో బలహీనత ఆమెను తిరస్కరించనివ్వలేదు. అలాగని ఆమెకు నేనే విధంగానూ అపకారం చెయ్యలేదు. ఎటొచ్చీ, ఆమెలో మొలకెత్తిన ప్రేమానురాగాలకు దోహదం చెయ్యడంలో నా తప్పుంది. అందుకు క్షమాపణ చెప్పుకుంటున్నాను. నా తప్పుకు నేను వేసుకున్న శిక్షేమిటో తెలుసా? నేనిప్పుడు నిరుద్యోగిని. మీ నాన్నగారికి నా నమస్కారములు. అరుణని అడిగినట్టు చెప్పు. నన్ను క్షమిస్తుందని ఆశిస్తున్నాను.

ఇట్లు
చక్రపాణి"

అరుణ మొహం మ్లానమయ్యింది. ఆమె కళ్ళవెంట కన్నీరు జలజలారాలింది. రెండు చేతుల్తో మొహం కప్పుకుని ఏడుస్తూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

కమల కళ్ళల్లో క్రోధం నిప్పులు చెరుగుతోంది. "వాడలా రాస్తే మనం ఏమీ చేతకానట్టు వూరుకోవడమేనేవిటన్నయ్యా?" అంది ఆవేశంతో.

"వూరుకోక ఏం చెయ్యగలమమ్మా కమలా? ఇంతటితో మనం వూరుకోపోతే మన అరుణ బతుకు నవ్వులపాలవుతుంది. ఏదివచ్చినా మన మంచికేఅనుకో. మంచి సంబంధం చూసి పెళ్ళి చేసేద్దాం. దానికేం తక్కువని. అయితే, నువ్వు దాన్నో కంట చూస్తూ వుండాలి. ఆవేశంలో ఏ అఘాయిత్యానికి పూనుకున్నా ఆశ్చర్యం వుండదు" అంటూ హెచ్చరిం




చాడు శివయ్య.

కమల మరేం మాట్లాడలేదు. అక్క ణ్ణించి వెళ్ళిపోయింది.

"ఇప్పట్నుంచి ఆయణకి మంచి సంబంధమేదైనా వెదకాలిరా" అన్నాడు శివయ్య.

"నేనూ ఆ ధ్యాసలోవుంటాన్లేనాన్నా! అలా వెళ్ళొస్తాను" అనేసి బైటికి నడిచాడు హరిబాబు.

శివయ్య భారంగా ఓ నిట్టూర్పువిడిచి కుర్చీలో వెనక్కి వాలిపోయాడు బాగా అలసిపోయినవాడిలా.




పున్నమినాటి వెన్నెల ఆహ్లాదకరంగా వుంది. వెన్నెల కాంతి సముద్రం మీద ప్రతిఫలిస్తోంది.

దాసు, కాంతం బీచ్‌లో కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంతకు ముందు కాంతాన్ని చూస్తే దాసు కాస్త భయపడేవాడు. ఆమెని బహువచనంలో సంబోధించేవాడు. ఇప్పుడా బెరుకుదనం పోయింది. ఆమె కోరికపై ఆమెను బహువచనంలో సంబోధించడం మానుకున్నాడు. ఒకటి రెండు రోజులు ఎబ్బెట్టుగా తోచినా యిప్పుడు అలవాటు పడిపోయాడు.

శాంతమ్మ ఆరోగ్యం యిప్పుడు కుదుటబడింది. హాస్పటల్నించి కాళిదాసు ఇంటికి వచ్చేసింది.

"దాసూ! మేం రేపు వెళ్ళిపోతున్నాం" అంతవరకూ ఏవో కబుర్లు చెప్పాక, ఈ విషయం చెప్పలేక చెప్పలేక చెప్పింది కాంతం.

దాసు క్షణం మాట్లాడలేకపోయాడు. కాంతం తనకి దూరమౌతుందంటే నిజంగానే బాధనిపిస్తోంది. వారి పరిచయం తక్కువ కాలమే అయినా, వారి మధ్య అనుబంధం వీడని బంధంలా అతణ్ణి పట్టి లాగుతోంది.

దాసు మౌనంగా వుండటం, కాంతం గమనించింది.

"మాట్లాడవేం దాసూ?" అంది అతని మొహంలోకి చూస్తూ.

"ఏం మాట్లాడమంటావు కాంతం! నువ్వు వెళ్ళిపోతున్నావంటే, ఏవిటో దిగులుగా వుంది" సీరసంగా అన్నాడు.

"దిగులుగా వున్నప్పుడల్లా అక్కడికి వచ్చేసెయ్" చిలిపిగా నవ్వుతూ అంది కాంతం.

"ఒకవేళ నేను వచ్చినా యిక్కడిలా అక్కడ మనం కలియగలమా? అక్కడి వాతావరణమే వేరు. అందులోనూ మీ నాన్నగారు ధండశాసనుడు. మనిద్దరం ఓ చోట వుండటం చూశారంటే నా ప్రాణానికే ముప్పు. నువ్వూ ఇరకాటంలో పడతావు. ఆ పరిణామాలన్నీ వూహించుకుంటేనే భయంగా వుంది" అతని స్వరంలో నిరుత్సాహం ధ్వనించింది.

కాంతం అర్థం చేసుకోగలిగింది - దాసు భీతిల్లడానికి హేతువేవిటో. అతనలా భయపడ్డానికి కారణం లేకపోలేదనుకుంది. ఆ పల్లె జీవితమే వేరు. అక్కడి ఆచార వ్యవహారాలు వేరు. అక్కడి కట్టుదిట్టాలు వేరు. హరిజనులంటేనే అస

హ్యాంచుకునే మిగిలిన జాతివారు ఓ హరిజనుడితో తాను తిరగడం హర్షించరు; సహించలేరు. సంఘర్షణ ప్రారంభం కాక తప్పదు. తన తండ్రి దాసుని చెట్టుకి కట్టించి, కొట్టించి చంపినా ఆశ్చర్యపోవల్సింది లేదు... ఇలా వూహించుకుపోతుంటే కాంతం హృదయం తల్లడిల్లిపోయింది. ఆమె వుత్సాహమంతా ఒక్కసారి మాయమయ్యింది.

ఆ వెన్నెల కాంతిలో కాంతం మొహం వెలవెలబోవడం దాసు గుర్తించకపోలేదు.

''నువ్వు చెప్పిందీ కాదనలేకపోతున్నాను దాసూ! మన ఈ స్నేహం మన వూళ్ళో ప్రదర్శితమైతే పర్యవసానం ఎలా వుంటుందో యిప్పుడిప్పుడే వూహించుకోగలుగుతున్నాను. అయితే ఒక్క విషయం. మనసులు కలిశాక రాబోయే పర్యవసానాలు ఎంత విపత్కరమైనవయినా, మనం వాటిని ఎదుర్కోడానికి సంసిద్ధంగా వుండాలి. ఏమంటావు?" వుద్రేకంలో ఏదో అనేసింది కాంతం.

దాసు చిన్నగా మందహాసం చేశాడు.

''మనకో స్వయం ప్రతిపత్తీ, స్వశక్తిపై ఆధారపడే అవకాశం వున్ననాడే మనం అలా ఎదుర్కోగలం కాంతం. అప్పుడు ఏ శక్తీ మనల్ని విడదీయలేదు. కాని ప్రస్తుత పరిస్థితిలో ఆ రిస్కు తీసుకోలేమేమో ఆలోచించు" అన్నాడు సౌమ్యంగా.

దాసు యేం మాట్లాడినా తూచి, తూచి మాట్లాడతాడన్న విషయం కాంతంకి బాగా తెలుసు.

"అది నిజమే అనుకో. పోనీ, నేను వుత్తరాలు రాస్తూంటాను. సమాధానం రాస్తావుకదూ''





''అదే ప్రమాదమే కాంతం! మీనాన్నగారి చేతిలో పడిందనుకో వుత్తరం-అప్పుడింకేమైనా వుందా?''

''ఆయన చేతిలో నీ వుత్తరం పడకుండా నేను చూస్తాను''

''సమయం ఎల్లప్పుడూ ఒకేలా వుండదు కాంతం''

''ఒలా చేద్దాం''

''ఏవిటి?''

''మన వూరు విషయం వుత్తరాల్లో ప్రస్తావించకండా, కేవలం విశాఖ విశేషాలు, నీ చదువు విషయాలే రాయి. సంతకం పెట్టొద్దు'' అంటూ సలహా యిచ్చింది.

దాసుకి ఈ ప్లానూ నచ్చలేదు. అయినా కాంతం తృప్తికోసం 'వూ' కొట్టాడు.

''సరే, అట్లాగే చేద్దాం'' అనేశాడు.

''మరి పోదామా?'' లేచింది కాంతం.

దాసు కూడా లేచాడు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. ఇరువురి హృదయాల్లోనూ ఏవేవో భావాలు మౌనంగా మెదుల్తూనే వున్నయ్.

సరిగ్గా అదే సమయంలో కాళిదాసు ఎదురయ్యాడు. కాంతం సరసన దాసుని చూసేసరికి అతనికి వొళ్ళుమండిపోయింది. కాంతం తనతో బీచ్‌కి రాకుండా విడిగా ఒక్కతే వెళ్తుండడానికి కారణం ఏమై ఉంటుందో యిప్పుడూహించగలిగాడు. అయినా ఈ హరిజనుడితో కాంతంకి స్నేహం ఏమిటి? మతిగాని భ్రమించలేదు కదా అనుకున్నాడు.

"ఇక్కడికొచ్చావా కాంతం? మీ అమ్మ వూరికే కంగారుపడుతూవుంటే కొత్త సినిమాలు రెండు రిలీజయ్యాయి, దేనికో వెళ్ళి వుంటుందిలే అని చెప్పాను. నువ్వు బీచ్‌కి వచ్చావని నాకేంతెలుసు?" అన్నాడు.

"రేపే వెళ్ళిపోతున్నాంగా మావయ్యా! అందుకని బీచ్‌కి రావాలనిపించి వచ్చాను" ముభావంగా సమాధానం చెప్పింది కాంతం.

"ఔనుమరి! బీచ్‌కి, బీచ్‌కి వచ్చే వాళ్ళకి గుడ్‌బైచెప్పి వెళ్ళాలిగా. రావడం అవసరమే" అన్నాడు – అదోలా దాసు కేసి చూస్తూ భావగర్భితంగా.

"వాట్ డుయూ మీన్ మావయ్యా?" అంది విసురుగా.

కాళిదాసు కాస్త కలవరపడ్డాడు.

"అబ్బే ఏంలేదులే. బీచ్‌కి రావడం, యిక్కడ ఎవరెవర్నో కలుసుకుని మాట్లాడ్డం యివన్నీ అనుభూతులే. ఈ అనుభూతుల్నించి దూరమౌతుంటే ఎవరికయినా కష్టంగానే ఉంటుంది. సరే పద పోదాం" అన్నాడు లౌక్యంగా.

"దాసూ! మరి నే వెళ్లొస్తా" అంటూ వీడ్కోలు చెప్పింది కాంతం.

"మంచిది" ముక్తసరిగా అన్నాడు దాసు.

అతని సమాధానంలో ఒకనాటి స్నమత మచ్చుకయినా అగుపించలేదు కాళిదాసుకి. ఆశ్చర్యపోయాడతను. ఇంతలోనే వీరిమధ్య అనుబంధం పెరిగిందా? బహువచన ప్రయోగాలకి స్వస్తి చెప్పాల్సినంత దగ్గరయ్యారా యిద్దరూ?

కాళిదాసు, కాంతం ముందుకి సాగిపోయారు. దాసు వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

* * *

నాగావళి నదికి 'దొంగనది' అనే సార్థక నామం ఉందని అంటూ ఉండేవారు. ఆ నది హఠాత్తుగా ఉధృతమైన వేగంతో పొంగి ప్రవహిస్తుండడంవల్లనే ఆ పేరొచ్చిందని పెద్దలు చెబుతూ ఉంటారు. అది నిజమైనా కాకపోయినా, ఓనాటి అర్ధరాత్రి ఎవ్వరూ ఊహించనంత ప్రచండ వేగంతో పొంగి ప్రవహించిందా నది. ఫలితంగా నదీతీరాన ఉన్న చాలా గ్రామాలు నష్టపోయాయి. శివయ్య, నరహరి – పిల్లలతో ఉన్న ప్రాంతం మెరకప్రాంతం కావడం వల్ల నీరు వీధుల్లోకి వచ్చినా, ఇళ్ళల్లో ప్రవేశించలేదు. అయితే ఆ పూరి హరిజనవాడ పూర్తిగా మునిగిపోయింది పల్లపు ప్రాంతం కావడంవల్ల.

అంతా మత్తుగా నిద్రపోతున్న తరుణంలో వరద ముంచుకు రావడంవల్ల ముందు జాగ్రత్త తీసుకోడానికి ఎవరికీ అవకాశం లేకపోయింది. హాహాకారాలతో, ఏడుపు మొరల్తో ఆ ప్రాంతం అల్లకల్లోలమయింది. కొందరు ప్రవాహపు నీటిలో కొట్టుకుపోయినవాళ్ళు, ఊపిరందక ప్రాణాలు పోగొట్టుకున్నవాళ్లు లెక్కలేదు.

అలా ప్రాణాలు పోగొట్టుకున్న వారిలో దాసు తల్లిదండ్రులూ ఉన్నారు. నిజానికి గంగులు బతికేవాడే. అయితే భార్య కోసం వెదుకుతూ ఆ ప్రవాహానికి ఆహుతి అయ్యాడు.

తెల్లవారేసరికి నాగావళి నది ఓ సముద్రంలా కనిపించింది. వూళ్ళోకి వచ్చిన నీరు క్రమంగా తగ్గినా, పల్లపు ప్రాంతమైన హరిజనవాడ నీటిమయంగా ఉంది. కొట్టుకుపోగా మిగిలిన గుడిసెలు తాటి గొడుగుల్లా అగుపిస్తున్నాయి. బతికి బయటపడ్డ కొద్దిమంది హరిజనులు మెరకప్రాంతానికొచ్చి చెట్లనీడలో తల దాచుకున్నారు. ప్రాణాలు పోగొట్టుకున్న తమవారిగురించి విలపించసాగారు. వారి దీనావస్థకి వూళ్ళోవాళ్ళంతా కంటతడి

పెట్టుకున్నారు.

శివయ్య, నరహరి మొదలగు పెద్దలు వరద ముంచిన హరిజనవాడకి వెళ్లి కష్టదశలో ఉన్నవారికి తగు సహాయాన్ని అందించారు.

శివయ్య తన అనుచరుడు, నమ్మిన బంటూ అయిన గంగులూ, అతడి భార్య మృత్యువాతపడినందుకు కంటతడి పెట్టుకున్నాడు.

శివయ్య నాయకత్వంలో వరదబాధితులకు తిండి, బట్ట ఏర్పాట్లు జరిగాయి. మృతదేహాలన్నింటినీ ఓ చోట చేర్పించాడు. ఎవరి మాట ఎలా ఉన్నా దాసు వచ్చేవరకూ అతడి తల్లిదండ్రుల శవాల్ని ఉంచడమా, మానడమా అన్న సందిగ్ధంలో పడ్డాడు శివయ్య. దాసుకి వార్త వెళ్ళడం, అతడు రావడం–ఇవన్నీ జరిగేసరికి సమయం పడుతుందేమోననుకున్నాడు.

ఉదయం పది గంటలకి పట్నం నుంచి అధికారులొచ్చారు. వారితోపాటు రాజకీయనాయకులూ వచ్చారు. వరద వార్త తెలిసి, తమ గ్రామానికి ఏదో ప్రమాదం ఉంటుందని ఊహించిన హరిబాబు కూడా వచ్చేశాడు. తన మిత్రుడు దాసు చివరిసారిగా తల్లిదండ్రుల మృతదేహాల్నయినా చూడకుండా వీరిని దహనచేయడం హరికి ఇష్టం లేకపోయింది. అలాగని ఎంతవరకు ఉంచగలరు? ఒకపక్క అధికారులు వాటిని దహనంచేయించమని తొందర చేస్తున్నారు. ఏం చెయ్యాలమో బోధపడలేదు హరికి.

"చూడండి! వీళ్ళబ్బాయి వాల్తేరులో డాక్టరీ చదువుతున్నాడు. వీళ్ళ మృతదేహాల్నయినా వాడు చూడకపోతే జీవితాంతం బాధపడతాడు. నేనిప్పుడే పట్నం పోయి, అక్కణ్నించి బస్సులో వాల్తేరు వెళ్తాను. వెంటనే తీసుకొస్తాను. సాయంకాలంలోగా వచ్చేస్తాను. ఇది నా రిక్వెస్టు.. కాదనకండి" అంటూ ఓ అధికారిని ప్రాధేయపడ్డాడు హరిబాబు.

ఆ అధికారి కూడా కాస్తంత కరిగినట్టున్నాడు. కాదనలేకపోయాడు.

"సరేలెండి. మీరు బయల్దేరండి. ఆ రెండు మృత దేహాల్ని ఉంచుతాం. మిగిలినవి దహనంచేస్తాం" అంటూ హామీ ఇచ్చాడు.

హరిబాబు ఆ అధికారిని అభినందించి తాను బయల్దేరిపోయాడు పట్నం. దాసు స్నేహితుడిగా తాను ఈపాటి చెయ్యకపోతే, ఇంక స్నేహానికి అర్థమే లేదనుకున్నాడు. వడివడిగా పట్నంకేసి నడుస్తున్నాడు హరి.

గంగులు మరణానికి బాధపడుతోంది కాంతం. తల్లిదండ్రులిద్దరూ ఒకేసారి మృత్యువు వాతపడినందుకు దాసు తట్టుకోగలడా? అతడు వస్తే ఎంత విలపిస్తాడో? అతణ్ని అనునయించే అవకాశం తనకి లేదు...అంటూ మౌనంగా బాధపడింది.

గంగులు దంపతుల మృతదేహాలు రెండూవుంచేసి, మిగిలిన మృతదేహాల్ని వారి బంధువులచేత దహనం చేయించారు అధికారులు. ఏర్పాట్లన్నీ దగ్గరుండి చేయించారు శివయ్య, నరహరీను.

సాయంత్రానికి హరిజనవాడలో నీరు పూర్తిగా తగ్గిపోయింది. కూలిపోయిన గుడిసెలు, చివికిపోయిన గుడిసెలు, చెల్లాచెదురుగా విరజిమ్మినట్టు పడినసామాను.. ఇవన్నీ చూస్తుంటే ఎవరికయినా గుండెలు తరుక్కుపోతాయి.




సాయంత్రం ఏడుగంటలకి దాసుని తీసుకుని హరిబాబు వచ్చాడు. అప్పటి వరకూ విలపిస్తూనేవున్నాడు గామోసు, అతనికళ్ళు పొంగివున్నయ్... మొహం పాలిపోయివుంది. తల్లిదండ్రుల మృత దేహాల్ని చూసి బావురుమన్నాడు.

అతని దుఃఖం చూడలేక కళ్ళొత్తుకుంటూ మొహాలుదించుకున్నారు, శివయ్య, నరహరి, హరిబాబూను. దూరంగా నిల్చున్న కాంతానికి ఎక్కడలేని దుఃఖమూ వచ్చిపడింది. పక్కకు తిరిగి కళ్ళొత్తుకుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

హరిబాబు వచ్చి దాసుని పట్టుకుని ఓదార్చాడు.

"దాసూ! ఇలా జరగడం నీదురదృష్టం ఆపైన నా దురదృష్టం కూడాను. నాకు స్నేహితుడులాంటి వ్యక్తి ఈ లోకాన్ని విడిచిపోయినందుకు నేనూ బాధపడుతున్నాను. కాని, ఎవ్వరమూ ఏమీ చెయ్యలేం. అంతా దైవేచ్ఛ. లేకుంటే అర్ధరాత్రిపూట వుప్పెన రావడమేమిటి? ధైర్యంతెచ్చుకో" అంటూ దాసు భుజం తట్టాడు శివయ్య.

ఆ తర్వాత గంగులు దంపతులకు దహన సంస్కారం ఏర్పాటు చేశాడు శివయ్య.

ఆ మూడురోజులు శివయ్య ఇంట్లోనే వున్నాడు దాసు. తర్వాత, హరిబాబు దాసుని వాళ్లతోపు తీసుకుని వెళ్ళాడు. దాసుతోపాటు రెండురోజులుండి తిరిగొచ్చాడు.

* * *

చక్రపాణి నిజస్వరూపం తెలిశాక, అరుణ ప్రేమపర్వం ముగిసినట్టే అయ్యింది. ఆమె జీవితంలో అదో మరపురాని ముద్రవేసింది. అందుకే అప్పట్నుంచీ మగాళ్ళన్నా, ప్రేమఅన్నా జుగుప్స ఏర్పడిందామెకి. ఎంతో వుత్సాహంగా వుండే అరుణ నీరసంగా, నిరుత్సాహంగా మారిపోయింది. మునుపటి గ్లామరే ఆమెలో లేకుండాయ్యింది.

అరుణలో వచ్చిన ఈ మార్పునుచూసి తల్లి కమల ఒక్కర్తే కాదు శివయ్య, హరిబాబు కూడా నొచ్చుకున్నారు.

"అదిగో... ఇలా నువ్వు మౌనంగా వుంటేనే నాకు బాధనిపిస్తుంది. నిజం చెప్పాలంటే మన వంశంలో యిటువంటి పరిస్థితి ఎప్పుడూ ఏర్పడలేదు. అందుకే మనం తట్టుకోలేకపోతున్నాం. ఇకనుంచీ ఆ విషయాల్ని గుర్తుతెచ్చుకోకు. చదువు పూర్తి చెయ్యాలంటే మెట్రిక్యులేషనుకి ప్రైవేటుగా కట్టు. హరి చదువు పూర్తవ్వబోతోందిగా... వాడే అన్ని ఏర్పాట్లూ చేస్తాడు. ఆవిధంగానైనా నీ ఆలోచనలు గతంలోకి వెళ్లకుండా అవుతుంది''

"అలాగే మావయ్యా! మెట్రిక్యులేషన్‌కి కడతాను. బావ రానివ్వు" అంది.

"మరోటి గుర్తుంచుకో అరుణా! ఏది ఎలా జరగాలో అలా జరక్క తప్పదు. ఇలా జరగాలి అని మనం ఎప్పుడూ విధిని శాసించలేం. జరిగిన దాంతో, జరుగుతున్నదాంతో మనం రాజీపడ్డమే వుత్తమ మార్గం"

"నిజమే మావయ్యా" అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది అరుణ.

శివయ్య బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు. కుర్చీలో వెనక్కి చేరగిలబడ్డాడు.

ఇటీవల అన్నీ సమస్యలే ఎదురవుతున్నట్టు ఫీలయ్యాడు. అయినా ఎదుర్కోక తప్పదనుకున్నాడు. ఇప్పుడతని

మెదడులో మెదుల్తున్న సమస్య అరుణ వివాహం. ఏదో ఓ మంచి సంబంధం చూడాలి.... అనుకున్నాడు.

* * *

"నమస్కారం శివయ్యగారూ!''

తలెత్తి చూశాడు శివయ్య. ఎదురుగా రామినాయుడు. ఇంతకుముందుండే నిస్పృహ ఛాయలు అతని మొహంలో ఇప్పుడు అగుపించటంలేదు. హుషారుగా వున్నాడు. "నమస్కారం..కూచోవోయ్'' అన్నాడు శివయ్య పత్రిక మడిచి పక్కకి పెట్టి.

రామినాయుడు అతనికి అభిముఖంగా అక్కడే కూచున్నాడు.

''ఆ...ఏవిటి విశేషాలు?'' అన్నాడు శివయ్య చుట్ట వెలిగిస్తూ.

''ఏదో మీ దయవల్ల మావాడికి ఉద్యోగం దొరకటమేగాకుండా, ఏదో పరీక్ష పాసయి ఈమధ్యనే ప్రమోషను కూడా వచ్చిందట. మీకు మరోసారి కృతజ్ఞతలుచెప్పుకుంటూడు తరంరాశాడు"

''చాలా సంతోషం నాయుడూ! మీవాడు తెలివయినవాడు. కృషి వుంది. అందుకే వృద్ధిలోకి రాగల అవకాశా లున్నాయి. నేను చేసింది ఏపాటి? ఏదో రికమెండ్ చేశానంతే!''

"అలా అనకండి. అదే పదివేల విలువ. ఈరోజుల్లో ఉద్యోగాలకి వేలం పాటయ్యింది. మీరేగనక రికమెండ్ చెయ్యకపోతే మావాడికి ఉద్యోగం దొరికే దంటారా? వట్టిమాట. మీరు మాకు చేసిన మేలు, ఇప్పటికీచేస్తున్న సహకారం ఈ జన్మలో మర్చిపోలేం''

''దానికేముందిలేవోయ్! మరి, నీ కాంట్రాక్టు వ్యవహారాలు ఎలా ఉన్నాయి?''

"ఫరవాలేదండీ! మీరూ, నరహరి గారూ మళ్ళీ కలిశాక ఆయన అంతగా పోటీపడ్డం లేదండీ! నిజం చెప్పాలంటే, మీరిద్దరూ కలిసిపోయినందుకు ఊళ్ళో చాలామందికి ఎంతోఆనందంగాఉందండీ"

''నీకు తెలీదేమో, అసూయపడిన వాళ్లూ వున్నారు'' నవ్వుతూ అన్నాడు. శివయ్య. కనకయ్యలాంటి వారిని దృష్టిలో పెట్టుకునే అతనలా అన్నాడు. అయితే, రామినాయుడికి ఆ వివరాలేవీ తెలీవుగా మరి.

"ఎవరో స్వార్థపరులయివుంటారు. పోనీలెండి. అందరి మన స్తత్వాలూ ఒక్కలా వుండవు''

''అరుణా'' కేకేశాడు శివయ్య.

అరుణ వచ్చింది లోపల్నించి.

"ఏం మావయ్యా?''

"మా ఇద్దరికీ కాఫీ తీసుకురామ్మా?"

"ఇప్పుడెందుకులెండి శివయ్యగారూ" అన్నాడు మొహమాటపడుతూ రామి నాయుడు.

"ఫరవాలేదులేవోయ్ ... వెళ్ళమ్మా నువ్వు" అన్నాడు శివయ్య.

అరుణ లోపలికెళ్ళిపోయింది.

"మీ అబ్బాయి చదువు పూర్తయినట్టుం దండీ" అన్నాడు రామినాయుడు.

"ఔనోయ్! వాడికి పైచదువులు చదవాలని లేదట. మన ఊళ్ళోనేవుండి వ్యవసాయం చేస్తాట"

''మంచిదేలెండి. చదువుకున్నవాళ్ళు గాబట్టి, వాళ్ళ పద్ధతులే వేరుగాఉంటాయి. ఉద్యోగాల్లో మాత్రం ఏముందండీ! ఎక్కడికోపోయి దూరంగా వుండా ల్సిందేగా''

''వాడి అభిప్రాయమూ అదేనూ''

''మంచిదేనండీ''

అరుణ రెండు గ్లాసుల్తో కాఫీ తీసు




కొచ్చి చెరోటి అందించింది. ఇరువురూ కాఫీ తీసుకుంటున్నారు.

"అరుణ చదువు మానేసిందటండీ" అడిగాడు రామినాయుడు కాఫీతాగడం పూర్తిచేసి, ఖాళీగ్లాసు అక్కడ పెడుతూ.

"ఔనోయ్! మెట్రిక్కు ప్రయివేటుగా వెళ్ళోంది. అయినా, ఇప్పుడది చదువుకొని వుద్యోగం చెయ్యాలా, ఊళ్లేలాలా చెప్పు"

"మీరన్నదీ సబబుగానే వుంది. ఆడది ఎంత చదివినా చివరికి వంటింటికి అంకితమేగదా"

"దానికేదో మంచి సంబంధం చూసి పెళ్ళి చేసేస్తే నా బాధ్యత తీరిపోతుంది"

"ఆదేవిటండీ! సంబంధం చూడ్డం ఏవిటి? మన హరిబాబు వున్నాడుగా? ఇద్దరికీ ఎంచక్కని ఈడూ జోడూ" వింతగా చూస్తూ అన్నాడు రామి నాయుడు.

శివయ్య బరువుగా ఓ నిశ్వాసం వదిలాడు.

"అక్కడే వచ్చిందోయ్ చిక్కు" అంటాను. జ్ఞానం తెలిసిందగ్గర్నించీ వీళ్ళిద్దరూ ఒకేచోట పెరగడంవల్ల వాళ్ళిద్దర్లోనూ ఒకర్నొకరు వివాహం చేసుకోవాలన్న భావనే లేదట. అటువంటప్పుడు బలవంతంగా ఎలా పెళ్ళిచేస్తాం చెప్పు?"

"ఈరోజుల్లో అన్నీ విచిత్రాలేనండీ! లేకపోతే - ఒకచోట పెరిగినా బావా మరదళ్ళు ఎంతమంది వివాహాలు చేసుకొని హాయిగా బతుకుతుండటంలేదు"

"నిజమే. అలాగని మనం బలవంతం చెయ్యలేం. తరువాత ఎటుపోయి ఎటు

వచ్చినా బాధపడాల్సిందీ, విచారించాల్సిందీ పెద్దలమే''

రామినాయుడు క్షణం మౌనందాల్చి ''ఔను. మీరన్నదీ కొట్టిపారేయడానికి వీలులేని విషయం. క్షణక్షణానికీ మారుతున్న ఈ కాలంలో యువతరం మనస్తత్వాలు నిలకడగా వుండటంలేదు. వాళ్ళెప్పుడెలా మారిపోతారో చెప్పలేకుండా వున్నాం. మరి నాకు సెలవిప్పిస్తారా?''

''సరేగాని, మీ అబ్బాయి ఈమధ్య ఎప్పుడయినా వస్తే, నా దగ్గరికి తీసుకురావోయ్. చూసి చాలా రోజులయ్యింది''

"అలాగేనండీ! మీరు పెట్టిన భిక్ష కదా ఆ వుద్యోగం. తప్పకుండా తీసుకొస్తాను. మరి, వెళ్ళొస్తానండీ" అంటూ లేచాడు రామినాయుడు.

"మంచిది వెళ్ళిరావోయ్" అంటూ మళ్ళీ వార్తాపత్రిక అందుకున్నాడు శివయ్య.

రామినాయుడు నిష్క్రమించాడు.




అనుకున్న ప్రకారం దాసు కాంతంకి వుత్తరాలు రాస్తున్నాడు సంతకంలేకుండా. పోస్ట్‌మాన్‌తో ఏర్పాటు చేసుకున్న విధంగా ఆ వుత్తరాలన్నీ కాంతంకే నేరుగా అందివ్వబడుతున్నాయి. సాధారణంగా నరహరి ఇంట్లో వుండడు వుదయం పూటంతా. అప్పుడు వుత్తరాలు తీసుకునేది కాంతమే.

దాసు రాసిన ప్రతి వుత్తరానికీ కాంతం సమాధానమిస్తోంది. ఆమె రాసిన వుత్తరాలు సుదీర్ఘంగా వుంటాయి. వూళ్ళోని విషయాలన్నీ రాస్తుంది. ఆ విధంగా దాసుకి ఆ వూరి విషయాలు తెలుస్తూనే వున్నాయి.

దాసు, కాంతంల పరిచయం హరిబాబుకి తెలియవచ్చింది కాంతం ద్వారానే. అటువంటిదేదో జరుగుతుందని హరిబాబు కలలో కూడా వూహించుకోలేదు. కాంతం వ్యక్తిత్వం ఎప్పుడూ పై అంతస్తులోనే వుంటుంది. దాసుని ఆమె ఎలా అభిమానించిందో, అనురాగాన్ని పెంచుకుందో అతని వూహకి అందలేదు. ఆవిధంగా దాసు తనకి బంధువు అవబోతున్నందుకు హరిబాబు అంతరంగంలో ఆనందించినా ఈ సమస్య చివరికి ఎలా పరిష్కారమవుతుందోనన్న ఆందోళన అతనిలో వుద్భవించింది. కాంతం తండ్రి నరహరి ఛాందసుడు. తన కూతురు ఓ హరిజనుణ్ణి ప్రేమించిందని తెలుసుకున్న క్షణం నరహరి రియాక్షను ఎలావుంటుందో వూహించుకోలేకపోతున్నాడు. అప్పుడొక పెద్ద తుఫాన్ సాక్షాత్కరిస్తుందని అతనికి తెలుసు. అయితే ఆ తుఫాను రాకుండా తప్పించడమెలా అన్న ఆలోచన అతనిలో చోటు చేసుకుంది. 'కాంతంని మర్చిపో' అని స్నేహితుడు దాసుతోనూ చెప్పలేడు. అదేవిధంగా 'దాసుని మర్చిపో' అని మేనకోడలు కాంతంకి చెప్పలేడు. ఒకవేళ చెప్పినా వాళ్ళు తన మాట వింటారన్న నమ్మకం అతనిలో లేకపోయింది. ఆ స్టేజి దాటిపోయిందని అతనికి బాగా తెలుసు. ఎటొచ్చీ రాబోయే




తుఫానుని ఎదుర్కోవడమే చెయ్యాలి. ఈ పరిస్థితిని నరహరి మావయ్య తట్టు కుంటాడా? హరిబాబు మస్తిష్కం చింపరవంపర య్యింది.

అటువంటి పరిస్థితిలో దాసు రాసిన వుత్తరం ఒకటి నరహరి చేతిలో పడింది. ఆరోజు పోస్టుమాన్ వచ్చేసరికి నరహరి ఇంట్లోనే వున్నాడు. అతణ్ని చూడగానే పోస్టుమాన్‌కి ముచ్చెమటలు పోశాయి. ఏం చెయ్యడమో పాలుపోలేదు. చేతిలో వున్నది ఆ ఒక్క వుత్తరమే. 'మీది కాదండీ' అని చెప్పడానికి ధైర్యం చాలింది కాదు.

"ఇలా ఇవ్వవోయ్" అంటూ పోస్టుమాన్ చేతిలోని వుత్తరాన్ని అందుకు న్నాడు నరహరి.

పోస్టుమాన్ మరి అక్కడ నిలబడ లేదు. చరచరా వెళ్ళిపోయాడు.

నరహరి కవరు మీద అడ్రసు చూశాడు. కొత్త రాతలా వుందతనికి. ఎవరు రాసుంటారు చెప్మా అని క్షణం ఆలోచించి, తనెందుకు చింపడం అను కున్నాడు.

"అమ్మాయ్ కాంతం" కేకవేశాడు.

"ఏం నాన్నా" వచ్చింది కాంతం లోపల్నించి. చప్పున తండ్రి చేతిలోని కవరు చూసి కంగారుపడింది. ఆమె గుండెలు జోరుగా కొట్టుకున్నాయి.

"చూడమ్మా! ఈ వుత్తరం నీపేర నొచ్చింది. అడ్రసు చూస్తే కొత్తవాళ్లెవరో రాసినట్టుంది. నేను చూ సే దా?" సౌమ్యంగానే అన్నాడు నరహరి.

కాంతం కళ్లు భయంతో వణికాయి. "ఎందుకులెండి నాన్నా! నేను చూసు కుంటాగా" అంది తడబడుతూ.

కూతురు తడబాటు గమనించి ఏదో విశేషం తప్పకుండా వుండివుంటుందను కున్నాడు నరహరి. కవరు చించి వుత్తరాన్ని తీశాడు. కాంతం ఆపాద మస్తకం వణికిపోయింది. ఏది జరక్కూడ దనుకుందో, అదే జరిగేసరికి ఆమె ఆందోళన చెందింది.

నరహరి వుత్తరం చదివాడు. చదువు తున్నంతసేపూ అతని మొహంకేసే చూస్తోంది కాంతం. అతని మొహం కెంపు రంగు సంతరించుకుంటూండటం గ్రహిం చింది. అతని కనుబొమలు కోపంతో ముడివడ్డాయి. అక్కణ్నించి మెల్లగా జారుకుందామనుకుని కదిలింది.

"ఆగు" గంభీరంగా అన్నాడు నరహరి.

త్రుళ్ళిపడినట్టయ్యింది కాం త ం.

"కవిత్వం రాశాడేంటి? ఎవడు వీడు? కింద సంతకం కూడా లేదే" గర్జించినట్టే అన్నాడు నరహరి.

"ఓ స్నేహితుడు నాన్నా" తడ బడుతూ అంది.

"అదే ఎవడా అని? సంతకం పెడితే పేరు తెలిసిపోతుందని భయమా? ఎన్నాళ్ళనించి ఇలా వుత్తర ప్రత్యుత్త రాలు సాగుతున్నాయి?"

కాంతం చప్పున జవాబు చెప్పలేక పోయింది. ఏం చెబితే బావుంటుందా అని ఆలోచించింది.

"వూ... చెప్పు ఎన్నాళ్ళనించి సాగు తున్నాయీ వుత్తరాలు?"

"వారంరోజులనించి" (?)

"వా లేదు వెళ్ళొచ్చింపగన్నించి"

"తెలుస్తూనే వుంది. ఇంతకీ వీడెవడు?"

"మెడికల్ స్టూడెంటు"

"మెడికల్ స్టూడెంటా?" నరహరి సాలోచనగా అన్నాడు. మెడికల్ స్టూడెంటుని ఆకర్షించింపంటే నిజంగా

కాంతం అదృష్టవంతురాలే... అని మనసులో అనుకోకుండా వుండలేక పోయాడు. ఎందుకూ అంటే తన అల్లుడు ఏ డాక్టరో, ఇంజనీరో అయ్యుంటే బావుండునని ఎన్నాళ్ళనించో అతను కలలు గంటున్నాడాయె! అటువంట ప్పుడు అనుకోకుండా ఇటువంటి అవకాశం వచ్చిందంటే కేవలం అదృష్టమే.

"వాడికీ, నీకూ ఎలా పరిచయ మయ్యింది కాంతం?" అతని స్వరంలోని ఘాటు కాస్తంత తగ్గుముఖం పట్టింది.

కాంతం నెమ్మదిగా వూపిరిపీల్చుకుంది. ఏదో కట్టు కథ చెప్పాల్సిందే ప్రస్తుతానికి. ప్రేమవ్యవహారాల్లో ఎన్ని అబద్ధాలు చెప్పాల్సివస్తుందో ఇప్పుడు స్వానుభవంతో తెలుసుకుంటోందామె. తర్వాత నిజం తెలిస్తే, పర్యవసానం ఎట్లా వుంటుందోనన్నది వేరేవిషయం. ప్రస్తుతానికి బైటపడ్డమే కావల్సింది... అనుకుంది గుండెనిబ్బరాన్ని పెంచుకుని.

"అది గమ్మత్తుగా జరిగింది నాన్నా! ఓరోజు నేను బీచ్‌కివెళ్ళి తిరిగివస్తూ వుంటే ఎవరో ఇద్దరు కుర్రాళ్ళు నా వెంట బడి టీజ్‌చెయ్యడం ప్రారంభించారు. నాకెందుకో భయంవేసింది. వాళ్ళు మరీ విజృంభించి మీదికి వస్తున్నసమయంలో నిస్సహాయంగా దిక్కులుచూస్తున్న నన్ను దేవుడిలా ఈయన ఆదుకున్నాడు. అప్పట్నుంచీ మా పరిచయం. అప్పుడప్పుడూ కలుసుకుంటూ వుండేవాళ్ళం బీచ్‌లో. నేను ఇక్కడికి వచ్చేస్తూవుంటే, నా అడ్రసు తీసుకుని వుత్తరాలు రాస్తానన్నాడు...నేనూ కాదనలేకపోయాను..." తండ్రి మళ్ళీ ఎలా రియాక్టవుతాడోనని అతని మొహంకేసే చూస్తూ అంది కాంతం.

"వూఁ...ఇంతకీ వాడి కులమేమిటి?" సూటిగా ప్రశ్నించాడు.

కాంతం చిన్న షాక్ తింది. దాసు కులమేమిటో తెలిసినా, ఎలా చెప్పగలదా నిజాన్ని? చప్పున తేరుకుండా షాక్‌నించి.

"అది తెలీదు నాన్నా!" ముక్తసరిగా సమాధానమిచ్చింది.

నరహరి క్షణం యోచించి మళ్ళీ అన్నాడు.

"చూడమ్మా కాంతం! ఆడదాని జీవితం అరటాకులాంటిదంటారు. మనసిచ్చే ముందు మంచిచెడ్డలు తెలుసుకుని మన సివ్వు. వాడి మాయమాటలకి మోసపోకు. నువ్వా చదువుకున్నదానివి. అంతో ఇంతో ప్రపంచజ్ఞానాన్ని సంపాదించావు. మోసపోయిన స్త్రీలను ఎంతోమందిని చూస్తున్నాం. అన్నీ దృష్టిలో పెట్టుకుని మరీ ప్రవర్తించు. ఎప్పుడైనా ఓసారి రమ్మను..."సలహా యిస్తూనే చెప్పాడు.

నిజానికి నరహరికి ఇటువంటి ప్రేమ వ్యవహారాలంటే అసలుగిట్టదు. కాని, తన కూతురు ప్రేమించింది ఓ కాబోయే డాక్టర్ని. తన వూహలకి అనుగుణంగా వుండే అవకాశమది. అందుకే ఆమెపై విరుచుకుపడలేదు.

"అలాగే నాన్నా?"అంటూ పెద్దరిలీఫ్ వచ్చినట్టుగా లోపలికి వెళ్ళిపోబోయింది.

"వుత్తరం తీసుకెళ్ళమ్మా" అన్నాడు నరహరి.

కాంతం చప్పున వెనక్కితిరిగి వుత్తరాన్ని అందుకుని, తన గదిలోకి వెళ్ళిపోయింది. తండ్రి తనని చీవాట్లు వేస్తాడని ఎంతగానో భయపడింది. తుఫాను రేగుతుందని తలపోసింది. అటువంటి బీభత్సం ఏమీ జరగకుండా శాంతియుతంగా సమస్య పరిష్కారం కావడం




ఆమెకి ఆనందం కలిగించింది.

కాంతం తన మంచంమీద ఒరిగి వుత్తరాన్ని చదువుతుంది.

చిన్న వుత్తరమే అయినా కవిత్వంలా వుంది. మళ్ళీమళ్ళీ చదువుతుందావుత్తరాన్ని సంతకం పెట్టాల్సినచోట చిన్న గీతి పెట్టాడు... ఏం ఐడియా?...ఆ వుత్తరాన్ని హృదయానికి హత్తుకుంది. చప్పునలేచి సమాధానం రాయడానికి కూచుంది కాంతం.

* * *

ఓ.యస్సీ. రిజల్ట్స్ ఎప్పుడొస్తాయా అని ఎదురుచూస్తున్నాడు. హరిబాబు. ఫస్టుక్లాసులో పాసవుతానన్న ధైర్యం, విశ్వాసం అతనిలో వున్నా ఆ ఆరాటం అట్లాంటిదిమరి. అందుకనే న్యూస్‌పేపరు కోసం రోజూ ఎదురుచూస్తుండటం అతనికి పరిపాటయ్యింది.

ఆ రోజు న్యూస్‌పేపరు రావడం ఎందుకో ఆలస్యమయ్యింది. అప్పటికి పదిగంటలయినా పేపరు రాకపోవడం చూసి, శివయ్య వీధిలోకి వెళ్ళుదేరాడు. ఏదోపనిమీద. హరిబాబు ఓ నవల చదువు కుంటూ తన స్టడీరూమ్‌లో కూచు న్నాడు-పేపరు వచ్చింది వస్తుందా అని చెవులు రిక్కించుకుని వుంటూ.

కాంతం వచ్చింది ఇంట్లోకి. అరుణ ఎంబ్రాయిడరీ కుడుతోంది. - పుంటుగారి బులకి. కాంతంని చూసి, ఆ కుట్టు ఆపేసి-

"రా అక్కా! ఏమిటింత పెందరాళే వచ్చేశావు?" అంటూ ఆప్యాయత వుట్టి పడేలా ఆహ్వానించింది.

"ఏంలేదే! ఇంట్లో కూచోవడం బోరు కొడుతోందనుకో! అందుకే ఇలా వచ్చే శాను. బావ వున్నావా?"

"వున్నాడు. ఎక్కడికీ కదల్డుగా... పుస్తకాలపురుగులా ఎప్పుడూ ఏదో చదువు కుంటూ కూచుంటాడు"

"అది మంచిదేలేవే! విజ్ఞానం పెరుగు తుంది. అలావెళ్ళి బావతో మాట్లాడి వస్తా నుండు..." అంది కాంతం.

"ఓ! అలాచెప్పు... బావతో పనుండి వచ్చావన్నమాట! సరేవెళ్ళు...ఔనూ- కాఫీ తీసుకుంటావా, హార్లిక్సా? తర్వాత చెప్పిపోతవకుండా ఇప్పుడే చెప్పెయ్ అక్కా..." చిన్నగా నవ్వుతూ అంది అరుణ.

"హార్లిక్స్ కలిపి తీసుకురా!" అంటూ హరిబాబు వున్న గదిలోకి నడిచింది కాంతం చిలిపిగా నవ్వుకుంటూ.

కాంతంని చూసూనే విస్తుపోయాడు హరి. ఎందుకూఅంటే సాధారణంగా అంత పెందరాళే ఆమె ఎప్పుడూ రాదు.

"ఇదేవిటి కాంతం..యిప్పుడిలా దిగ బడ్డావ్?" అన్నాడు.

"వింతగా వుందా?"

"ఆశ్చర్యంగా వుందిలే! కూచో"

కాంతం కూచుంది - హరిబాబుకి అభిముఖంగా, కాస్తంత దగ్గరగానే.

"చెప్పు" అన్నాడు హరిబాబు మళ్ళీ.

"ఏం దేనిగురించి భయపడ్డామో అదే జరిగింది బావా" అంది

"అంటే ...?"

"అబ్బ! నీతో ఇదే చిక్కు.. చప్పున గ్రహించవు. అదే బావా! నీ ఫ్రెండు దాసు రాసిన వుత్తరం మా నాన్న చేతిలో పడింది నిన్న"

హరిబాబు కూడా కాస్తంత కంగారు పడ్డట్టు అతని మొహంలో రంగు మారింది.

"అ...గా? అయితే, ఓ పెద్ద తుఫానే చెలరేగి వుండాలే...?"

"చెలరేగి వుండేదే! కాని, నేను శుద్ధ అబద్ధం చెప్పి చక్రం అడ్డువేశాను తాత్కాలికంగా''

"ఏం చెప్పావయితే?"

"అతడు ఫలానా అని చెప్పకుండా, కేవలం ఓ మెడికల్ స్టూడెంటని మాత్రం చెప్పాను. దాంతో మా నాన్న కోపం సగం సన్నగిల్లింది"

"కాదామరి. నువ్వు గట్టి చేపకే గాలం వేశావన్న నమ్మకం కలిగింది. అందుకే, గర్జించలేదు. అంతటితో వూరుకున్నాడా"

"అబ్బే....కులం ఏమిటన్నారు. తెలీదన్నాను. మా యిద్దరికీ పరిచయం ఎలా జరిగిందని మరో ప్రశ్న వేశారు" అంటూ జరిగిందంతా చెప్పింది కాంతం.

హరిబాబు క్షణం ఆలోచనలో పడ్డాడు. ఇది చాలా సున్నితమైన సమస్య. ఇటువంటి సమస్యే తన జీవితంలోనూ తారసపడొచ్చు. నసీమ్ తన ప్రేమాను రాగాల్ని స్వీకరించి తనని వివాహం చేసుకుందుకు అంగీకరిస్తే....అప్పుడు తన తండ్రి రియాక్షను ఎట్లా వుంటుందో ఎవరికితెలుసు...అనుకున్నాడు మనసులో. అలాగని ఆ విషయాన్ని కాంతంతో చెప్పడం అతనికి ఇష్టంలేకపోయింది.

హరిబాబు అంతగా ఆలోచిస్తూండటం కాంతంకి కాస్తంత కంగారు కలిగించింది.

"ఏమిటి బావా, అంత తీక్షణంగా ఆలోచిస్తున్నావు?'' అతని మొహంలోకి సూటిగా చూస్తూ అంది.

"అబ్బే .... ఏం లేదు కాంతం! ప్రస్తుతానికి పరిస్థితి ప్రశాంతంగా వుందిగా....నిజమైన సమస్య ఎదురైనపుడు ఆలోచిద్దాంలే! మీ నాన్నలో కాస్తంత మానసికమైన మార్పు తీసుకు రావడానికి, పరిస్థితిని తట్టుకొనగలిగే వాతావరణం ఏర్పర్చడానికి ప్రయత్నిస్తానుండు. నువ్వేం కంగారుపడకు" అన్నాడు హరిబాబు.

"సరే! నీ ఆసరాయే నాకు శ్రీరామ రక్ష" అనేసింది నిబ్బరంగా కాంతం.

* * *

ఆరోజు శివయ్య వూళ్లో లేకపోవడం వల్ల, అరుణతో తన మనసులోని మాట చెప్పడానికి అంతకంటె మరో అదను దొరకదనుకున్న హరిబాబు అరుణని కేకవేశాడు.

"ఏం బావా?" వచ్చింది అరుణ.

"కూచో"

అరుణ కూచుంది ఓకుర్చీ లాక్కొని. ఆమెకి తెలుసు బావ తనని ఎందుకు పిల్చాడో.

"చెప్పు..." అంది.

చప్పున చెప్పడానికి తటపటాయించాడు హరిబాబు.

"నాదగ్గర సందేహిస్తావేమిటి బావా? నువ్వు ఏం అడగదల్చుకున్నావో నేను గ్రహించలేదనుకుంటున్నావా? నసీమ్ గురించేనా?" తనే ముందుగా కలిగించుకుని అంది.

"ఔను అరుణా! నువ్వు చెప్పింది నిజమేనా?"

"లేకపోతే నిన్ను ఆటపట్టించడానికి అబద్ధం చెప్పాననుకున్నావా బావా? నాకెప్పుడో తెలుసు బావా నువ్వు నసీమ్‌ని ప్రేమిస్తున్నావని. అయితే, నీ మనోభావాన్ని వ్యక్తం చెయ్యడానికి పిరికితనం అడ్డు వస్తున్నదనీ తెలుసు..."

"అయితే, నువ్వు గ్రహించావన్నమాట. మరీ విషయం నసీమ్ అర్థంచేసుకుందంటావా?"

అరుణ ఓ నిశ్వాసం విడిచింది.





"అర్థం చేసుకుంది బావా! అయితే, అబలై వుండి ఆమె చెప్పకోలేదు. నిజానికి ఆమె కూడా నీకు మనసిచ్చింది. మనింటికి వచ్చినప్పుడంతా నీ ఫొటో తేసి ఆప్యాయంగా చూస్తుండేది. ఒకటి రెండు సార్లు నేను ఎగతాళి చేశాను కూడాను. అయినా, ఆ అలవాటుని తప్పించుకోలేదు. నీ గురించి సంభాషణ వస్తే చాలు సిగ్గుతో ముడుచుకుపోయేది"

నసీమ్ కూడా తనని ప్రేమిస్తున్న దన్న విషయాన్ని సూచాయగా తెలుసుకుని మరింత బాధపడ్డాడు హరి. అరుణ నుండి ఈ విషయాన్ని తెలుసుకోకముందే ఎన్నోసార్లు నసీమ్ అనురాగపూరితమైన దృక్కులద్వారా గ్రహించాడు కూడా. ఇప్పుడావిషయం మరింత ధృవపడింది.

"అరుణా! నాకో చిన్నసహాయం చేయగలవా?" ఆమెకేసి నిస్సహాయంగా చూస్తూ అన్నాడు హరిబాబు.

"ఏవిటో చెప్పు బావా! నా బతుకులో అప్రశతి పలికింది. కనీసం నువ్వయినా సుఖంగా కాలం గడుపుతావంటే ఇప్పుడీ సమస్య ఎదురయ్యింది. సరే ఇప్పుడేం అనుకున్నా ప్రయోజనమేముందిలే. చెప్పు ఏంచెయ్యమంటావో" అంది అరుణ.

"మరేం కాదు. నీ స్నేహితురాలు నసీమ్‌తో ఓ విషయం చెప్పగలవా?"

"ఏవిటది?"

"ఆ వివాహం తనకి ఇష్టం లేదని చెప్పేయమను వాళ్ళ నాన్నతో"

షాక్ తిన్నట్టుగా బావవేపు చూసింది అరుణ.

"ఏవిటి నువ్వంటున్నది బావా?" అంది ఆశ్చర్యంగా.

"ఇంతకు మించి మరో మార్గం అగుపించడం లేదు అరుణా"

అరుణ భారంగా ఓ నిట్టూర్పు విడిచింది.

"బావా! స్వార్థపరుడివై నువ్వలా అంటున్నావేగాని ఒకవేళ ఆమె అలా చెప్పేసిందే అనుకో... తర్వాత ఆమె బతుక్కి భవిష్యత్తేవిటి?"

"అదంతా ఆలోచించే అంటున్నాను అరుణా! నసీమ్‌ని నేను వివాహం చేసుకుంటాను"

అరుణ చిన్నగా నవ్వింది. "నిన్ను ఆవహించిన 'ప్రేమ' నీచేత అలా అనిపిస్తోందిగాని ఇందులోగల సాధక బాధకాలు, సమస్యలూ యోచించావా? మావయ్య ఒప్పుకుంటారా? అంతేకాదు అటు నసీమ్ నాన్నగారు ఒప్పుకుంటారా? కులాంతర వివాహాలకే కినుక వహిస్తోన్నవారు మతాంతర వివాహాల్ని హర్షిస్తారంటావా?"

"అవన్నీ తర్వాత ఎదుర్కోవల్సిన సమస్యలు. ముందు ఈ అవాంతరమేదో గడవనీ అరుణా! నా మనసులోని మాటా ఆమెకి తెలియాలిగదా? ఎలాగయినా ఈ చిన్న సహాయం నాకు చేసిపెట్టవూ" ప్రాధేయపూర్వకంగా అన్నాడు హరిబాబు.

కాదనలేకపోయింది అరుణ. అసలు ఆ స్థితిలో బావని చూస్తుంటేనే ఆమెకి జాలి వేసింది. అతనికోసం తాను ఏదో ఒకటి చెయ్యాలి..తప్పదు.

"అలాగే బావా... చెప్పి చూస్తాను" అంటూ అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

హరిబాబు అశాంతితో అల్లకల్లోలమైన హృదయంతో మంచం మీద ఒరిగిపోయాడు.

* * *

ఉదయం తొమ్మిది గంటలు దాటింది. శివయ్య బైట వరండాలో యథాస్థానంలో కూచుని చుట్ట కాలుస్తున్నాడు. వార్తా పత్రిక ఎప్పుడు వస్తుందా అన్న ఆసక్తి అతని మనసులో పరకలు వేస్తోంది.

అప్పుడే సైకిలు బెల్లు వినిపించింది. ఆ బెల్లు వినిపిస్తే చాలు నరసింహులు వస్తున్నాడని ఎవరైనా ఆ వూరివాళ్లు చెప్పేస్తారు.

"నమస్కారాలండీ" సైకిలు స్టాండు వేస్తూనే అన్నాడు నరసింహులు.

"నమస్కారం. నీ కోసమే ఎదురు చూస్తున్నా"

"నాకు తెలుసును బాబుగారూ! అందుకేగా ఇక్కడికే మొట్టమొదట పేపరిచ్చి పోతుంటాను. ఇవ్వాళ ఎ.యస్సి. రిజల్ట్సు వచ్చాయండీ! తోవలో కొంపరడి గాను. కాని ఎలా ఇవ్వటం? ఎక్కువ పేపర్లు తెప్పించంగా" అంటూ వార్తా పత్రిక ఇచ్చి వెళ్ళిపోయాడు.

"అబ్బాయ్... ఒరేయ్" కేకవేశాడు శివయ్య.

తలదువ్వకుంటూనే వచ్చాడు హరిబాబు.

"ఏం నాన్నా?"

"ఎ.యస్సి. రిజల్ట్సు వచ్చాయట. ఇదిగో పేపరు" అంటూ అందించాడు పేపర్ని.

హరిబాబు దువ్వెన్ని జేబులో పెట్టేసు కుని ఆత్రంగా రిజల్ట్సు తిరిగేశాడు. అతని హృదయస్పందన అమాంతం ఎంతో అధికమయ్యింది. నంబరు కని పించింది. ఫస్టుక్లాసులో పాసయ్యాడు. అతని సంతోషానికి అవధుల్లేకపోయాయి.

"నాన్నా! నేను ఫస్టుక్లాసులో పాస య్యాను" అంటూ తండ్రి పాదాలకి నమస్కారం చేశాడు.

కొడుకుని మనసులోనే ఆశీర్వదిస్తూ-

"చాలా సంతోషంరా బాబూ! నిన్ను చూసుకుని నేనెంతో గర్విస్తున్నాను" అన్నాడు.

హరిబాబు పేపర్ని తండ్రి చేతిలో పెట్టి లోపలికి వెళ్ళాడు తల్లికి, అత్త య్యకి, అరుణకి చెప్పడానికి. ఆ ఇంట్లో ఆరోజు పండగేమరి!

హరిబాబు అరుణని కాస్త చాటుగా పిల్చాడు.

"ఏమిటి బావా?"

"ఈ శుభవార్త నసీమ్‌కి చెప్ప రాదమా?" అన్నాడు.

"అలాగే చెప్తాలే! వట్టి చేతుల్తో వెళ్లి చెప్పడం బావుంటదుకదా! ఏదైనా స్వీట్ తీసుకురా!" నవ్వుతూ అంది.

"ఈ వూళ్లో ఏం స్వీట్ ఉంటుందని" నిరుత్సాహంగా అన్నాడు హరి.

"నిజమే అనుకో. పోనీలే నేనే ఇంట్లో కాస్త హల్వా తయారుచేసి తీసుకెళ్తా మా బావకోసం ఆమాత్రం చెయ్యకపోతే ఎలా?" చిలిపిగా నవ్వింది అరుణ.

"థాంక్స్ అరుణా! పనిలో పని నేను చెప్పిందీ చెప్తావుకదూ" గుర్తుచేశాడు హరిబాబు.

"తప్పకుండామరి. వీలు చూసుకుని చెప్తాలే బావా" అంది అరుణ.

హరిబాబు అక్కడ్నుంచి కొంతం ఇంటికి బయల్దేరాడు. ఇంట్లోనించి బైట కొచ్చి-

"అలా మావయ్యగారింటికి వెళ్ళొస్తా నాన్నా" అంటూ వెళ్ళిపోయాడు.

కొడుకునుచూసి మురిసిపోయాడు శివయ్య. వార్తాపత్రిక అందుకుని ఓ నాలుగు వాక్యాలు చదివాడోలేదో రామి

... పేటర

నాయుడు పెద్దకొడుకుని తీసుకుని వచ్చాడు.

"నమస్కారం సార్" సవినయంగా ముకుళిత హస్తాలతో అన్నాడు రామినాయుడు సుపుత్రుడు రామరాజు.

"నమస్కారం..కూచోండోయ్"

ఇరువురూ కూచున్నారు చాపమీదే.

"నేను చూసి చాలా రోజులయ్యింది కదూ బాగా మార్పు వచ్చింది మీ అబ్బాయిలో. పేరేమిటో మర్చిపోయాను"

"రామరాజు"

"ఆఁ ... ఆఁ .... ఔను. ఇప్పుడు గుర్తుకొచ్చింది. ఎప్పుడొచ్చావోయ్ రాజూ"

"నిన్న నేనండీ!"

"వుంటావా ఓ వారంరోజులు?"

"వారం రోజులే సెలవిచ్చారండీ"

"నీ ఉద్యోగం ఎలా వుంది?"

"ఏదో మీ దయవల్ల ఈ ఉద్యోగం దొరకడం నా అదృష్టం సార్! మిమ్మల్ని ఈ జన్మలో మర్చిపోలేను"

"దానికేముందిలే అబ్బాయ్! ఏదో నాకు తోచిన సహాయం నేను చేశాను. నీ అదృష్టమూ కలిసొచ్చింది" అన్నాడు శివయ్య. "అమ్మాయ్ అరుణా'' అంటూ కేక వేశాడు.

"ఏం మావయ్యా" వస్తూనే అంది అరుణ. రామినాయుణ్ణి, అతని పక్కనే వున్న వ్యక్తిని చూసి కాస్తంత బిడియ పడింది. రామినాయుడి కొడుకే అయ్యుంటాడనుకుంది. రెండు మూడేళ్ళ క్రితం చూసిందతణ్ణి. అప్పుడు బక్కపలుచగా నిరుత్సాహంగా వుండేవాడు. ఇప్పుడు చూస్తే ఎలా మారిపోయాడు? రంగులో

కూడా మెరుగొచ్చింది అనుకుంది లోలోన.

"మజ్జిగ తీసుకురా అమ్మా" అన్నాడు శివయ్య.

"ఇప్పుడెందుకండీ అవన్నీ"

"ఫరవాలేదులేవోయ్. మీ ఇంటికి మేం వచ్చేయం" నవ్వుతూ అనేసి "వెళ్ళమ్మా నువ్వు" అన్నాడు.

"అంత అదృష్టమటండీ మాకు! చాలా రోజులయ్యింది మీరు మా ఇంటికి రావడమే మానేశారు. బీదవాళ్ళం...మీకు తగు విధంగా గౌరవించలేమేమోనన్న సందేహం గామోసు" అన్నాడు రామినాయుడు.

"నాయుడూ! నువ్వెప్పుడూ అలా అనుకోవద్దు. నా మనస్తత్వం నీకు తెలీంది కాదు. నాకు గొప్ప, పేద అన్న తారతమ్యం తెలీదు. నా దృష్టిలో అందరూ ఒకటే! అటువంటి సంకుచిత భావాల్ని ఎప్పుడో దూరంచేసుకున్నాను. అయితే దేనికయినా అవసరం, అవకాశం ఉండాలి కదా! వీలు చూసుకుని వస్తాలే"

"అది మా అదృష్టంగా భావిస్తామండీ" అన్నాడు రామరాజు. ఎంతైనా చదువుకున్నవాడుకదా లౌక్యంగా అన్నాడుమరి.

అరుణ మూడు గ్లాసుల్తో మజ్జిగ తీసుకొచ్చి ముగ్గురికీ అందించింది. రామరాజు ఆమె మజ్జిగ అందిస్తున్నపుడు చేతినే చూశాడుగాని ఆమెకేసి చూడ్డానికి ధైర్యం లేకపోయింది. మొహం దించుకునే అందుకున్నాడు గ్లాసుని.

శివయ్య అరుణకేసి ఓసారి చూశాడు. ఆమె అంతవరకూ రామరాజువేపు దృక్కుల్ని ప్రసరిస్తూ చప్పున మొహం దించేసుకుంది. శివయ్య అంతరంగంలో ఏవేవో వూహించుకున్నాడు. తానేగనక అరుణని తన కోడలుగా చేసుకోమని రామినాయుణ్ని కోరితే, నాయుడు కాదనగలడా? అంతేకాదు ఆ అబ్బాయిమాత్రం కాదంటాడా ? లోలోన ప్రశ్నించుకున్నాడు. తనకి అనుకూలంగా సమాధానాన్ని తనే చెప్పుకున్నాడు.

"మరి వెళ్తొస్తానండీ" అన్నాడు రామినాయుడు.

"రేపు ఉదయం యింట్లో నే వుంటావా?"

"రమ్మంటారా?"

"కాదు. నేనే వద్దామనుకుంటున్నానోయ్"

"తప్పకుండా రండి ఇంట్లోనే ఉంటాను. అంతకంటె నాక్కావల్సిందేవిటి? ఎన్నింటికొస్తారు?"

"తొమ్మిది తర్వాత"

"అలాగేరండి. నేనెక్కడికీ వెళ్ళను. అబ్బాయి కూడా వుంటాడు" వుత్సాహంతో పొంగిపోతూ అన్నాడు రామినాయుడు.

"సరే! అలాగే వస్తా"

"వెళ్లొస్తానండీ" లేచాడు రామినాయుడు.

"వస్తాను సార్ ..." అన్నాడు రామరాజు.

"మంచిది ... వెళ్ళిరండోయ్ ..." తృప్తిగా అన్నాడు.

వాళ్ళిద్దరూ నిష్క్రమించారు.

అరుణ ఖాళీ గ్లాసుల్ని తీసుకుని లోపలికి వెళ్ళబోయింది.

"అరుణా!"

"ఏం మావయ్యా!"

"అదృష్టాన్ని నువ్వు నమ్ముతావా?"

"నమ్ముతాను మావయ్యా"

"రామినాయుడు కొడుకు చాలా

అదృష్టవంతుడు. మంచి ఉద్యోగంలో చేరాడు"

"మనిషి కూడా మారాడు మావయ్యా! కొన్నాళ్ళ క్రితం ఎలా ఉండేవాడని? చూడ్డానికి అసహ్యమేసేది. ఇప్పుడు ఒళ్ళు చేసి బాగున్నాడు" అలా అందే గాని, వెంటనే నాలుక కర్చుకుంది పొరపాటయ్యిందేమోననుకుని.

"ఒక్క మాటడుగుతాను చెప్తావా?"

"అడుగు మావయ్యా"

"మరో విధంగా అనుకోకు. నా మనసులో ఓ భావం మెరుపులా మెరిసింది. దానికో రూపమివ్వాలనుకుంటున్నాను. ఈ అభ్యాయంటే నీకిష్టమేనా?" ఆమెకేసి సూటిగా చూసి అడిగాడు శివయ్య.

అరుణ మొహంలో సిగ్గుమొగ్గలు తొడిగింది. అరుణకాంతులు వెదజల్లాయి. మొహం దించుకుని ముసిముసిగానవ్వుతూ—

"మీ ఇష్టం మావయ్యా!" అంటూ అక్కణ్ణించి లోపలికి తుర్రుమంది.

ఆమె చేష్టల్లోనూ, మాటల్లోనూ అంగీకారం సుస్పష్టంగా ద్యోతకమయ్యింది శివయ్యకి. అతని హృదయం ఆనందంతో గంతులేసింది. తనకా ఆలోచన వచ్చినందుకు తనని తానే అభినందించుకున్నాడు. తృప్తిగా ఓ నిశ్వాసం విడిచి నవ్వుకున్నాడు.

వారాపత్రిక మళ్ళీ అందుకుని అందులో లీనమైపోయాడు.

* * *

"రావోయ్ హరీ!" అంటూ చిరునవ్వుతో ఆహ్వానించాడు నరహరి.

"కాంతం వుందా మావయ్యా" లోపలికి వస్తూనే అన్నాడు హరిబాబు.

"ఆc. ఉందోయ్. కాంతం....హరి వచ్చాడు" లోపలికి కేక వేశాడు నరహరి.

కాంతం చప్పున వచ్చేసింది.

"ఏం బావా! ఇప్పుడే రావటమా?"

"ఇంకా కూచోనే లేదు. చూస్తున్నావుగా"

కాంతం తెల్లగా నవ్వింది.

"మా రిజల్ట్సు వచ్చాయి కాంతం. నేను ఫస్టుక్లాసులో పాసయ్యాను"

"కంగ్రాచ్యులేషన్స్ బావా! మరి స్వీట్స్ ఏవీ?"

"అదేవిటమ్మాయ్? నిజానికి అతడు ఫస్టుక్లాసులో పాసయినందుకు మనం స్వీట్స్ తినిపించాలి. స్వీట్సంటే ఇక్కడ దొరకవు. కనీసం, హార్లిక్సయినా కలిపివ్వు" అన్నాడు నరహరి.

"కూచో బావా! ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది కాంతం.

"చాలా సంతోషకరమైన వార్తోయ్ హరీ! నిజానికి నీకు మెడిసిన్‌లో సీటు దొరికివుండాల్సింది" అన్నాడు నరహరి.

"పోనీలే మావయ్యా, ఏంజేస్తాం? గతాన్ని గురించి బాధపడ్డం తెలివితక్కువతనం. బి.యస్సీ. ఫస్టుక్లాసులో పాసయ్యాను. అదే నాకు తృప్తి."

"నువ్వు చెప్పిందే కరక్టులేవోయ్... అందుబాటులో ఉన్నదాంతోనే తృప్తి చెందాలి. అప్పుడే మనిషికీ, మనసుకీ శాంతి లభిస్తుంది. ఇంతకీ, ఇప్పుడు నువ్వేం చెయ్యదల్చుకున్నావు? ఇంకా చదువుతావా?"

"మరి చదవాలని లేదు మావయ్యా!

"అంటే....? ఉద్యోగం కోసం ప్రయత్నిస్తావా?"

"అబ్బే ఆ తలంపే నాకు లేదు. ఉద్యోగంలో చేరి స్వేచ్ఛను తాకట్టు పెట్టడం నాకిష్టం లేదు"



"మరేం చెయ్యాలని?"

"నాన్నకి చేదోడువాదోడుగా ఈ ఊళ్ళోనే ఉండిపోతాను"

ఆశ్చర్యపోయాడు నరహరి.

"ఇంత చదువూ చదివి ఇక్కడుండ డానికా? ఎవరైనా నవ్విపోతారోయ్"

"ఎందుకు నవ్వుతారు మావయ్యా? నేనేం తప్పుడు పన్లు చెయ్యడం లేదుగా! అధునాతన పద్ధతుల్లో వ్యవసాయాన్ని అభివృద్ధి చేస్తాను. వయోజన విద్యా బోధనకి పాటుపడతాను. వెనకబడిన తరగతులవారి శ్రేయస్సుకు పథకాల్ని వెదుకుతాను. అంటరానితనాన్ని అడు గంటింపజేస్తాను. జాతి, మత విచక్షణలు లేని సమాజాన్ని నిర్మించడానికి కనీసం మన ఊళ్ళో ప్రయత్నిస్తాను" అంటూ ఆవేశంతో చెప్పుకుపోయాడు హరి.

నరహరికి నవ్వాగింది కాదు. నవ్వే శాడు. "నీ ఉపన్యాసం వింటూంటే నువ్వు నిశ్చయంగా రాజకీయనాయకుని వయ్యుంటే బాగున్నట్టుంది. కాకపోతే నువ్వు చెప్పినవన్నీ సాధ్యపడినవే నటోయ్?"

"ప్రయత్నిస్తే అసాధ్యమైనదేమీ ఉండదు మావయ్యా! ఇప్పుడు మన దేశానికి పట్టిన అరిష్టాల్లో ఒకటి ఏవి టంటావు?"

"ఎన్నో ఉన్నాయి. ప్రత్యేకించి ఏవిటని చెప్పను"

కాంతం అప్పుడే హార్లిక్సు తీసు కొచ్చింది రెండు కప్పులతో. హరికి, నరహరికి అందించింది చెరొటి.

"ఫర్ ఎగ్జాంపుల్.... అంటరానితనమే వుంచుకుందాం. ప్రపంచంలో ఎక్కడా లేనిది మనదేశంలోనే ఎందుకుండాలి? హరిజనుల్లోనూ తెలివైనవాళ్ళుండొచ్చు. బాగా చదువుకొని ఒక అంతస్తుకిరావచ్చు. అటువంటివారిని మనం గౌరవించడం లేదా? వారిని మన పరిధిలోకి తీసుకురావ డంలో తప్పేమైనా వుంటుందా? ఉండదనే నా అభిప్రాయం. ఇటువంటి మార్పు రావలిసింది మనలో. ఆ మార్పు వచ్చిన నాడు మన సమాజం ఎంతో పురోగ మించినట్టే. ఇటువంటి మార్పుకి దోహదం చేసినవారిని...ప్రభుత్వం గౌరవిస్తుంది కూడా." ఇలా చెప్పుకుపోయాడు హరి బాబు.

వసపిట్టలా ఏదో చెప్పుకుపోతున్నా డనే అనుకున్నాడుగాని, తనలో కాస్తంత చైతన్యం తీసుకురావడానికే హరిబాబు అంతగా లెక్చరిస్తున్నాడని ఊహించుకో లేకపోయాడు నరహరి.

కాంతం గ్రహించుకుంది – దాసుకి, తనకి వివాహం జరుగబోతుందన్న విషయం తెలిసిననాడు తట్టుకోగల చైతన్యాన్ని తండ్రిలో కలిగించడానికే ఇంత ఉపన్యాసం హరిబావ ఇస్తున్నట్టు.

"హార్లిక్సు చల్లబడింపనుకుంటాను తీసుకో" అన్నాడు నరహరి.

"చల్లబడినా దాని శక్తి దానికుంటుంది మావయ్యా" అనేసి గటగట తాగేశాడు హరిబాబు.

కాంతం నవ్వుకుంటూ ఆ ఖాళీకప్పుల్ని తీసుకుని వెళ్ళిపోయింది.

"జాతి, మత విచక్షణలేని సమాజం నిర్మించాలని ఇన్ని ఉపన్యాసాలిస్తున్నావు. మరి, నువ్వేవిధంగా దీనికి దోహదం చేస్తున్నావోయ్ హరి" చిన్నగా మంద హాసంచేస్తూ అన్నాడు నరహరి.

హరిబాబు మందస్మిత వదనంతో మావయ్యకేసి సూటిగా చూశాడు.




"'చెప్పడంవరకే మావంతు. ఆచరణలో పెట్టాల్సింది మీరు' అని మన నాయకులు గొంతు చించుకుని అనటంలేదా? అలాగే నేనూ చెప్తున్నాననుకోకండి. నేను మతాంతర వివాహం చేసుకోవాలనుకుంటున్నాను."

నరహరి నివ్వెరపోయాడు. హరిబాబుకి ఇంతధైర్యం ఎక్కణ్ణించి వచ్చిందో అనుకున్నాడు.

"నిజంగానా?" కాస్త ముందుకివంగి ఆసక్తిగా ప్రశ్నించాడు.

"కాలం కలిసొస్తే ఇది నిజమే మావయ్యా" ముక్తసరిగా చెప్పాడు.

"ఎక్కడ? పట్నంలోనా? నాకు తెలుసోయ్ - పైచదువులకి పంపిస్తే ఏదో ఒకటి ఇలాంటి ఉపద్రవం తెచ్చిపెడతారు. మీ నాన్నకి తెలుసా?"

"ఇంకా తెలీదు"

''అయితే, మీ నాన్న ఒప్పుకుంటాడన్న విశ్వాసం నాకులేదు''

"ఒప్పుకోకపోతే ఆయన సంఘసేవకుడు, సంఘసంస్కర్త కానేకాడు. మా నాన్నగా నువ్వుగా... మీరు ఊరికి పెద్దలు మావయ్యా. సంఘాన్ని ఉద్ధరింపబూనేవాళ్ళు. మీలాంటివారి దృక్పథం ఓ మెట్టు పైనే ఉండాలి. మీరు మిగిలిన సామాన్యప్రజలకి ఆదర్శకులు కావాలి. నా విషయంలో మా నాన్న ఒప్పుకోడని నువ్వంటున్నావు. సరే, మా నాన్న స్థానంలో నువ్వున్నావనుకో... అప్పుడు నువ్వేం చేస్తావు? నేను చెప్పిన ఆ దృక్పథాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పు'' సూటిగా నరహరి కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు హరిబాబు.

నరహరి గొప్ప ఇరకాటంలో పడిపోయాడు. ఏం సమాధానం చెప్పాలో చప్పున అతని బుద్ధికి తట్టలేదు. 'ఒప్పుకోను' అంటే, 'మీరు సంఘసంస్కర్తలా?' అని ఎకసక్కెం చేస్తాడన్న భయం లేకపోలేదు.

"ఏం మావయ్యా ఆలోచనలో పడ్డావు?"

"అబ్బే... ఏంలేదులే"

"నా ప్రశ్నకి సమాధానం చెప్పావు కాదు మావయ్యా"

''నువ్వు చెప్పిన దృక్పథంతో అయితే అంగీకరించక తప్పదు కదామరి''

హరిబాబు సన్నగానవ్వేడు. నరహరిలో ఆ కాస్తయినా పరిణామం తెచ్చినందుకు మనసులో సంబరపడిపోయాడు.

"అదీ అలా వుండాలి మావయ్యా సంస్కారమంటేను. మా నాన్న కూడా ఒప్పుకుంటారనే నా నమ్మకం మరి. వెళ్ళొస్తా. కాంతం...'' అంటూ కాంతంని కేకేశాడు.

తలుపుచాటునవుండి అంతా వింటోంది గామోసు, చప్పున బయటికొచ్చింది. ఆమె మొహం వికసిస్తోంది.

"ఏం బావా...?"

"వెళ్ళొస్తా" అనేసి బయలుదేరాడు హరిబాబు.

హరిబాబు కనుచూపు మేర దాటిన వెంటనే ఏదో కలలోనించి తేరుకున్నట్టు కూతురుకేసి చూశాడు.

"వాడి గొప్ప మాటకారి అయ్యాడమ్మా" అన్నాడు.

"చదువుకున్నాడు కద నాన్నా"

"కొంపదీసి రాజకీయాల్లో ప్రవేశిస్తాడేమో''

''ఎలా అనుకుంటున్నావు?"

''ఆ ఉపన్యాసాలు వింటూంటే ఆ అభిప్రాయం ఎవరికైనా కలుగుతుంది"

"ఇలాంటివాళ్ళు రాజకీయాల్లో ప్రవేశిస్తే మంచిదే కద నాన్నా – చెప్పేదేదో ఆచరణలో పెడతారు. అప్పుడు సమాజంలో చైతన్యం రావడానికి అవకాశం వుంటుంది''

నరహరి విసుగ్గా కూతురుకేసి చూశాడు. "ఏం చైతన్యమో ఏవిటో నమ్మా! మీబావ ఇప్పుడేమన్నాడో విన్నావు కదూ ?"

"ఏమన్నాడు నాన్నా?"

"తాను మతాంతర వివాహం చేసుకుంటాడట."

"ఏ క్రిష్టియను అమ్మాయినో ప్రేమించి వుంటాడు. పెళ్ళి చేసుకుంటాడేమో! చెప్పింది చేస్తాడు. నిజాయితీ వున్నవాడు నాన్నా''

"అయినా ఇవేం బుద్ధులే అమ్మాయ్! నిక్షేపంలాంటి మేనకోడళ్లు ఇద్దరున్నారు. తనకి నచ్చిన ఏ ఒక్కతెనో పెళ్ళి చేసుకుంటే కాదూ? పెద్ద సంఘసంస్కర్తలా మతాంతర వివాహానికి బయలుదేరాడు"

"అందరూ అలా అంటే సమాజ పరిణామానికి తావేదీ? బావలాంటివాళ్ళెవరో కొందరుండాలి మరి''

"చదువేస్తే వున్నమతికాస్తా పోతుందన్నట్టు నీకూ ఆ పిచ్చే పడుతుందా ఏవిటి?'' అసంతృప్తిగా నరహరి అనేసరికి కలవరపడిపోయిన కాంతం మరేం మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

* * *

హరిబాబు అరుణ ద్వారా పంపిన కబురు విని ఎంతగానో మురిసిపోయింది నసీమ్. అటువంటి అవకాశం కోసమే ఆసక్తితో ఎదురు చూస్తోందామె. ఆమె మొహంలో అంతవరకూ దోబూచులాడుతోన్న విషాదచ్ఛాయలు అంతర్థానమయ్యాయి. స్నేహితురాలికేసి ప్రసన్నవదనంతో పరికించింది.

"అరుణా! నేనుచేసుకుంటే మీ బావనే చేసుకుంటాను" మెల్లగా అయినా ఆవేశంతోనే అంది నసీమ్.

"అబ్బ, అంత ఆవేశం వద్దు. మా బావ సంగతికూడా ఆలోచించు. మా మావయ్య ఒప్పుకుంటారా అన్నది మరో సమస్య" చిన్న చేదుమాత్ర పడేసింది అరుణ.

నసీమ్ మొహం హఠాత్తుగా రంగు మార్చింది. అంతవరకూ వుండే ఉత్సాహం మళ్ళీ మాయమయ్యింది..

"అంటే, మీమావయ్య ఒప్పుకోరంటావా?" దిగులుగా అడిగింది.

"ఏమో! ఎలా చెప్పగలం? ఇది పల్లె వాతావరణం కదా ! ఇక్కడి మనుషుల మనస్తత్వాలు ఇంకా చైతన్యవంతం కాలేదు. అయితే మా మావయ్య మాత్రం మిగిలినవారికి భిన్నంగా వుంటాడు. ఉదాహరణకి నా విషయమే ఆలోచిద్దాం. చక్రపాణి మేష్టారు మా కులంవాడు కాపోయినా అతనితో నా వివాహాన్ని జరిపించడానికి అంగీకరించి ముందుకొచ్చాడు మావయ్య. అయితేనా దురదృష్టంవల్ల అదలా అయింది. అది వేరేవిషయం. వాళ్ళ నాన్నకి నచ్చజెప్పడానికి మా బావ శతవిధాల ప్రయత్నిస్తాడులే! చూద్దాం ఎలా వుంటుందో పరిస్థితి. నీ ప్రేమ తప్పక ఫలిస్తుందని నా మనస్సు చెబుతోందే నసీమ్" అంటూ ముగించింది అరుణ.

నసీమ్ ఆనందాతిశయంతో అరుణని కౌగలించుకుంది.

"చల్లని నీ నోటి మాట సత్యమైతే

నీకు ప్రత్యేకంగా విందు ఇస్తానే అరుణా" అంది.

"ఆ మాట మీదే వుండు. నాకోసం ప్రత్యేకంగా విందు ఏర్పాటు చెయ్యాల్సి వస్తుంది తప్పకుండా" అని అరుణ అంటూ వుండగా నసీమ్ తల్లి ముంతాజ్ కాఫీకప్పులతో అక్కడికి వస్తూండటం చూశారు ఇద్దరూను. వారి నోటికి తాళం పడింది.

"ఏవిటమ్మా అరుణా... విందంటు న్నావు?" దగ్గరకొస్తూ ఓ కప్పు కాఫీ అరుణకి, మరోటి నసీమ్‌కి అందించి అంది ముంతాజ్.

అరుణ తబ్బిబ్బు కాలేదు.

"మరేంలేదు పిన్నిగారూ! నసీమ్ వివాహ సందర్భంలో విందు ఎక్కడ ఏర్పాటు చేస్తున్నారా అని..." సమయ స్ఫూర్తిగా అంది.

నసీమ్ తేలిగ్గా వూపిరి పీల్చుకుంది.

"ఆ వివరాలేవీ ఇంకా నిశ్చయం కాలే దమ్మా. వాళ్లీమధ్య వస్తామన్నారు. వాళ్లొచ్చాక వివాహం ఏ తేదీన నిశ్చ యించడమో, ఎక్కడ విందు ఏర్పాటు చెయ్యడమో నిర్ణయమౌతుంది" ముంతాజ్ సమాధానం చెప్పింది.

"ఏమైనాసరే ఇక్కడే ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నించండి పిన్ని గారూ!"

"ఈరోజుల్లో మగపెళ్లివారిదే పై చెయ్యికదమ్మా! వాళ్ళేం చెబుతారో చూడాలి"

"అదీ నిజమే అనుకోండి" ముక్త సరిగా అంది అరుణ.

"ఔనమ్మా అరుణా...మరి నీ పెళ్ళి సంగతి చెప్పావుకాదు? ఏవో సంబంధాల కోసం ప్రయత్నిస్తున్నారటగా?"

అరుణ సిగ్గు దొంతరలు చెక్కిళ్ళను ఎరుపెక్కించగా మొహం దించుకుంది.

"ఇంకా ఏదీ నిర్ణయం కాలేదు పిన్ని గారూ! అయినా, ఇప్పుడు నా పెళ్ళికి తొందరేమొచ్చిందిలెద్దురూ?"

"అలా అనకమ్మా! ఏ వయస్సులో జరగాల్సింది ఆ వయస్సులో జరిగితేనే జీవితంలో ఆనందం వుంటుంది. అయినా మీ మావయ్యగారికి నచ్చినవాళ్ళు దొర కొద్దూ?"

"అదీ నిజమేలెండి" అంటూ కాఫీ తీసుకోవడానికుపక్రమించింది అరుణ.

"కూచుని మాట్లాడుతూ వుండం డమ్మా అరుణా!వంటపని పూర్తికాలేదింకా" అనేసి అక్కణ్నించి వంటగదికేసి వెళ్ళి పోయింది ముంతాజ్.

ముంతాజ్‌ని చూస్తుంటే అరుణకి ఆశ్చర్యమేస్తుంది. ఆమె నసీమ్‌ని కన్న తల్లి అంటే ఎవరూ చప్పున నమ్మరు. ఇప్పటికీ అంత ఆకర్షణీయంగా వుంటుం దామె. ఆమె యవ్వనంలో వున్నపుడు ఎంతో అందంగా మునీశ్వరుల్లాంటి మగాళ్ళని సహితం ఇట్టే ఆకర్షించేంతటి ఆకర్షణీయంగా వుండి వుంటుంది. ఆమెని చూస్తుంటే ముస్లిము వనితని ఎవరూ అనుకోరు. ఆపల్లెలో మొదట్నుంచీ వుండి పోయి కట్టూ బొట్టూ అంతా హిందూ స్త్రీలానే అలవర్చుకుందేమో...అని అను కుంది అరుణ.

"మీ అమ్మని, నిన్ను ఓచోట నిలో బెడితే తల్లీ కూతుళ్ళని ఎవరూ అనుకోరే నసీమ్. మీ అక్క అంటే ఎవ్వరైనా ఇట్టే నమ్మేస్తారు. ఏమంటావ్" ఎప్పుడూ ఆ మాట అనకపోయినా ఆరోజు మాత్రం అలా అనాలనిపించింది అరుణకి.

"ఔనే అరుణా! నువ్వన్న మాటే

చాలా మంది అంటూంటారు. మాఅమ్మది కాయశరీరమంటారు. వయస్సు కనిపించదు"

"అయ్యిండొచ్చు. మరి, నేను వెళ్ళొస్తానే"

"సరేగాని, నీకూ ఏవో సంబంధాలు చూస్తున్నారని వింటున్నాను. ఎంత వరకూ వచ్చిందేమిటి?" అడిగింది నసీమ్.

"ఏదీ ఇంకా నిర్ణయంకాలేదు" అయితే నీకు చెప్పకుండా నేనా?"

"ఏమోలే..."

"నీలా అనుకుంటున్నావా?" కిలకిల నవ్వుతూ అంది అరుణ.

"పోవే! అందులో రహస్యం లేదుగా? నా ప్రతి కదలికా నీకు తెలిసిందే కదూ. అటువంటప్పుడు నన్ను నిందించడమెందుకే?"

"సరేలే. వస్తామరి" నవ్వుతూ లేచింది అరుణ.

"రేపు సాయంత్రం అలా కాలవకేసి వెళ్దామా?"

"నువ్వు ఇంటికిరా...వెళ్దాం. మనతో పాటు కాంతం అక్కయ్యని కూడా తీసుకెళ్దాం"

"అలాగే వస్తాను"

"వస్తానప్పుడే.ఏమండోయ్ పిన్నిగారూ, వెళ్తున్నాను" అని వంటగదికేసి కేకవేసి మరీ వెళ్ళిపోయింది అరుణ.

నసీమ్ తృప్తిగా ఓ నిట్టూర్పువిడిచి లోపలికి నడిచింది. ఆమె హృదయం దూదిపింజమల్లె ఎంతో తేలికపడింది. మరుక్షణంలో మళ్ళీ ఆలోచనలోపడింది. ఈసారి చెప్పలేని గుబులు బయలుదేరింది హృదయంలో హృదయస్పందన అధికమయ్యింది. అరుణ సలహా ఇచ్చినట్టు తండ్రితో చెప్పాలంటే భయమేస్తోంది. అరుణ చెప్పినపుడు మాత్రం తలూపేసింది తను. అప్పుడే ఎందుకాలోచించలేదీ విషయాన్ని? అయితే మరో మార్గమేమిటి?ఆలోచించింది.తన ప్రేమను పరిరక్షించుకోవాలంటే ఏదో ఒకటి చెయ్యాలి..తప్పదు. ఇప్పుడు తొందరపడకూడదని నిర్ణయించుకుంది. పట్నంనుంచి వాళ్ళొచ్చిన తరువాతనే అదనుచూసుకుని తన నిర్ణయాన్ని వ్యక్తం చెయ్యాలనుకుంది నసీమ్.

* * *

శివయ్య రామరాజు విషయంలో తనకితట్టిన ఆలోచనని హరిబాబుతో చెప్పాడు. హరిబాబు ఆశ్చర్యపోయాడు. రాజుగురించినఆలోచనే తనకు రాలేదేమా అని తలపోశాడు.

"ఆశ్చర్యంగా ఉంది నాన్నా! మనకి ఇంత దగ్గరలోవున్న సలక్షణమయిన ఈ సంబంధం గురించి ఆలోచన రాకపోవడం ఆశ్చర్యకరమైన విషయమే. అందులోనూ రామరాజు మంచి వుద్యోగమే చేస్తున్నాడనివిన్నాను. వాళ్ళ స్థితిగతులు కూడా ఇప్పుడిప్పుడే మెరుగుపడుతున్నాయి. ఇంకాపోతే, రామరాజు రూపంలోకూడా మార్పు వచ్చింది. ఈమధ్యనే చూశానుగా! రామినాయుడికి మన కుటుంబంపట్ల భక్తి ప్రపత్తులున్నాయి. మీరు చెబితే కాదనడేమో" అంటూ తన ఆమోదముద్ర కూడా వేసేశాడు హరిబాబు.

"అప్పుడే మాట్లాడమంటావు..ఏం?"

"వుపేక్షించొద్దు నాన్నా! ఈరోజుల్లో బ్యాంకుల్లో వుద్యోగాలుచేస్తున్న అబ్బాయిలకోసం అమ్మాయిలనిస్తామని ఎగబడుతున్నవాళ్లు చాలామందున్నారు. వాళ్ళ ఆదాయం బావుందిగా. అందుకే




ఎగబడుతుంటారు. తప్పదు. అందుకే, మీరు వెంటనే మాట్లాడేసేయండి నాన్నా"

"అదే నేనూ అనుకుంటున్నాను. అన్నివిధాలా అనువుగా అగుపిస్తోందీ సంబంధం"

"కాని..." ఏదో సందేహమొచ్చింది హరికి.

"కాని ఏవిట్రా?"

"అసలు విషయం విస్మరిస్తున్నారేమో"

"ఏవిటది?"

"ఆయన అభిమతమేమిటో తెలుసుకున్నారా?"

శివయ్య సన్నగా మందహాసం చేశాడు.

"ఆపాటి ముందుచూపు నాకు లేకపోలేదురా! సూచాయగా దాని అభిప్రాయం తెలుసుకున్నాను. నోటితో ఏ ఆడపిల్లా పెళ్ళి విషయం చెప్పదు సాధారణంగా. ఆయనకూడా కేవలం భావాలతో చెప్పేసింది. అందుకే ఈ ప్రయత్నం"

"అయితే సమస్యే లేదు. శుభస్య శీఘ్రం"

"అందుకే ఇవ్వాళ సాయంత్రమే వాళ్ళింటికి వెళదామనుకుంటున్నాను. నేను కబురంపితే రామినాయుడు రాడని కాదు. ఎంతయినా మనం ఆడపిల్ల తరపు వాళ్ళం, వాళ్లు మగపిల్లవాడి తరపువాళ్లు. మనం వెళ్ళి అడగడమే సబబుగా వుంటుంది కదా!"

"అదీ నిజమే నాన్నా! వెళ్లి అడగండి. తప్పేముంది. కట్నం విషయంలో వెనకంజ వెయ్యొద్దు"

ఆ సాయంత్రమే శివయ్య రామి



నాయుడు ఇంటికి వెళ్ళాడు.

ముందుగానే కబురు పంపించడంవల్ల రామినాయుడు, రామరాజు కూడా ఇంట్లోనే వున్నారు. శివయ్యని చూడగానే వాళ్ళెంతో మురిసిపోయారు.

"రండి శివయ్యగారూ" సాదరంగా ఆహ్వానించాడు రామినాయుడు.

"మీరు మా ఇంటికి విచ్చేయడం మాకెంతో ఆనందంగా వుంది సార్" అన్నాడు రామరాజు.

వారి కృతజ్ఞతా భావాలకు మనసులోనే అభినందించుకున్నాడు. ఓ చిరునవ్వు నవ్వేడు.

''మరీ నన్ను ఆకాశానికెత్తకండోయ్! నేనేం గొప్పవాణ్ని కాదు. మీలాంటి సామాన్యుణ్నే" అన్నాడు శివయ్య.

"అలా మీరనడం మీ సహృదయానికి తార్కాణం సార్" మళ్ళీ అన్నాడు రామరాజు.

రామరాజు లోపలిగదిలోకి వెళ్ళి కాఫీ తీసుకొచ్చి శివయ్యకీ, రామినాయుడికీ అందించాడు.

"అప్పుడే కాఫీకూడా తయారయి పోయిందా ఏవిటోయ్" నవ్వుతూ అన్నాడు శివయ్య.

''ఫ్లాస్కులో పోసివుంచామండీ"

''అలాగా!'' కాఫీ సిప్ చేస్తూ ''బాగుందోయ్ కాఫీ'' అన్నాడు.

రామరాజు ఆ కాంప్లిమెంటుకి ముసిముసిగానవ్వుకున్నాడు. శివయ్య ఖాళీ గ్లాసు పక్కనేవున్న బల్లమీద పెట్టేశాడు.

"నాయుడూ! నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలని వచ్చాను'' అన్నాడు శివయ్య.

"చెప్పండి!''

"మీవాడికి పెళ్ళిసంబంధాలేమైనా వస్తున్నాయా?''

''ఎన్నో వస్తున్నాయండీ. అమధ్య నేనోసారి పట్నం వెళ్తే ఇద్దరు స్నేహితులు ఈ విషయాన్నే ప్రస్తావించారు. నేను ఆ ప్రస్తావన్ని కొనసాగించలేదు. అప్పుడే వాడికి పెళ్లి ఏవిటండీ''

''ప్రతీ తలిదండ్రులూ తమపిల్లల వయస్సు చాలా తక్కువేనని అనుకోవడం కొత్తేమీకాదు. కాని, ఏ వయసులో ఆ ముచ్చట జరిగితేనే ఆనందం. మావాడికీ ఏదో సలక్షణమయిన సంబంధంచూసి వివాహం చేసెయ్యాలని చూస్తున్నాను'' అని శివయ్య అంటే రామినాయుడు మరేం చెప్పలేకపోయాడు.

''ఇంత వుపోద్ఘాతం ఎందుకో తెలుసా నాయుడూ?'' మళ్లీ శివయ్యే అన్నాడు రామినాయుడుకేసి చూస్తూ.

"ఎందుకండీ!'' అర్థం కాలేదన్నట్టు అడిగాడు నాయుడు.

"మరేం కాదోయ్...అసలు నేనిప్పుడు మీ యింటికి రావడంలో అంతరార్థం అదేను. మా మేనకోడలుంది తెలుసును కదా ? అదేనోయ్ నరహరి తమ్ముడి కూతురు. ఆమెని మీ అబ్బాయికిచ్చి పెళ్ళి చేస్తే బావుంటుందని నా అభిమతం. మరి నువ్వూ, మీ అబ్బాయి, ఏమంటారో తెలుసుకోవాలని వచ్చాను. అమ్మాయిని నువ్వూ చూశావు... మీవాడూ చూశాడు. ఇంకెక్కడికో దూరభారపు సంబంధాలు చూద్దాం నాకిష్టం లేదోయ్. తండ్రిలేని పిల్ల. దాని బాధ్యత నామీదే వుందిగా!" ప్రస్తావన తీసుకొచ్చాడు శివయ్య.

రామినాయుడు ఆ ప్రస్తావన్నే నమ్మలేకపోయాడు. శివయ్యలాంటి వ్యక్తి తనతో బంధుత్వం నెరపాలని రావడమే ఓ అదృష్టం. ఈ విషయంలో తాను




ఆనందించాలేగాని, ఇంక అనడానికే ముంది? తన కొడుకు చాలా అదృష్ట వంతుడనే చెప్పాలి.

ఇహ రామరాజు విషయం చెప్పా లంటే, అతడు సిగ్గుతో ముడుచుకుపోయి నట్టయ్యాడు. ఓ పక్క ఆనందం వెల్లి విరుస్తూవుంటే, మరోపక్క తన అదృ ష్టాన్ని అభినందించుకుంటున్నాడు. అరుణ లాంటి అందమైన అమ్మాయి, అంతస్తు గల అమ్మాయి తనకి అర్ధాంగి అవు తుందని కలలోకూడా అనుకోలేదతను.

వీళ్ళిద్దరూ ఇలా ఆలోచనల్లో పడితే, శివయ్య కాస్తంత ఆందోళన చెందాడు. అది సహజమే ఆ పరిస్థితుల్లో. అందుకే మళ్ళీ తనే అందుకున్నాడు.

"రామినాయుడూ! నీకుగాని, మీ వాడికిగాని మరో సందేహం వచ్చి వుండొచ్చు. అదేమిటంటే, మా అబ్బాయి హరికే అరుణనిచ్చి ఎందుకు పెళ్ళి చెయ్యలేదా అని? ఇది అందరిలోనూ ఉద్భవించే సహజమైన ప్రశ్న. అయితే దానికి కారణం లేకపోలేదు. మా హరి, అరుణ ఇద్దరూ ఒకే ఇంట్లో చాలా రోజు లుగా మసలేరు. అందుకే వాళ్ళు ఒకర్నొ కరు వివాహం చేసుకోడానికి ఇష్టపడ లేదు. దంపతులు కాబోతున్నారన్న అభి ప్రాయమే వాళ్ళలో కలగలేదట. ఆ ఇద్ దరూ అటువంటి అభిప్రాయాన్ని వెలి బుచ్చుతూ వుంటే మనం బలవంత పర్చడం అమానుషంగా వుంటుంది కదా! అందుకే ఆ ప్రయత్నాన్ని విరమించు కున్నాం"

రామినాయుడు కాస్తంత కలవర పడ్డాడు. తాను ఆలోచనల్లో పడి శివయ్య గారు అలా సందేహించడానికి అవకాశం కలిగించినందుకు కించిత్ బాధపడ్డాడు కూడాను.

"అబ్బే... అటువంటి సందేహం ఏదీ యింతవరకూ నాకు కలగలేదండీ శివయ్య గారూ! మీ ప్రతిపాదనకే నేను ఆనం దంతో వుక్కిరిబిక్కిరి అయిపోతున్నాను మీ అంతస్తేమిటి? మా అంతస్తు ఎక్కడ? అరుణలాంటి అమ్మాయి మా ఇంటికి కోడలుగా వస్తుందంటే కాదనడానికి, నిరాకరించడానికి నేనేం పిచ్చివాణ్ణా చెప్పండి? మా ఆవిడ వింటే మరీ వుప్పొంగి పోతుంది. ఏదో రుణానుబంధం వల్ల యిలా జరుగుతుందేగాని మీతో చేతులు కలిపే తాహతు మాకెక్కడిదండీ" వుత్సుకతతో అన్నాడు రామినాయుడు.

శివయ్య లోలోన ఎంతగానో సంబర పడిపోయాడు-రామినాయుడు తన మాట నిలబెట్టినందుకు.

"అంతస్తు, తాహతుల ప్రసక్తి తీసుకు రావొద్దు నాయుడూ! మీ కుటుంబం ఎటు వంటిదో నాకు తెలుసు. మీరొకప్పుడు బాగా వున్నవాళ్ళే ఏంచేస్తాం? కాలమహిమ ఎలా వుంటుందో చెప్పలేం కదా! అయితే బంధుత్వానికి కావల్సింది సాంప్రదాయం. మరి మీవాడు ఏమీ అనలేదే? ఏమోయ్ రాజూ" అంటూ రామరాజు కేసి పరికిం చాడు శివయ్య.

రామరాజు మాత్రం ఏం అనగలడు? ఓ అందాల రాశి, అభినవ శకుంతల తనకి అర్ధాంగి కాబోతుందంటే, అక్కర్లే దని చెప్పగలిగే 'పిచ్చి హృదయం' అతనిది కాదు.

"ఇది నా అదృష్టంగా భావిస్తున్నాను సార్! మీరు నాకు ప్రతి విషయంలోనూ మార్గదర్శకులవుతున్నారంటే అది నాపట్ల మీకు గల వాత్సల్యమేనని చెప్పుకోవాలి. మీకెంతగానో రుణపడి వుంటాను"

మొహం దించుకునే మురిసిపోతూ అన్నాడు రామరాజు.

"రామినాయుడూ! మరి నేవెళ్ళొస్తాను. మా మరదలితో ఈ విషయాలన్నీ చెప్పు. ఓ మంచిరోజు చూసుకుని మరో సారి నేనూ, మా ఆవిడ వస్తాం. మాతో పాటు నరహరికూడా వుంటాడనుకో. ఎంతయినా అతుణ పెద్దనాన్న కదా! అతడి ప్రమేయం లేకుండా ఈ వివాహం జరగకూడదు కూడాను....అదేంటోయ్ అలా చూస్తున్నావు? నరహరి మునుపటి నరహరి కాడులే. అతడిలో చాలా మార్పు వచ్చింది. గతంలోని తన ప్రవర్తనకి ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నట్టున్నాడు. మా కుటుంబాల మధ్య మొదటి సాన్నిహిత్యం మళ్ళీ ఏర్పడింది" అంటూ రామినాయుడి సందేహాన్ని నివృత్తి చేశాడు కూడా.

"చాలా సంతోషమండీశివయ్యగారూ! అయినా, మీ మాటకి నేనెప్పుడూ ఎదురు చెప్పను కదా"

"వస్తాను మరి... వస్తానోయ్ రాజూ"

"మంచిది సార్! నేను రేపు వెళ్ళి పోతున్నాను సార్... సెలవు అయిపో వస్తోంది. నాన్నగారు మళ్ళీ వుత్తరం రాస్తే వస్తాను" అన్నాడు రామరాజు.

"అలాగే చెయ్"

శివయ్య బైటికి నడిచాడు. అతనితో పాటు పదిగజాలు వెళ్ళి, మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చాడు రామినాయుడు. అతనిలో కొత్త వుత్సాహం పుంజుకున్నట్టయ్యింది. భార్యను పిల్చి చెప్పబోయాడు.

"విన్నానండీ! అబ్బాయి చెప్పాడు. నా ఆనందానికి అవధుల్లేకపోయాయి" అందామె.

"అంతా అబ్బాయి అదృష్టమేనే" తృప్తిగా అన్నాడు రామినాయుడు.

"అది అందరి అదృష్టమూనండీ!మన జీవితాల్లోకి మంచిరోజులు ప్రవేశించాయి" మందహాసంతో అందామె.

"అది నిజమేలే. ఆ అదృష్టం శివయ్య గారి రూపంలో ఆవహించింది" నవ్వుతూ అన్నాడు.

"అయితే నరహరిగారి ఆస్తిలో సగ భాగం అతుణకి వస్తుందనుకుంటానండీ" మనసులో మెదిలిన మాటని చెప్పింది.

"అబ్బ ! నిజంగా ఆవదానివనిపించు కున్నావు సుమా.మాకెవ్వరికీ ఆ ఆలోచనే రాలేదు. నువ్వనుకున్నట్లు భాగం వస్తుం దనుకుంటాను. అయినా ఇప్పుడే ఆ ఆలోచనలన్నీ ఎందుకులెద్దూ. సలక్షణ మైన అమ్మాయి మనింటి కోడలవుతోంది. అది చాలు. మిగతా విషయాలు వాటంత టవే పరిష్కారమవుతాయి" అన్నాడు రామినాయుడు.

"అంతేలెండి" అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయింది వంటగదికేసి.

రామినాయుడు తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచాడు.




హరిబాబు ఊళ్ళో అందరి అభిమానా దరాల్ని అనతికాలంలో సంపాదించాడు. తమ ఇంటికి కాస్తంత దూరంలో వున్న ఓ చిన్న ఇంట్లో వయోజన విద్యా

కేంద్రాన్ని ఏర్పాటుచేసి పలువుర్ని చేర్చి విద్యాబోధ చేస్తున్నాడు. వారిలో హరిజనులు కూడా నలుగురైదుగురున్నారు. చిన్న గ్రంథాలయాన్ని ప్రారంభించాడు. అప్పుడప్పుడూ గాంధీగారి ప్రవచనాలు ప్రబోధిస్తూ అస్పృశ్యత, అంటరానితనం జాతిని, దేశాన్ని ఎంత నిస్సత్తువ చేస్తాయో కొన్ని ఉదాహరణలతోపాటు చెప్తుండేవాడు. పల్లెల్లో ఉంటూ పట్నాల్లో ఉద్యోగాలకై పరుగులెత్తే విద్యావంతుల్ని విమర్శించాడు. వాళ్ళు పల్లెల్లోనేఉంటూ పల్లెల్ని అన్ని రంగాల్లోనూ అభివృద్ధి పరిచే ప్రయత్నంచేస్తే సమాజమే మారిపోతుందన్నాడు. ఇల్లాంటివి ఎన్నో చెప్తుండేవాడు.

ఇలాఉండగా హఠాత్తుగా ఓరోజు కాళిదాసు వాలేరునుంచి దిగబడ్డాడు. అతణ్ణి చూడ్డంతోనే కాంతంకి ఓ విధమైన భయం, బెదురు పట్టుకున్నాయి. దాసు విషయం మావయ్య తన తండ్రితో చెప్తాడేమోనన్నదే ఆ భయం.

"ఏం కాంతం బావున్నావా?" కుశల ప్రశ్న వేశాడు కాళిదాసు.

"బాగానే వున్నాను మావయ్యా! హఠాత్తుగా ఉత్తరమైనా రాయకుండా ఇలా ఊడిపడ్డావేంటి మావయ్యా?" అడిగింది కాంతం.

"ఏం రాకూడదా ఏంటి?"

"అబ్బే అదికాదు. ఏదో అర్జంటుపని ఉండి వుంటుందేమోనని"

"అటువంటిదేం లేదులే. ఈమధ్య మా అక్క కలలోకి వస్తుంటే ఓసారి చూసిపోదామని వచ్చేశాను"

"ఓ! అలాగా? విన్నావా అమ్మా! మీ తమ్ముడికి నీ మీద ఎంత అభిమానం ఉందో" చిన్నగా నవ్వుతూ అంది కాంతం.

కాంతమ్మ నవ్వుకుంది.

"అబ్బ! వూరుకోవే! అక్కపట్ల అభిమానం తమ్ముడికుండదూ! అదేం మాటే. ఒరేయ్ తమ్ముడూ...నువ్వు ఆట పట్టించాలని అంటుందిగాని మరోవిధంగా కాదు. నువ్వేమీ అనుకోకు" అంది కాంతమ్మ.

కాళిదాసు మందహాసం చేశాడు.

"మంచిదానవేనక్కా! నేనేమైనా అనుకోవడమా! అబ్బే అటువంటి అలవాటు నా జాతకంలోనే లేదు. ప్రతి విషయాన్నీ నేను చాలా లైట్‌గా తీసుకుంటాను. కాంతం నాతో పరిహాసమాడుతుందని నాకు మాత్రం తెలీదూ? నాకా పాటి అదృష్టం లేకపోయిందిగానీ మా ఇరువురం దంపతులమై కలకాలం పరిహాసాలతోనే కూచునేవాళ్ళంగా" అన్నాడు ఉత్సాహంగా.

కాంతం మొహంలో రంగు మారింది. మావయ్య అదే ప్రసక్తిని ఎప్పుడూ తీసుకొస్తూ ఉండటం ఆమెకి నచ్చదు.

"సంతోషించాంగాని యింకా ప్రసక్తి తీసుకురాకు మావయ్యా" అంటూ చరచరా అక్కణ్ణించి లోపలికి వెళ్ళిపోయింది.

"అయినా నువ్వు మరీనా తమ్ముడూ! ఆ విషయం ఎందుకిప్పుడు ప్రస్తావించుతావు చెప్పు! దానికి దుడుకుతనం ఎక్కువని నీకూ తెలుసు. అది మర్చిపో లేచి స్నానంచెయ్యి" అంది కాంతమ్మ.

"ఇప్పుడు స్నానం చెయ్యనుగాని బావేడీ?"

"అలా ఎక్కడికో వెళ్ళారు. వచ్చేస్తారులే. లక్ష్మి పిల్లలూ బావున్నారా?"

"ఆ! బాగానే ఉన్నారు. నీతో ఓ

విషయం మాట్లాడాలక్కా"

"ఏమిటది?"

"లోపలికి పద"

"ఇక్కడే చెప్పరా! ఎవరు వింటారని?"

"నాకు అర్జంటుగా ఓ రెండువేలు కావాలి"

"రెండువేలా!" ఆశ్చర్యపోతూ అంది శాంతమ్మ.

"ఔనక్కా! నా పరువు ప్రతిష్టలకి ముప్పు వాటిల్లుతోందక్కా. ఈ పరిస్థితుల్లో బావతో చెప్పి ఎలాగయినా ఈ సహాయం చేసిపెట్టాలి"

శాంతమ్మ ఓ నిట్టూర్పు వదిలింది.

"మీ బావగారి మనస్తత్వం నీకు తెలీంది కాదురా దాసూ! అప్పట్లో ఏదో పీకలమీదికొచ్చిందంటే మూడు వేలిచ్చారు. మళ్ళీ ఇస్తారన్న నమ్మకంలేదు"

"నువ్వలా అంటే నేనేమైపోవాలక్కా? నేనిప్పుడీడబ్బు తీసుకుని వెళ్ళకపోతే ఇంక ఆ ఊళ్ళో మేం బతకలేం అక్కా!" బాధగా అన్నాడు.

నిజంగానే ఏదో విపత్తు వచ్చి ఉంటుందని నమ్మింది శాంతమ్మ. ఎంతయినా తోడబుట్టినవాడు. తమ్ముడిమీద జాలి కలిగింది.

"అయినా నువ్వు మరీ ఖర్చుదారి మనిషివయ్యావురా తమ్ముడూ! మనకొచ్చిన ఆదాయాన్ననుసరించి ఖర్చు బెట్టాలిగాని 'అప్పుచేసి పప్పుకూడు' అన్నట్టుగా డాంబికాలకి పోవడమెందుకు? నువ్వు వెలిగిస్తున్న ఆ ఉద్యోగానికి స్కూటరెందుకు చెప్పు? పెట్రోలు ధరలు ఆకాశాన్నంటుకుంటున్నాయి. కాస్త అంతస్తులో వున్నవాళ్ళే తట్టుకోలేక స్కూటర్లు అమ్మేస్తున్నారు. దీనికితోడు నీకున్న అలవాట్లొకటి. వయసు పెరుగుతున్నకొద్దీ మంచి మార్పు రావాలిగాని ఇలా ఒకరిచేత చెప్పించుకోవల్సిన గతి పట్టకూడదు. సరేలే ఎన్నిసార్లని నీకు చెప్పడం? ఇప్పటికీ వినిపించుకోపోతే అనుభవిస్తావు నువ్వే" నిష్టూరంగా మాట్లాడింది శాంతమ్మ.

కాళిదాసు సిగ్గుపడిపోయి మొహం దించుకున్నాడు. అక్కయ్య చెప్పింది అక్షరాలా నిజమనిపించిందతనికి. ఇప్పటికయినా తాను జాగ్రత్తపడ్డం మంచిదనిపించింది. అయితే ప్రస్తుతం తనముందు వికటాట్టహాసం చేస్తోన్న విపత్తునుండి బైటపడాలికదా!

"నువ్వు చెప్పింది నిజమేనక్కా! ఇన్నాళ్ళూ నేను భవిష్యత్తు గురించిన ఆలోచనే చెయ్యలేదు. ఇప్పుడనిపిస్తోంది తప్పు నాదేనని. ఇకముందు జాగ్రత్తపడతాను. స్కూటర్నిఅమ్మేస్తాను. నా అలవాట్లను జయిస్తాను... నా మాటనమ్ము. మునుపటి కాళిదాసుగా చెప్పడంలేదు. మారిన కాళిదాసుగా చెబుతున్నానక్కా! ఈ ఒక్కసారిమాత్రం నువ్వీ సహాయం చెయ్యి. మళ్ళీ ఈ విధంగా అర్థించే అవకాశం రానివ్వను..." ప్రాధేయపూర్వకంగా అన్నాడు కాళిదాసు.

"సరే! నీ మాటకి ఎంత విలువుందో ఇప్పుడు చూస్తాను. మీ బావగారురానీయ్ ఏదో ఏర్పాటుచేస్తాను" అంది శాంతమ్మ.

కాళిదాసు మొహం వెయ్యిట్యూబులైట్లు వెలిగినంతగా ప్రకాశించింది.

"నువ్వు చాలా మంచిదానవక్కా!"

"పొగడ్తలుచాలుగాని స్నానానికిలే.."

అంటూ లోపలికివెళ్ళిపోయింది శాంతమ్మ.

కాళిదాసు చిన్నగా ఈలవేసుకుంటూ స్నానానికి సన్నాహాలు చేస్తున్నాడు.




* * *

మధ్యాహ్నం భోజనాలయ్యాక బైట వరండాలో వాలుకుర్చీల్లో మేనువాల్చారు నరహరి, కాళిదాసూను. అలా మేను వాల్చడం నిద్రపోడసిక్కాదు. కేవలం విశ్రాంతి తీసుకోడానికే.

"నువ్వు వచ్చిన పనేమిటో మీ అక్క చెప్పిందోయ్ దాసూ! కాని, ఇంతకు ముందు తీసుకెళ్ళిన పైకమే ఇంతవరకూ తీర్చలేదు నువ్వు. మళ్ళీ ఇప్పుడు రెండు వేలు ఇమ్మంటే ఎలా? డబ్బు తీసుకెళ్ళడమేగాని, తిరిగి ఇవ్వాల్సిన బాధ్యత నీకు వుండక్కర్లేదా! ఆదాయానికి మించి ఎందుకు ఖర్చుపెట్టాలోయ్? అసలు ఈ రోజుల్లో యువకులు ఎలా నాలుగు రాళ్ళు వెనకేసుకోవటమా అని మార్గాల కోసం అన్వేసిస్తూవుంటే, నువ్వేమో ఎలా ఖర్చుబెట్టటమా అని చూస్తున్నావల్లే వుంది. ఇది మంచిపద్ధతికాదోయ్. ఈ పరిస్థితి ఇలా కొనసాగిందంటే, ఎప్పుడో ఓసారి గడ్డురోజుల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది. నువ్వు..." అంటూ మెల్లగా కేకలేశాడు నరహరి.

"మీరుచెప్పిందాన్ని నేను కొట్టిపారేయ లేను బావా! ఇంతవరకూ జరిగిందేదో జరిగింది. గతాన్నితల్చుకుని నేనూ బాధ పడుతున్నాను. భవిష్యత్తులో బాధ్యతా యుతమైన కొత్తజీవితాన్ని సాగిస్తానని హామీ ఇస్తున్నాను. నా స్కూటర్ని అమ్మేయాలని నిర్ణయించుకున్నాను. ఆ పైకం మీకు పువ్వుల్లోపెట్టి అందిస్తాను. నా మాటమీద నమ్మకముంచండి..."

"ఏదో కావాల్సినవాడివి, ఆత్మీయుడివి గాబట్టి ఇది ఆఖరుసారిగా సహాయం చెయ్యదల్చాను. అదీ ఒక షరతుమీద" అంటూ ఆగాడు నరహరి.

"ఏమిటి బావా ఆ షరతు?"

"నువ్వు వీలైనంతత్వరలో స్కూటర్ని అమ్మేసి, వచ్చినంత నాకు బాకీతీర్చు. ఇప్పటికయినా బుద్ధితెచ్చుకుని అర్థంలేని డాంబికాలకు వెళ్ళకు. వున్నంతలో సరి పెట్టుకోవడం నేర్చుకో! ఇదే నేను నీ శ్రేయోభిలాషిగా కోరుతున్నది"

"అలాగేబావా! నువ్వుచెప్పినట్టు తుచ తప్పకుండా ప్రవర్తిస్తాను..." అంటూ హామీయిచ్చాడు కాళిదాసు.

"నువ్విలా మారిననాడు ఆనందించిన వాళ్ళలో ప్రథముడ్ని నేను. అంతేకాదు- అప్పుడు నాకు తోచిన సహాయం నేను చేస్తాను"

కాళిదాసు మనసులోనే ఆనందించా డెంతగానో. తనజీవితంలో మార్పురావాలి తప్పదు...అని దృఢసంకల్పం చేసు కున్నాడు.

"సరేగాని, ఆ విషయం అలా వుంచేద్దాం ఇంక. ఎప్పటికప్పుడే నీకు వుత్తరం రాద్దామనుకుంటూనే రాయలేక పోతున్నాను..." అంటూ టాపిక్ మార్చాడు నరహరి.

"ఏ విషయంలో బావా?"

"మేనమామగా నీకూ కొంతబాధ్యత వుందనుకో కాంతం వివాహవిషయంలో అయినా నువ్వు బొత్తిగా పట్టించుకోపోతే ఎట్లా?"

"నన్నేం చెయ్యమంటారు?"

"ఏంచెయ్యడమేంటి? విశాఖపట్నం లాంటి సిటీలోవున్నావు. ఏదేనా మంచి సంబంధంచూడవోయ్. పాతికవేలుకట్నం ఇవ్వడానికయినా వెనక్కిజంకను. అయితే అబ్బాయికి ఓ అంతస్తుండాలి. ప్రత్యేకించి డాక్టరో, ఇంజనీరో అయితే బావుంటుందని నా వుద్దేశం. అమ్మాయికి వయసు మీద

పడుతోందిగా! ఆ ఒక్క బాధ్యత తీర్చు కుంటేపోయే!" అన్నాడు నరహరి.

కాళిదాసుకి చప్పున దాసు గుర్తు కొచ్చాడు. అతడూ, కాంతం కలిసి బీచ్‌లో తిరిగిన రోజు గుర్తుకొచ్చింది. బహుశా, కాంతంకి అతడంటే అభిమానం ఏర్పడిందేమో ఎవరికి తెలుసు? అయితే, ఆ విషయాన్ని బావతో చెప్పడమా, మానడమా అన్న సందిగ్ధత అతనిలో రేకెత్తింది. క్షణం యోచించాడు. తనని, కాంతం ఓ పురుగునిచూసినట్టే ఎందుకుచూస్తుందో అతనికి ఇప్పటికీ అర్థంకాలేదు. అయినా సరే-తాను ఆమెకి మేనమామ. తండ్రి తరువాత బాధ్యతగలవాడు తనే. అంచేత నిజాన్ని బావతో చెప్పడమే తనకర్తవ్యంగా భావించుకున్నాడు.

"ఈ రోజుల్లో డాక్టర్లకి, ఇంజనీర్లకి, గొప్ప గిరాకీవుంది బావా! అయినా, కాంతం అప్పుడే కాబోయే ఓ డాక్టర్ని ఎన్నుకుందేమోనని నాఅనుమానం..." అన్నాడు కాళిదాసు.

నరహరి ఉలిక్కిపడినట్టుగా లేచి కూచున్నాడు. కాళిదాసూ లేచాడు.

"అంటే, ఏంటి నీవుద్దేశం?" నరహరి కనుబొమలు ముడిపడ్డాయి. అతని అంతరంగంలో అసంఖ్యాకమైన ఆలోచనలు రేకెత్తినయ్. బహుశా, కాంతంకి ఉత్తరాలు రాస్తున్న మెడికల్‌స్టూడెంట్ గురించే కాళిదాసుకూడా చెపుతున్నాడని పించింది. వివరాలు తెలుసుకోవాలని అతనిలో ఆతృత పెరిగింది.

బావ ఆతృతచూసి కాస్తంత చకితుడయ్యాడు కాళిదాసు. అయినాసరే తాను చెప్పదల్చుకున్నది చెప్పేయాలనే నిర్ణయించుకున్నాడు.

"అక్కయ్యకి అనారోగ్యంగా వున్న రోజుల్లో కాంతం ఓ మెడికల్‌స్టూడెంటుతో బీచ్‌లో తిరగడం చూశాను. అప్పట్లో కొద్దిగా మందలించాను కూడాను. అయితే ఇప్పుడా పరిచయం ఎలావుందో నాకు తెలీదు."

"ఎవరో ఓ మెడికల్ స్టూడెంటు అమ్మాయికి వుత్తరాలు రాస్తుంటాడోయ్. బహుశా అతడే అయ్యుంటాడని నా అభిప్రాయం. నువ్వతన్ని చూశావా?"

"చూశానుగాబట్టే చెపుతున్నాను బావా!"

"ఎలా వుంటాడు?"

"మనిషి బాగానే వుంటాడు. కాని..." అర్థోక్తిలో ఆగిపోయాడు.

"కాని ఏవిటి?" కంగారుగా అడిగాడు నరహరి.

అసలు విషయం చెప్పడమా, మానడమా అని ఆలోచిస్తూనే వున్నాడు కాళిదాసు.

"ఆలోచనేమిటోయ్? చెప్పు..." అసహనంగా అడిగాడు నరహరి.

"అతను హరిజనుడు. ఈ వూరివాడే నట."

నరహరి తలపై పిడుగుపడినట్టయ్యింది. ఆపాదమస్తకం వణికిపోతున్నాడు. ఆ హరిజనుడెవరో ఇప్పుడతనికి అర్థమైపోయింది. ఇంత బతుకు బతికి చివరికి ఓ హరిజనుడికి తన కూతురినివ్వాలా? ఎంత అప్రతిష్ఠ? ఎంత నామోషి? తన కుటుంబగౌరవం, తన గౌరవంఏంకావాలి? అతని కళ్లుఅరుణారుణ కాంతిని పుంజుకున్నాయి. అతని మొహం చూస్తుంటే కాళిదాసుకే కంపరం కలిగింది.

"కాంతం!" అరిచాడు సుమారు. పరిసరాల్లో అతని కంఠం ప్రతిధ్వనించింది.

లోపలున్న కాంతం, కాంతమ్మ




ఇరువురూ ఒకేసారి వచ్చారు. కాంతం మొహం పాలిపోయి వుంది. శాంతమ్మ కంగారుపడుతోంది. కాశిదాసు మావయ్య ద్వారా ఏదో విషయం తప్పకుండా తండ్రికి తెలిసివుంటుందని, అందుకే ఆయన ఆవేశపడుతున్నాడని గ్రహించిన కాంతం లేడిపిల్లలా వణికిపోయింది తండ్రి మొహంచూసి.

"ఏం నాన్నా" మొహం దించుకునే అంది.

"నిజంచెప్పు. నీకు వుత్తరాలు రాస్తున్నది ఎవడు? ఆ గంగులుగాడి కొడుకేనా?" విసురుగా అన్నాడు. ఆ ఆవేశంలో ఎవరయినా వింటారేమోనన్న విచక్షణాజ్ఞానం అతనిలో లోపించిందేమో!

శాంతమ్మకి విషయం ఏమిటో అర్థంకాక విచిత్రచూపులు చూస్తోంది.

"ఏమిటండీ మీరంటున్నది?"

"నీ కూతుర్నే అడుగు. ఏం నిర్వాకం చేస్తోందో! మన కుటుంబానికీ, మనకీ అప్రతిష్ఠ తెచ్చేవిధంగా ఆ గంగులు వుండేవాడు కదూ మా బావదగ్గర... వాడి కొడుకు విశాఖలో డాక్టరీ చదువుతున్నాడు కదా...వాణ్ని మనమ్మాయి... ఛీ! ఛీ! చెప్పడానికే సిగ్గుగా వుంది" అంటూ ఆగిపోయాడు.

శాంతమ్మ విస్తుపోయింది. అది నిజమా, కాదా అన్న సందేహం ఆమెకి కలిగింది. తమ్ముడిపట్ల ఆమెకి పెద్దగా నమ్మకం లేదు. వాడే ఏదో కథఅల్లి వుంటాడనుకుంది.

"ఎవరు చెప్పారండీ మీకు. వీడేనా?" అంది తమ్ముణ్ని చూపిస్తూ.

"ఔను శాంతా. మనకి ఆత్మీయుడు

గాఁబట్టి నిజం చెప్పాడు. లేకపోతే..."

"నేను నమ్మను. అటువంటి పరిచయాలు జరగడానికి అవకాశం లేదు."

"నువ్వు చెపితే ఎలా? దాన్ని చెప్పమను. చూడెలా విత్తరచూపులు చూస్తోందో! ఏమే చెప్పు" కోపంగానే అన్నాడు నరహరి.

కాంతంకి ఏం చెప్పాలో చప్పున అవగాహన కాలేదు. నిజం చెపితే ప్రళయమే వస్తుందని ఆమెకి తెలుసు. మరోసారి మళ్ళీ తప్పించుకోవాలని తీర్మానించుకొంది.

"చెప్పవల్సిందేదో ఇంతకు ముందే చెప్పాను నాన్నా! గంగులు కొడుకు దాసుతో రెండుసార్లు అక్కడ మాట్లాడ్డం మాత్రం నిజమే. మన వూరివాడు గాఁబట్టి ఎలా తప్పించుకోవడం? అయితే నాకు వుత్తరాలు రాస్తున్నది మాత్రం అతడు కాదు." తొణక్కుండా చెప్పింది కాంతం. అది పచ్చి అబద్ధమే అయినా తాత్కాలికంగా తప్పించుకుందుకు చెప్పక తప్పలేదు. ఆమె ఇలా అబద్ధం చెప్పడం ఇది రెండోసారి.

నరహరి ఆవేశం కాస్త తగ్గింది. ఆ వ్యక్తి ఇంకెవరయినా ఫరవాలేదు. అంతేగాని అతడు హరిజనుడు అదీ ఈ వూరి గంగులు కొడుకు మాత్రం అయ్యుండకూడదనుకొన్నాడు.

"అయితే సరే! కాని ఆ వుత్తరాలు రాయడం ఎంతోకాలం సాగకూడదమ్మా! నీకోసారి చెప్పాను గుర్తుందా ఆ అబ్బాయినోసారి తీసుకురమ్మని!" సూటిగా ప్రశ్నించాడు నరహరి.

ఔనన్నట్టు తలూపింది కాంతం. సమాధానం చెప్పడానికి నోట మాట రాలేదు.

"ముసుగులో గుద్దులాటెందుకు? అటో ఇటో తేల్చుకుంటే పోయింది. నీ వివాహం జరిపించేయాలని చూస్తున్నానమ్మా."

"అలాగే నాన్నా!" అనేసి అక్కడి నుంచి వెళ్ళిపోయింది కాంతం. లోపలికి వెళ్ళి చెమ్మగిల్లిన కళ్ళను ఒత్తుకుంది.

పరిస్థితి ఓ పద్మవ్యూహంలా కనిపించిందామెకి. దాన్ని ఎలా ఛేదించడమో హరిబావే చెప్పాలి. అతడే చక్రం అడ్డు వెయ్యగల సమర్థుడు అనుకొంది.

కాంతమ్మ కూతురికి దగ్గరగా వచ్చింది. "అమ్మాయ్ కాంతం, అసలు విషయం ఏవిటే? ఒక్కసారి నీ మొహంలోని రంగే మారిపోయిందేవిటి?" ఆరాటంగా అంది.

"అబ్బే...ఏవీలేదమ్మా!" అనేసి పొడిగా ఓ నవ్వు నవ్వింది. ఆ నవ్వులో జీవంలేదు.

"నాదగ్గర నువ్వు సందేహించకమ్మా! నేను నీ కన్నతల్లిని..." తల నిమురుతూ అంది కాంతమ్మ.

"అమ్మా" ర్ద్ధస్వరంతో తల్లి ఒడిలో వాలిపోయింది కాంతం.

కాంతమ్మ స్తంభించిపోయింది. ఏం జరిగిందో ఆమెకి బోధపడలేదు.

"ఏమయ్యిందే?" ఆత్రంగా అంది.

కాంతం చప్పునవెళ్ళి తలుపు గడియ పెట్టి వచ్చింది. కాంతమ్మకి కూతురి ప్రవర్తన అబ్బురంగా కనిపించింది. ఆమెలో కనిపించని కంగారు చోటుచేసుకుంది.

"ఏవిటమ్మా కాంతం? నీ ప్రవర్తన నాకు భయం కలిగిస్తోంది. అసలు జరిగిందేవిటో స్పష్టంగా చెప్పు" అంది.

"అమ్మా! ఇది ఎందుకిలా జరిగిం





దంటే సంజాయిషీ నేను చెప్పలేను. కాని, నాన్నగారు అనుమానిస్తున్నదే నిజం" మెల్లగా అంది. ఇప్పటికయినా తల్లితో ఆ నిజాన్ని వెల్లడించడం అవసరమనుకుంది గాబట్టి నిజం చెప్పింది.

శాంతమ్మ శిలాప్రతిమే అయ్యింది.

"అంటే? ఆ అబ్బాయి గంగులు కొడుకా?" జీరవోయిన స్వరంతో అంది.

"ఔనమ్మా! నువ్వు వాల్తేరులో కె.జి. హాస్పిటల్లోవున్న రోజుల్లోనే మా పరిచయం ప్రారంభం. అతనివెంట ఎందరో అమ్మాయిలు తిరుగుతూ వుండటంతో నాలో అసూయ చెలరేగింది. కులం అన్నది మానవులు సృష్టించుకున్నదే గాని భగవంతుడిదృష్టిలో అందరూ ఒక్కటేనన్న దృక్పథం నా మనస్సుని యిట్టే మార్చేసిందమ్మా! అంతేకాదు–అతడి మాటల్లో మాధుర్యం, అణకువ, అన్నింటినీ మించి భవిష్యత్తులో అతడి అంతస్తు – వీటిని దృష్టిలో పెట్టుకుని అభిమానించాను. మా యిరువురి మధ్య ఓ విధమైన అనురాగం ఏర్పడింది. అయితే నేను ఎదుర్కోవాల్సిన పరిణామాలు ఘోరంగా వుంటాయని నాకు తెలుసు. కాని వాటి ముందు నాప్రేమే గొప్పదని నా భావం" అంటూ ముగించింది కాంతం.

శాంతమ్మ మొహంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు. కూతురు చేసినపనికి అంతులేని కోపం కట్టలు తెగి వస్తున్నా, కోపగించినందువల్ల ప్రయోజనంవుండదని ఆమెకి బాగాతెలుసు. తండ్రితోపాటు తనూ కోపగిస్తే కాంతంకి మరోమార్గం వుండదు ఏ అఘాయిత్యానికో పూనుకోవడం మినహా! అయితే, ఇప్పుడీ సమస్యని ఎలా పరిష్కరించడం? ఆమెకి అంతా అయోమయంగా తోచింది. "అమ్మా కాంతం" మెల్లగా అంది శాంతమ్మ.

కాంతం తల్లికేసి దీనంగా చూసింది.

"నీ మనసు మార్చుకో అమ్మా! అతణ్ణి మర్చిపో! నువ్వు డాక్టర్ భర్త కావాలనుకుంటే ఎంతడబ్బిచ్చి అయినా అటువంటి సంబంధం చూస్తాను. కాని మన కుటుంబానికి అప్రతిష్ఠతెచ్చే ఈ పనికి మాత్రం పూనుకోకు. బాగా ఆలోచించమ్మా తొందరేం లేదు" సౌమ్యంగా నచ్చజెప్పే ధోరణిలో చెప్పింది శాంతమ్మ.

కాంతం భారంగా ఓనిట్టూర్పు విడిచింది. స్త్రీ మనస్సుని మరో స్త్రీ అర్థంచేసుకోపోతే ఎట్లా అనుకుంది తల్లి గురించి.

"అమ్మా! స్త్రీ ఒక్కరికే మనసిస్తుందమ్మా! ఆ విషయం నీకూ తెలీంది కాదు. మనసు మార్చుకుంటే మిగిలింది శూన్యమే! మరోవ్యక్తికి యిచ్చేందుకు ఆ మనసే వుండదు" ఎంతో పరిజ్ఞానం వున్న మనిషిలా మాట్లాడింది కాంతం.

కాంతం మనసు మార్చడం ఇంక కష్టమేననుకుంది. ఈ పరిస్థితిలో సమస్యని శాంతంగా ఆలోచించడమే తప్పించి తానూ తొందరపడకూడదనుకుంది.

"సరేనమ్మా! నీ అదృష్టమో, దురదృష్టమో కాలమే చెప్తుంది. తల్లిగా నేను చెయ్యగలిగిందంతా మౌనంగా చూస్తూ వుండటమే పరిస్థితుల్ని. అంతకంటే నాకింకే శక్తీలేదు" అంటూ తలుపు తీసుకొని వెళ్ళిపోయింది శాంతమ్మ.

కాంతం నిర్లిప్తంగా మంచమ్మీద వాలిపోయింది. ఆమె మనసులో పెను తుఫాను ప్రారంభమయ్యింది.

* * *

మరుసటిరోజు వుదయం బస్సుకి కాళిదాసు వెళ్ళిపోయాక కాంతం హరిబాబు దగ్గరికి

బైలుదేరింది. క్రితం దినం జరిగిందంతా బావతో చెప్పేస్తేనేగాని ఆమె మనసు కుదుటపడ్డంలేదు.

కాంతం వెళ్ళేసరికి హరిబాబు కాఫీ తీసుకుంటున్నాడు. శివయ్య కాఫీ తీసుకోవడం ముగించి నరహరి దగ్గరికని బైలుదేరుతున్నాడు.

"రా కాంతం ! ఏమిటి సంగతి?" అన్నాడు హరి.

"ఏంలేదు. ఇలా వూరికేనే వచ్చా" అంటూ కూచుంది.

"నాన్న ఇంట్లోనేవున్నాడా కాంతం?" అడిగాడు శివయ్య.

"ఉన్నారు మావయ్యా"

"అక్కడికే బైలుదేరుతున్నాను" అంటూ బైటికొచ్చేశాడు.

"అరుణా! మీ అక్కొచ్చింది. కాఫీ పట్టా" కేకవేశాడు హరి.

"వచ్చినప్పుడంతా కాఫీలెందుకు?"

"నవనాగరికత మనకి నేర్పిన పాఠాల్లో యిదొకటి" నవ్వుతూ అన్నాడు హరిబాబు.

కాంతం పొడిగా మాత్రం నవ్వేసింది. ఆమె జీవరాహిత్యమైన నవ్వుని చూసి విస్తుపోయాడు హరిబాబు.

"అంత నిరుత్సాహంగా వున్నావేం కాంతం?" ప్రశ్నించాడు.

కాంతం బరువుగా ఓ నిశ్వాసం వదిలి జరిగిందంతా చెప్పింది!

"నాకెందుకో భయంగా వుంది బావా" అంది పేలవంగా.

హరిబాబు క్షణం ఆలోచించాడు.

"మీ నాన్నలో బొత్తిగా మార్పు రావడం లేదు కాంతం! పల్లెల్లో వుండి బైట ప్రపంచం చూడ్డానికి అవకాశంలేక ఇలా మార్పు రాకుండా వుండిపోతున్నారేమోనని నా అనుమానం. ఆరోజు మీ ఇంటికొచ్చి నేనిచ్చినవుపన్యాసం ఎందుకూ పనికొచ్చిందికాదు. కేవలం నాకంఠశోషే మిగిలినట్టుంది.అయినా నువ్వు నిరుత్సాహపడకు. ఏదో ఆలోచించి పరిష్కార మార్గం చూస్తాను" ధైర్యం చెప్పాడు హరిబాబు.

"బావా ! నా ఆశలన్నీ నీమీదే ఉన్నాయి. నా కలలకు ఓ రూపకల్పన చెయ్యాల్సింది నువ్వే"

"ప్రయత్నిస్తాను. నువ్వు ధైర్యంగా వుండు"

అరుణ రావడంతో అక్కడితో ఆ ప్రస్తావనకి ఫుల్‌స్టాప్ పడింది.

"ఏం అక్కా బావున్నావా?" కాఫీ అందిస్తూ అంది అరుణ.

"బాగానే వున్నానే. ఔనూ, నువ్వు రావడం మానేశావేం?"

"ఇవ్వాళ వద్దామనుకుంటుంటే నువ్వే వచ్చేశావు"

"పోనీ సాయంత్రంరా. నువ్వొచ్చినపుడు నసీమ్‌ని తీసుకురా"

"అసలు ప్రోగ్రాము కూడా అదే"

"అయితే మరేం... సాయంత్రం నాలుగు దాటాక వస్సేసరి. మీకోసం వుల్లి పకోడి వేయిస్తాను" మందహాసంతో అంది కాంతం.

"వుల్లి పకోడీ అంటే నాకెంతో ఇష్టం. నేను వస్తే నీకేమైనా అభ్యంతరమా కాంతం" చిలిపిగా అడిగాడు హరిబాబు.

"అభ్యంతరమని చెప్పానా ఏంటి? నువ్వూరా బావా" నవ్వేసింది కాంతం కాఫీ కప్పు ఖాళీ చేసి పెడుతూ.

"అక్కా...అమ్మ పిలుస్తోంది. పద" అంది అరుణ.

"వస్తాబావా" లేచింది కాంతం.

 

"వెళ్ళిరా కాంతం. నాకూ కాస్త వూళ్ళో పనుంది" అంటూ లేచాడు హరిబాబు.

* * *

శివయ్య వెళ్ళేసరికి నరహరి వాలు కుర్చీలో కూచుని సిగరెట్ కాలుస్తున్నాడు. శివయ్యని చూడగానే లేచి నుంచున్నాడు.

"రా బావా, రా! కూచో" అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

శివయ్య వచ్చి వాలుకుర్చీలో ఆశీసుడయ్యాడు. నరహరి అతనికి అభిముఖంగా మరో వాలుకుర్చీలో కూలబడ్డాడు.

"ఏవిటిలా అకస్మాత్తుగా విచ్చేశావు బావా?" అడిగాడు నరిహరి.

"రెండురోజులుగా ప్రయత్నిస్తున్నాను బావా, నీ దగ్గరికి రావాలని. కాని, వీలు పడ్డంలేదు. విషయం ఏమిటంటే, మన అరుణకి సంబంధం చూశాను. నీతో సంప్రదించి, నువ్వు 'వూఁ' అంటే వివాహం చేసెయ్యాలనుకుంటున్నాను. మేనమామగా అరుణ పెళ్ళి విషయంలో నాకెంత బాధ్యత వుందో, అంతకంటె ఎక్కువ బాధ్యత నీకుందన్న విషయం నేను మర్చిపోలేదు. నువ్వామెకి పెదనాన్నవుగాబట్టి..." అంటూ ప్రారంభించాడు శివయ్య.

నరహరి ఆశ్చర్యపోతూ శివయ్యకేసి చూశాడు. ఇంట్లోనే 'వరుడు' వుండగా, సంబంధం చూశానని శివయ్య ఎందుకంటున్నాడో ఒక పట్టాన బోధపడలేదు నరహరికి. ఇంతవరకూ అరుణ హరిబాబు అర్ధాంగి అవుతుందన్న తలంపుతోనే వున్నాడు గనుక, అలా ఆశ్చర్యపడక తప్పలేదతనికి.

"అదేవిఁటి బావా, సంబంధం చూశానంటున్నావు? నీ కోడలుగా చేసుకోవడం లేదా?" కళ్ళింతలు చేసుకుని ప్రశ్నించాడు.

శివయ్య బాధగా నిశ్వాసం వదిలాడు.

"అలా జరగాలనే నేను ఆశించాను బావా! కాని, విధి మరోలా వుంది. హరికి, అరుణకి కూడా అటువంటి తలంపేలేదట. ఒకేచోట పెరిగిన వాళ్ళు కావడం వల్ల భార్యాభర్తలుగా బ్రతకలేరట. ఈ ప్రతిపాదనకి వాళ్ళిద్దరూ వ్యతిరేకులుగా వుంటే మనం మాత్రం ఏంచెయ్యగలం? బలవంతపర్చి ఆ సున్నిత హృదయాల్ని గాయపర్చలేంకదా? అందుకనే అరుణకి విడిగా మరో సంబంధాన్ని వెదకాల్సి వచ్చింది"

"అదా సంగతి? ఏమిటో బావా! ఈ కాలపు యువతీ యువకుల మనస్తత్వాల్ని వూహించనే లేకపోతున్నాం. అయితే, హరిబాబుకి విడిగా సంబంధం చూశావా?"

"ఇంకా చూళ్ళేదుబావా!" ముక్తసరిగా అన్నాడు శివయ్య.

నరహరి మొహం విప్పారింది. కళ్ళల్లో కొత్తకాంతి పుంజుకుంది.

"ఇంకెక్కడో చూడ్డమెందుకు బావా? మా కాంతంని నీ కోడలిగా తీసుకెళ్ళు మీ ఇంటికి. మన రెండు కుటుంబాల సాన్నిహిత్యం మరింత బలపడుతుంది. నిజానికి ఈ తలంపు నాకు ఎన్నాళ్ళనించో వుంది. అయితే, అరుణ విషయం గుర్తుకొచ్చి, స్వంత మేనకోడల్ని చేసుకోవడం మానేసి మా అమ్మాయిని కోడలుగా చేసుకోవన్న సందేహం కలిగి నా తలంపుకి స్వస్తిచెప్పాను. కాని, ఇప్పుడు తల్లవని తలంపుగా పరిస్థితి అనుకూలించింది. అందుకే నా ఈ ప్రతిపాదన. నువ్వు కాదనవనే నమ్మకం నాకుంది బావా!" అన్నాడు నరహరి ఎంతో ఉత్సాహంగా.

శివయ్య మొహం పాలిపోయింది. "ఆ అవకాశమూ వుండకపోవచ్చును బావా!" అన్నాడు నీరసంగా.

"అంటే, ఏమిటి నీ ఉద్దేశం బావా?" సీరియస్‌గా మొహంపెట్టి అన్నాడు నరహరి. ఆ ప్రశ్న వేసిన వేళ నరహరి మెదడులో విహారం చేస్తున్న ప్రశ్న లెన్నో వున్నయ్.

"ఇప్పుడే నువ్వన్నావు గుర్తుందా బావా – ఈనాటి యువతీయువకుల మనస్తత్వాన్ని వూహించలేకపోతున్నామని. అది అక్షరాలా నిజం. మావాడేదో ప్రేమవ్యవహారంలో పడినట్టున్నాడు. సూచాయగా నాకు తెలిసిందేమిటంటే – ఓ తురక అమ్మాయిని ప్రేమించినట్టూ, వివాహం చేసుకోబోతున్నట్టూను...."

నరహరి నిర్విణ్ణుడయ్యాడు. తానాశించింది ఇలా ఒక్కసారి నీళ్ళుగారి పోయినందుకు బాధపడ్డమేగాక, హరిబాబు మతాంతర వివాహం చేసుకోబోతున్నందుకు మనసులోనే అసహ్యించుకున్నాడు కూడాను.

"ఏమిటో బావా నువ్వంటున్నది! హరిబాబులాంటి కుర్రాడు ప్రేమ వ్యవహారంలో పడ్డాడా? అదీ తురకమ్మాయిని ప్రేమించాడా? ఆశ్చర్యంగా ఉందిస్మా"

"ఆశ్చర్యమేముంది బావా? 'ప్రేమ' అన్నది రెండు మనసులకి సంబంధించిన అనుబంధం. దానికి మతం, కులం అన్న విచక్షణ ఉండదు"

"అంటే నువ్వు హరిబాబు ప్రేమ కలాపాన్ని సమర్థిస్తున్నావా బావా?"

"మనం సమర్థించినా, సమర్థించక పోయినా వారి ప్రేమకి అవరోధం ఉండదు. 'ప్రేమ' అన్న దానికి అంతటి మహత్తర శక్తి ఉంది బావా! మనం సమర్థించమనుకో... మనకే దూరమవుతారు. అటువంటి అవాంఛనీయ పరిస్థితి ఎందుకు తెచ్చుకోవడం చెప్పు"

"కాని, ఆ అమ్మాయి మతం వేరే కదా?" తెల్లబోయి అన్నాడు నరహరి.

"ప్రేమకి మతం, కులం అడ్డు రాదని ఇప్పుడే చెప్పాను కదా ? ఇది నవీన యుగం. నవగ్రహాల్ని పరీక్షించాలని మానవులు ప్రయత్నిస్తున్న యుగం. ఈ యుగంలో కూడా మనలో పాతుకుపోయిన ఛాందసపుటాచారాలు, వ్యవహారాలు, సంకుచిత భావాలు పటాపంచలు కాకపోతే నవీనయుగ నాగరికతకే కళంకం బావా! మనసులు కలసి మనుగడ సాగిస్తామని వారంటుంటే, మన మెవరం వాళ్ళని కాదనడానికి. కాదని ప్రయోజనం ఏముంటుందని ? అశాంతి, అనర్థాలు తప్పించి. నా వరకూ ఈ విషయం రాదేదనుకో. అబ్బాయే గనక నాముందీ ప్రస్తావన ఉంచితే సంతోషంగా అంగీకరిస్తాను"

"దాని పర్యవసానాలు ఎలా ఉంటాయో ఆలోచించావా బావా?"

"మనం ఆలోచించనవసరం లేదు. మనసులు కలిసినవాళ్ళే వాటిని ఎదుర్కొంటారు. వాళ్ళూ మనలాంటి స్వతంత్ర జీవులే! వాళ్ళూ సంఘంలో మనుషులే!" చిన్నగా మందహాసం చేస్తూ అన్నాడు శివయ్య.

శివయ్య విశాల మనస్తత్వానికి, అతని గుండె నిబ్బరానికి అచ్చెరువందాడు నరహరి.

"నీ విశాల హృదయానికి ఇవే నా జోహార్లు బావా" అన్నాడు నరహరి.

"జోహార్లు అర్పించడానికి నేనేం గొప్పవాణ్ని కాదుగాని, నాకు తోడుగా




నిల్చున వ్యక్తులు ఇంకా ముందుకు రావాలి మన వూరులాంటి పల్లెల్లో. అప్పుడే సమ సమాజం ఏర్పడ్డానికి అవకాశం ఉంటుంది"

నరహరి క్షణం ఆలోచనల్లోపడ్డాడు.

"సరేగాని బావా, అసలు విషయాని కొద్దాం. అరుణ వివాహం ప్రస్తుతానికి వాయిదా వెయ్యి. ఎందుకూ అంటే, కాంతంకి పెళ్ళి జరక్కుండా అరుణకి జరగడం ఎబ్బెట్టుగా ఉంటుంది. కాంతం అరుణకంటే పెద్దది కదా? ఈలోగా కాంతంకి సంబంధాలు చూస్తాను. నిశ్చయమైన వెంటనే ఇనువురి వివాహాలు ఒకే సారి జరిపించేద్దాం" అన్నాడు నరహరి.

శివయ్య గతుక్కుమన్నాడు. నరహరి ఇప్పుడు చెప్పేవరకూ ఈ విషయం తనకి గుర్తుకు రాలేదెందుకోననుకున్నాడు. నరహరి చెప్పిందాంట్లో సబబు లేకపోలే దనుకున్నాడు.

"నువ్వు చెప్పింది కూడా నిజమే! నేనంత దూరం యోచించకపోవడం నాదే పొరపాటు. క్షమించాలి మరి. అట్లాగే ఆగుదాం"

"ఇంతకీ అరుణకి చూసిన సంబంధం ఎవరో చెప్పావు కాదు బావా?"

"రామినాయుడు కొడుకు. ప్రస్తుతం బ్యాంకులో మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. మంచి భవిష్యత్తున్నవాడు"

"చాలా సంతోషం బావా! అన్నట్టు మరో విషయం నీతో చెప్పేయాలి. నా తమ్ముడు చనిపోయాడని వాడి కూతురికి, భార్యకి అన్యాయం చెయ్యను. వాడికి రావల్సిన వాటా వాళ్ళకిస్తాను. నన్ను పార్థం చేసుకోవద్దని మా మరదలుకి చెప్పు బావా!"

శివయ్య నిండుగా నవ్వేడు. అతనికి తెలుసు నరహరి ఎప్పుడో ఓసారి ఆ మాటంటాడని.

"పిచ్చి బావా! అది ప్రత్యేకంగా నాకు చెప్పాలా చెప్పు" అనేశాడు ప్రత్యేకతతో.

"మరి నేను వస్తా" లేచాడు శివయ్య.

"మంచిది బావా" తనూ లేచి నుంచున్నాడు నరహరి.

శివయ్య నిష్క్రమించాడు. నరహరి వెనక్కి వచ్చి వాలు కుర్చీలో కూలబడిపోయాడు. కాంతం పెళ్ళికోసం తొందరగా ప్రయత్నించాలని నిశ్చయించుకున్నాడు.

నరహరి పొలంవేపు వెళ్ళి తిరిగొచ్చాడు. అతని మెదడులో ఇప్పుడు కాంతం వివాహమే ప్రముఖంగా పని చేస్తోంది. శివయ్యతో సంబంధాలు మెరుగుపడ్డాయి కాబట్టి, అరుణ పెళ్ళిని తను కోరడంతోనే వాయిదా వేశాడు. మునుపటిలా వైషమ్యమే వుంటే ఆ వివాహం వెంటనే జరిపించేయడూ? అప్పుడు తనకి ఎంత చిన్నతనం? తన కూతురికి పెళ్ళి ఏర్పాటు చెయ్యలేక పోయాడని వూళ్ళో అందరూ తన వీపు వెనుక చెవులు కొరుక్కోరూ? ఇలా ఆలోచిస్తుంటే అతనిలో అసహనం పెరిగిపోతోంది.

కాంతం కాఫీ పట్టుకొచ్చి అందించింది. కూతురువేసి పరిశీలనగా చూశాడు. ఆమెకి పెళ్ళీడు ఎప్పుడో వచ్చేసింది. తనే ఆ విషయం పట్టించుకోలేదు సీరియస్‌గా...అనుకుని తనని తనే నిందించుకున్నాడు.

"అమ్మాయ్" మెల్లగా అన్నాడు కాఫీ సిప్ చేస్తూ.

"ఏమిటి నాన్నా"

"నీకు వుత్తరాలు రాస్తూండే ఆ

వాల్తేరబ్బాయిని ఓసారి రమ్మని రాయమన్నాను. రాశావా?"

"రాశాన్నాన్నా" తన కంగారు కనిపించకుండానే, అనేసింది చప్పున. మళ్ళీ తుఫాను ప్రారంభం కాబోతున్నదని భయంతో వణికిపోతోంది లోలోపలే.

"సమాధానం రాలేదా?"

"లేదు నాన్నా"

"మరో వుత్తరం రాయమ్మా! లేకుంటే అతడి అడ్రసు నాకివ్వ నేనురాస్తాను"

"ఎ...ఎందుకులెండి నాన్నా! నేనే మళ్ళీ రాస్తాను" ఆమె గుండెల్లో గుబులు బైలుదేరింది.

"విన్నావో లేదోగాని ఆయణకి సంబంధం కుదిరిపోయిందట. దానికంటే వయసులో పెద్దదానివి..నీకూ పెళ్ళి చేసెయ్యడం నా కర్తవ్యం. ఖచ్చితంగా ఆ అబ్బాయిని అడిగేస్తే సరి...ఏం ఆటంకం వచ్చినా మరో సంబంధం చూసి వివాహం చేసేస్తాను. ఇంక జాప్యం చెయ్యను"

కాంతం నిరుత్తరై మొహం దించుకుని నుంచుండిపోయింది. కూతురు బహుశా ఒడియంతో కుంచించుకుపోయి అలా మౌనం దాల్చిందనుకున్నాడు నరహరి.

"సరే వెళ్ళమ్మా ఇవ్వాళే ఓ వుత్తరం రాసెయ్" అన్నాడు.

కాంతం అలాగే అన్నట్లు తలాడించి తండ్రి ఖాళీ చేసిన గ్లాసుని పట్టుకుని లోపలికి వెళ్ళిపోయింది. ఇప్పుడేం చెయ్యాలో ఆమెకి అవగాహన కాలేదు. అయోమయావస్థలో కాస్సేపు కూచుండిపోయి దాసుకి వుత్తరం రాయడానికి లేచింది.

* * *

ఉదయం పదకొండు గంటలు కావస్తోంది. హరిబాబు పోస్టాఫీసుకి వెళ్ళి రావడానికని బయల్దేరాడు. హుస్సేన్ యింటి దగ్గర చిన్న గుంపు చేరి వుండటం చూస్తూనే అతనికి ఏం జరిగిందోనన్న ఆత్రుత కలిగింది. దగ్గరగా వెళ్ళాడు. హుస్సేన్, ఎదురుగా ఓ ముగ్గురు వ్యక్తులు కూచుని వున్నారు. వాళ్ళు వూరికి కొత్తవారే...ముస్లిముల్లాగే వున్నారు. వారితో వుద్రేకితుడై మాట్లాడుతున్నాడు హుస్సేన్. అతనిలో ఎప్పుడూ చూడని ఆవేశాన్ని చూస్తున్నాడు హరిబాబు ఆరోజు.

హరిబాబుని చూడ్డంతోనే హుస్సేన్ తన వాగ్వాదిని ఆపేసి—

"రండి బాబూ! మీరే న్యాయం ఆలోచించండి" అంటూ కాస్త ముందు కొచ్చి హరిబాబుని తీసుకెళ్ళి కూచోబెట్టాడు హుస్సేన్.

అనుకోని ఈ సంఘటనకి అవాక్కయి మంత్రముగ్ధుడిలా వెళ్ళి కూచున్నాడు హరిబాబు. మనసులో అతనికీ ఆరాటం వుంది-విషయం ఏవిటో తెలుసుకోవాలని.

"ఏం జరిగిందండీ?" అడిగాడు హరిబాబు.

"వీళ్ళు పట్నం నుంచి వచ్చినారు హరిబాబూ! నాకు బంధువులు" అని వాళ్ళకేసి తిరిగి "ఇన్‌సే మిలియే...మా వూరి పంచాయితీ ప్రెసిడెంటు గారబ్బాయి హరిబాబు. పట్నంలోనే పెద్ద చదువు చదివొచ్చారు" అంటూ పరస్పరం పరిచయం చేశాడు హుస్సేన్.

"నమస్కారం" అన్నాడు హరిబాబు.

వాళ్ళు ప్రతినమస్కారం చేశారు.

"ఇంతకీ, యిప్పుడు సమస్య ఏవిటి హుస్సేన్‌గారూ? మీరంతగా వుద్రిక్తులై మాట్లాడ్డానికి కారణం ఏవిటి?"

హుస్సేన్ కాస్తంత సిమితపడ్డాడు. అయినా, అతని మొహంలో అసహనపు ఛాయలు దోబూచులాడుతూనే వున్నయ్. "చూడండి బాబూ! మీరు చిన్నవారే అయినా చదువుకున్న వారు, తెలివితేట లున్నవారు. అందుకే మీతో నాగోడు చెప్పుకున్నా నష్టం లేదనిపిస్తుంది. అసలు విషయం ఏంటంటే హరిబాబూ, మా అమ్మాయి నసీమ్‌కి ఓ సంబంధం నిశ్చయ మయ్యింది పట్నంలో. ఆరోజు మనం బస్సులో కలిశాం, గుర్తుందా? అప్పుడు వెళ్ళడం ఆ పనిమీదే. అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకున్నాడా వరుడు. అతడో చిన్న వ్యాపారి. పెద్ద బాదరబందీలేమీ లేవు. ఆ సంబంధం నాకూ నచ్చింది. పెళ్ళి జరపడానికి ఆర్నెల్లు గడువడిగాను నేను. పైకం సర్దుబాటు చేసుకోవాలి కదా! వాళ్ళు సరే నన్నారు. మా అమ్మాయికి పెళ్ళి నిశ్చయ మైనట్టు చాలా మందికి తెలిసిపోయింది కూడాను. కాని యిప్పుడేమో వాళ్ళు ఈ సంబంధాన్ని రద్దు చేస్తున్నట్టు ఇదిగో వీళ్ళద్వారా కబురంపించారు. ఇది ఏమైనా సబబుగా వుందా చెప్పండి" బాధ పడుతూ అన్నాడు హుస్సేన్.

హరిబాబుకి ఆ వార్త అమృతపు జల్లులా వినిపించింది. తాను ఏది కోరు కుంటున్నాడో అది తన ప్రయత్నంగాని, నసీమ్ ప్రయత్నంగాని, ఏమీ లేకుండానే అక్షరాలా జరిగిపోతున్నందుకు అతని హృదయం ఉప్పొంగిపోయింది. అది కేవలం భగవద్విలాసమనుకున్నాడు.

"అలా రద్దుచేసుకోడానికి అసలు కారణం ఏం చెబుతున్నారండీ హుస్సేన్



గారూ?" అన్నాడు హరిబాబు.

"మనసు మార్చుకోవాలందే కారణాలకి కొదవేంటి బాబూ! నా భార్య హిందూ స్త్రీ అట. అందుకని మా అమ్మాయి స్వచ్ఛమైన ముస్లిముకాదట. అది యిటీవలే వారికి తెలిసిందట. ఇదీ కారణం హరిబాబూ. నిశ్చయమైన సంబంధం యిలా తప్పిపోతే ఆడపిల్ల గలవాళ్ళకి ఎంత అప్రతిష్టో మీరే ఆలోచించండి. అప్పుడు సవాలక్ష సందేహాలొస్తాయి అందరికీను, ఎందుకు పెళ్ళి రద్దయ్యిందా అని? నిజానిజాలు ఎవరూ ఆలోచించరు. నాబాధంతా ఆదేనండీ" అంటూ తన తపనని నివేదించుకున్నాడు హుస్సేన్.

హుస్సేన్ చెప్పింది విన్నాక మరీ ఆశ్చర్యపోయాడు హరిబాబు. హుస్సేన్ భార్య ముంతాజ్ హిందూస్త్రీ అని ఇంత వరకూ ఎవ్వరికీ తెలీదు.

"ఇంతకీ వాళ్ళు వెలిబుచ్చిన సందేహంలో ఎంతవరకూ నిజం వుంది హుస్సేన్‌గారూ?"

హుస్సేన్ భారంగా ఓ నిట్టూర్పు విడిచాడు. "అదంతా పెద్ద కథ హరిబాబూ! వాళ్ళకి కలిగిన ఆ సందేహంలో అబద్ధం ఏమీ లేదు. నేను విజయనగరంలో వున్న రోజుల్లో నా టైలరింగు షాపు బాగా నడిచేది. ఆ ఇంటి యజమాని కూతురే నా అర్ధాంగి ముంతాజ్. పూర్వాశ్రమంలో ఆమె పేరు మనోరమ. మా యిరువురి మనసులూ కలిశాయి. అయితే పెద్దల ఆశీర్వాదం లేనిదే ఎలా వివాహం చేసుకుంటాం? నాకు ఎవ్వరూ లేరు. కాని, ఆమె తలిదండ్రులు మా ప్రేమ విషయం వింటే వుగ్రరూపం దాలుస్తారని మాకు తెలుసు. అందుకే మేం రిజష్టరు మారేజ్ చేసుకున్నాం. అంతే! మనోరమ తలిదండ్రుల వద్దకు ఆశీర్వదించమని వస్తే వాళ్ళు మమ్మల్ని కసిరికొట్టారు. అసహ్యించుకున్నారు. శాపనార్థాలు పెట్టారు. ఫలితంగా మేం విడిగా నా ఇంట్లో కాపురం పెట్టాల్సి వచ్చింది. అంతేకాదు నా దుకాణం వాళ్ళింటినుండి తొలగించాల్సి వచ్చింది. ఆ పరిస్థితుల్లో నా స్నేహితులు సన్నాదుకున్నారు. మీ నాన్నగారి బంధువొకాయన నన్ను మీ నాన్న దగ్గరికి పంపించేరు. మీ నాన్నగారు ఎంతో ఆనందంతో నన్నాదుకుని ఈనాటి నా ఈ ఔన్నత్యానికి కారకులయ్యారు. ఇదీ కథ...అవన్నీ ఇప్పుడు గుర్తు చేస్తూ మా అమ్మాయి జీవితాన్ని నాశనం చేస్తామంటే ఎలా? మళ్ళీ మా అమ్మాయికి సంబంధాలురావొద్దూ?" అంటూ తనపూర్వ చరిత్ర చెప్తూ వాపోయాడు హుస్సేన్.

"వాళ్ళు రద్దు చేసుకుంటున్నామంటే మీరు మాత్రం యింకేం చెయ్యగలరండీ? ఏదో బలవంతంగా వారిని ఒప్పించి పెళ్ళి జరిపించినా మీ అమ్మాయి అక్కడ సుఖపడుతుందన్న నమ్మకం ఏవిటి చెప్పండి!" అంటూ తన అభిప్రాయం చెప్పాడు హరిబాబు.

"చాలా బాగా చెప్పారండీ బాబుగారూ'' అన్నారు ఆ వచ్చిన ముగ్గురూ ముక్తకంఠంతో.

హుస్సేన్ మొహం పాలిపోయింది. "అలా అయితే మా అమ్మాయికి వివాహమయ్యేదెట్లా? ఇదే కారణం ప్రతీ ముస్లిము యువకుడూ, లేదా అతని తలిదండ్రులూ ఎత్తి చూపిస్తే మా నసీమ్ భవిష్యత్తు ఏం కావాలి? ఆమె జీవితం అడవిగాచిన వెన్నెలే కావాలా? ఆమె కలలన్నీ చెదిరిపోవడమేనా? తండ్రిగా నా బాధ అర్థంచేసుకోండి" ప్రాధేయపూర్వకంగా




అన్నాడు.

"అలా అధైర్యపడకండి హుస్సేన్ గారూ! అందరూ ఒకేలా వుండరు. విశాల హృదయులు కొందరుంటారు...వాళ్ళల్లో ఎవరైనా ముందుకు రావొచ్చు"

"మీకు తెలీదండీ హరిబాబుగారూ! మాలో మతపరమైన పట్టుదల అధికం. మా ఆవిడ హిందూ స్త్రీ అని ముస్లిములు రాక, నేను ముస్లిమునని హిందువులు రాకపోతే ఇంక మా అమ్మాయికి పెళ్ళి జరిగేది ఎట్లా?" అన్నాడు మళ్ళీహుస్సేన్. అతనికి ఓ విధమైన నిస్పృహ వచ్చేసింది. ఓసారి ఎప్పుడైతే ముంతాజ్ విషయం బైటికి పొక్కిందో అది అలా కార్చిచ్చులా వ్యాపిస్తుంది. అంచేత ఏముస్లిము యువకుడూ ముందుకు రాడన్నది ధృవ పర్చుకున్నాడు హుస్సేన్. అందుకే హిందువు ప్రసక్తి తీసుకొచ్చాడు.

ఆడబోయిన తీర్థం ఎదురైనట్టుగా తనకీ అనుకూల వాతావరణం అందు బాటుకి వచ్చినందుకు లోలోన మురిసి పోయాడు.

"అయితే హుస్సేన్‌గారూ!హిందువుల సంబంధం వస్తే మీకేం అభ్యంతరం వుండదంటారు ఏం?" అన్నాడు వుత్సాహంగా చూస్తూ హరిబాబు.

హుస్సేన్ దీనంగా చూశాడు.

"మరేం చెయ్యమంటారు చెప్పండి? అంతకంటె వేరేమార్గం లేదుగా? అదీగాక నాకు ఎటువంటి విచక్షణా లేదు. నేను మసీదుకి వెళ్తాను, నమాజ్ చేస్తాను. అప్పు డప్పుడూ రామాలయానికి వెళ్తుంటాను. ప్రార్థన చేస్తుంటాను. అంచేత ఎవరైనా ముందుకు రావాలేగాని యోగ్యతను చూసి మా అమ్మాయినివ్వటానికి నాకెట్టి అభ్యం తరమూ వుండదు. ఇది మావాళ్ళ సమ క్షంలోనే ధైర్యంగా చెప్తున్నాను" అన్నాడు హుస్సేన్. అతనిలో ఒక విధమైన తెగింపు వచ్చినట్లుంది.

పట్నంనించి వచ్చిన ఆ ముగ్గురూ తెల్లమొహాలు వేశారు. అయినా సరే, మరేం అనగలిగే ధైర్యం లేకపోయింది. ఏ మొహం పెట్టుకుని అనగలరు?

"హుస్సేన్‌గారూ! అయితే పట్నం సంబంధం విషయం తెలిపోయినట్టేనా?"

"అదేకదండీ మరి. ఆ ప్రసక్తే లేదు మరి"

"అయితే మీరు మరోలా అనుకో పోతే నేను మీ అమ్మాయిని వివాహం చేసుకుంటాను మీరు అంగీకరిస్తే. ఏమంటారు?" ధైర్యాన్ని కూడదీసుకుని అన్నాడు హరిబాబు.

హుస్సేన్ షాక్ తిన్నట్టయినా క్రమంగా అతని మొహంలో వేయి సూర్యులు వుదయించినంత కాంతి పుంజు కుంది. అతను కలలోకూడా వూహించని ఈ సంఘటనకి ఆశ్చర్యానందాలతో తికమకపడ్డాడు. హరిబాబులాంటి వ్యక్తి తనకూతుర్ని వివాహం చేసుకోడానికి ముందుకొస్తుంటే, కాదనే మూర్ఖత్వం, తెలివితక్కువ తనం తనలో లేదు – అదీ తానిప్పుడున్న పరిస్థితుల్లో.

"మీ అమ్మా నాన్నా ఒప్పుకుంటారా బాబూ?" అడిగాడు ప్రసన్న వదనంతో.

"ఆ విషయం నాకు వదలండి. నేనేవో తంటాలు పడతాను" సూటిగా సమాధానం చెప్పాడు హరి.

పట్నం నించి వచ్చిన ఆ ముగ్గురు ముస్లిములు ఒక విధంగాచూస్తే అసూయతో హరిబాబు కేసి చూశారు.

"మీ హిందువులందరూ మిమ్మల్ని వెలివెయ్యరూ?" అన్నారు.

"వెలివేయనివ్వండి. మాకు నష్టంలేదు. అసలు వెలివెయ్యడమెందుకూ? మనుసులు కలిశాక వారికి మతం, కులంతో పనివుండ కూడదు. అదే నిజమైన ప్రేమ. అటువంటి ప్రేమను అవరోధపచ్చిన వాళ్ళను దేవుడు క్షమించడు"

"అంటే మీరు వీళ్ళమ్మాయిని ప్రేమిస్తున్నారా?" వాళ్ళే మళ్ళీ అడిగారు.

"ఔనండీ! కాని మేం ఎప్పుడూ మాట్లాడుకోలేదు. సినిమాల్లో ప్రేమికుల్లా డ్యూయెట్లు పాడుకోలేదు. కాని మేం ఒకర్నొకరం ప్రేమిస్తున్నామని మాత్రం మాకు తెలుసు. మాది స్వచ్ఛమైన ప్రేమ"

"అయినా మా మతం ఒప్పుకోదు. హుస్సేన్‌గారూ..మీరు ఒప్పుకోకండి.మన వాళ్ళు హర్షించరు" అన్నాడా ముగ్గుర్లో ఒకాయన.

హరిబాబు మొహం ఆవేశంతో ఎర్ర బారింది.

"ఒప్పుకోవద్దని ఆయనకి చెప్పడానికి మీరెవరండీ? అసలు మీకు వున్న అధికారం ఏమిటి? ఒకసారి నిశ్చయమైన మీ సంబంధాన్ని రద్దు చేస్తున్నట్టు చెప్పడానికొచ్చేరే! దాన్ని మీ మతపరమైన కట్టుబాట్లతో స్థిరంచెయ్యడానికి మీరెందుకు నడుం కట్టుకోలేదు?" ఎదురు ప్రశ్నలు వేశాడు హరిబాబు ధైర్యంగా.

"అమ్మాయి తల్లి హిందువుగాబట్టి"

"ఔనామరి. అందుకే ఒక హిందువు ముందుకొస్తున్నాడు ఆ అమ్మాయిని చేపట్టడానికి దీనికి మళ్ళీ మీ అభ్యంతరం ఎందుకూ? మీ కత్తికి రెండువేపులా పదునుంటుందా ఏమిటండీ?" విసుగానే అన్నాడు హరి.

 

వాళ్ళు ముగ్గురూ నిరుత్తరులై పరస్పరం మొహాలు చూసుకున్నారు. ఏం చెప్పాలో, ఏం చెయ్యాలో వారికి బోధపడలేదు. సున్నితమైన సమస్య వారి ముందుంది. దాన్ని ఎలా పరిష్కరించడం అన్నదే ఆ ముగ్గురికీ పట్టుకుంది.

హుస్సేన్ ఇంక తానో ప్రేక్షకుడిలా వూరుకోలేకపోయాడు. తనకున్నది ఒకే ఒక్క అమ్మాయి. ఆమె ఎవర్ని వివాహం చేసుకున్నా సుఖంగా జీవిస్తే అదే పదివేలు. నిజానికి ఆ వూరొచ్చింతర్వాత తాను జీవించింది హిందువులమధ్యనే... వారి సహకారంతోనే. ఆ వూళ్ళో తనని నిలబెట్టింది హరిబాబు కుటుంబమే. అటువంటప్పుడు ఆ కుటుంబంలోకే తన కూతురూ వెళ్ళడం సంతోషకరమైన విషయమే. అయితే అమ్మాయి అభిమత మేమిటో తెలుసుకోవాలనుకున్నాడు. పట్నంనించి వచ్చిన ఆ ముగ్గురికేసి తిరిగాడు.

"చూడండి భాయీ! మా అమ్మాయి 'నిక్కా' విషయంలో ఇంత చర్చ జరగడం అనవసరం. మీ అభిప్రాయాన్ని మీరెలాగూ చెప్పేశారుగాబట్టి ఇంకాసమస్య నాది. ప్రేమ విలువ నాకు తెలుసు. ఆ విలువతోనే నేనో హిందువుల అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాను. ఇప్పుడు ఆ విలువను దృష్టిలో పెట్టుకునే ఓ హిందువుని నా అల్లుడిగా చేసుకోడానికి నాకు అభ్యంతరం ఉండదు. అయితే మా అమ్మాయి అభిప్రాయం కూడా తెలుసుకోవాలికదా!" అంటూ లోపలిగదికేసి చూసి–

"నసీమ్ బేటీ..యిలారా" అన్నాడు

నసీమ్ లోపల పొంచివుండి అంతా వింటున్నదేమో చప్పున వచ్చింది–

"ఏం అబ్బా" అంటూ.

"మన హరిబాబూ, నువ్వు ప్రేమించుకున్నారని ఆయన అంటున్నాడు. నిన్ను పెళ్ళి చేసుకోడానికి ముందుకొస్తున్నాడు. నీకిష్టమేనా? నీకు యిష్టం లేకుంటే నేనూ అంగీకరించనమ్మా. చెప్పు" అని అడిగాడు సూటిగా ఆమె మొహంలోకి చూస్తూ.

పట్నంనించి వచ్చిన ఆ ముగ్గురు ముస్లిముల దృష్టి ఆమెకేసే కేంద్రీకరించి ఉంది. ఆమె ఏం సమాధానం చెబుతుందోనని వారి ఆతృత. హరిబాబు కుడా ఆరాటంతో చూస్తున్నాడు. నసీమ్ మొహంలో సిగ్గు తెరలు దోబూచులాడినయ్. మొహం దించుకుని యిష్టమేనన్నట్టుగా తలూపింది. అంతే! మెరుపులా లోపలికి తుర్రుమంది.

పట్నం ముస్లిముల మొహాలు మ్లానమయ్యాయి. ఇస్లాముకే అవమానమనుకుని విసుగా లేచారు.

"హుస్సేన్ భాయ్...మేం వస్తాం" అన్నాడందులో ఒకాయన.

"భోజనాల వేళలో వెళ్ళిపోవడం బేసబబుగా ఉంటుంది భాయ్. భోంచేసి వెళ్ళండి" అన్నాడు హుస్సేన్.

"ఏం ఫరవాలేదులే" అనేసి ముగ్గురూ అక్కణ్నించి నిష్క్రమించారు చరచరా.

హుస్సేన్ నవ్వుకున్నాడు. వాళ్ళలా వెళ్ళిపోయినందుకు ఏవిధంగానూ బాధ పడలేదు అతను.

"మరి నేనూ వస్తానండీ" లేచాడు హరిబాబు.

"హరిబాబూ! నీ నిర్ణయానికి నేనెంతో ముగ్ధుడనయ్యాను నా ఖుషి యింతా అంతాకాదు. అయితే మీరిద్దరూ ప్రేమించుకున్నట్టు నాకింతవరకూ తెలీదు. అంతా 'అల్లా' పరమేశ్వరుని విలాసం. లేకపోతే సరిగ్గా యిదే తరుణంలో నువ్వు రావడమేమిటి ఇక్కడికి? మా ఆవిణ్ణి నేను పెళ్లి చేసుకున్నాక హిందూ పేరు మార్చి ముస్లిము పేరు పెట్టాను. నువ్వూ మా నసీమ్ పేరును మార్చుకోవచ్చు. నిజంగా మా నసీమ్ నసీబ్ గలది. ఎంతో అదృష్టవంతురాలు. సమాజంలో ఇటువంటి బాంధవ్యాలు పెరిగితే ఐకమత్యతకి ఢోకా ఉండదు" అన్నాడు హుస్సేన్ అమితోత్సాహంతో.

"అవునండీ! మీరు చెప్పిందీ కరెక్టే! నా ఉద్దేశం కూడా అదేను. మతాంతర వివాహాలు, కులాంతర వివాహాలు జరుగుతూ ఉండాలి. అప్పుడే సమాజానికి పుష్టి ఏర్పడుతుంది. అరమరికలుండవు. నా స్నేహితుడు దాసు తెలుసుకదూ?"

"అంటే మీ గంగులు కొడుకేనా? ఇప్పుడు వా లైపులో డాక్టరీ చదువుతున్నాడు?"

"ఔను వాడే...వాడు కులాంతర వివాహం చేసుకోబోతున్నాడు"

"అట్లాగా! ఎవరుబాబూ ఆ అమ్మాయి?"

"తర్వాత మీకే తెలుస్తుంది. కొద్ది రోజులు ఓపిక పట్టండి"

"చాలా సంతోషంబాబూ! ఏది ఏమైనా మా పట్నం సోదరుల సమక్షంలో మీరు ముందుకొచ్చి వారికి మంచి గుణపాఠం నేర్పారు. మతం పేరిట ఎన్ని అన్యాయాలు చేస్తున్నారో చూడండి"

"వాళ్ళే పొరపాటు చెయ్యలేదండీ! ప్రతీ మతంలోనూ ఇటువంటి వాళ్ళుంటారు"

"సరేగాని హరిబాబూ! మీ వివాహ విషయంలో మీనాన్నగారితో మీరే సంప్రదిస్తారా లేక నేను వెళ్ళి అడగనా? నేను వెళ్ళి అడగడం సబబుగా వుండదేమో! అదీగాక, ఈ ప్రయత్నం ఏం బెడిసి

కొట్టినా నా పరుప్రతిష్టలు నాగావళిలో కలిసినట్టే!" అన్నాడు హుస్సేన్ అన్నీ ఆలోచించి.

"అదంతా నాకు విడిచిపెట్టండి హుస్సేన్‌గారూ! మీరీ విషయంలో ఏమీ కంగారు పడకండి. మా నాన్నగారి మన స్తత్వం ఎటువంటిదో మీకూ తెలుసు. ఆయన వుంటున్నది పల్లెకావొచ్చు. కాని మానసికంగా ఎంతో ఎదిగిన వ్యక్తి. ఆయన అంతరంగంలో సంకుచిత భావా లకి తావే వుండదు. సమాజం నిలవ నీరులా కలుషితమైవుండకూడదని, ప్రవాహంలా ముందుకు సాగాలని ఆయన అభిమతం. అంచేత, ఈ విషయంలోనూ ఆయన అంగీకరిస్తారనే నా నమ్మకం. ఒకవేళ ఏ కారణం చేతనయినా అంగీక రించలేకపోయారనుకోండి ... అప్పుడూ మీ అమ్మాయిని నేనుచేపట్టడం తథ్యం. వస్తా మరి" అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు హరిబాబు.

హరిబాబు మనస్తత్వానికి ముగ్ధుడై పోయాడు హుస్సేన్. ఇనుమడించిన ఉత్సాహంతో లోపలికిపోయి భార్యతో అంతా చెప్పేసరికి, ముంతాజ్ ఆనందానికి అవధుల్లేకపోయాయి. కూతుర్ని కౌగ లించుకుని ముద్దు పెట్టుకుంటూ –

"చాలా అదృష్టవంతురాలివమ్మా, నసీమ్" అంది. ఆమె కళ్ళల్లో ఆనంద భాష్పాలు ముత్యాల్లా మెరిశాయి.

హుస్సేన్ నిండుగా నవ్వుకున్నాడా రోజు.

* * *

శివయ్య రాత్రి భోజనం ముగించి, చుట్టకాల్చుకుంటూ, బైట వరండాలో కూచున్నాడు ఒంటరిగా. వెన్నెల పిండార బోసినట్టుగా వుంది. చిరు చలిగాలి వీస్తూండటంవల్ల వీధిలో ఎవ్వరూ అంతగా తిరగడం లేదు. నిశ్శబ్దంగా వుంది వాతావరణం.

హరిబాబు లోపల్నించి వచ్చి తండ్రికి అభిముఖంగా కూచున్నాడు. కొడుకు ఆ సమయంలో అలా రావడం వింతగానే తోచింది శివయ్యకి.

"నాన్నా..."

"ఏమిట్రా?"

"మీతో కొన్ని విషయాలు మాట్లా డాలి"

"చెప్పు..."

"ఇక్కడేనా?"

"ఎవరూ లేరుకదట్రా...చెప్పు" అన్నాడు శివయ్య మెల్లగా. అతను వూహించుకోగలిగాడు, అబ్బాయి మాట్లా డాలనుకుంటున్నది ఏమిటో. ఇంతకు ముందే సూచాయగా భార్యద్వారా విన్నాడు నసీమ్ విషయం.

"నా వివాహ విషయంలో నాకు పూర్తి స్వాతంత్ర్యం ఇస్తారన్న విశ్వాసం నాకుంది నాన్నా!" అంటూ ప్రారంభిం చాడు.

"కాదని ఎవరన్నారు?"

"మీలో సంకుచిత భావాలు లేవని, వుండవని నాకు తెలుసునాన్నా!"

"ఔను. అటువంటివాటిని నేను హర్షించను"

"కులాంతర వివాహాల్ని మీరు ప్రోత్సహిస్తారని భావిస్తాను."

"ఔను తప్పక ప్రోత్సహిస్తాను"

"మరి మతాంతర వివాహాల్ని?"

శివయ్యకి నవ్వాగిందికాదు. కొడుకు ఎంత తెలివిగా అసలు విషయాన్ని ప్రస్తావనకి తీసుకొచ్చాడో నన్న ఆనందమూ అతనిలో వెల్లివిరిసింది.

"వాటినీ ప్రోత్సహిస్తాను. అయితే, ఇరువేపులా సంఘర్షణ లేకుండా వుండే పక్షంలోనే! ఇంతకీ, అసలు విషయం ఏమిటో బైటపడకూడదన్నట్టా అబ్బాయ్? ఎందుకీ డొంకతిరుగుళ్ళు?" చిన్నగా మందహాసం చేస్తూ అన్నాడు. కొడుకు చేతనే ఆ విషయం చెప్పించాలని అతని అభిప్రాయం.

"నాన్నా! ఓ విషయంలో నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను."

"ఏమయ్యిందిరా. ఇవ్వాళ ఏమిటిలా మాట్లాడుతున్నావు?" తనకేమీ తెలీనట్టుగానే అన్నాడు ఆరాటంతో.

"మన అరుణతో తిరుగుతుంది ఆ హుస్సేన్‌కూతురు,.మీరు చూశారుకదా?"

"ఔను చూశాను. అయితే ఏమయ్యిందట?"

"ఆ అమ్మాయంటే మీకెటువంటి అభిప్రాయం వుంది?"

"సదభిప్రాయమే వుంది. పేరుకి ముస్లిం యువతిగాని, చూడ్డానికి అసలు సిసలు హిందూ యువతిలానే వుంటుంది."

"ఔన్నాన్నా! అలా అనుకున్నా తప్పులేదు. వాళ్ళమ్మగారు హిందువట."

ఆశ్చర్యపోయాడు శివయ్య. హుస్సేన్ భార్య హిందువని తనొక్కడికే తెలుసునని ఇన్నాళ్ళూ అనుకునేవాడు. కాని, ఇప్పుడు ఆ నిజం హరికి ఎట్లా తెలిసిందా అని విస్తుపోయాడు.

"నీకెట్లా తెలుసు.?"

"హుస్సేన్‌గారే చెప్పారు"

"సరే...బాగానే వుంది. అయితే, ఏమంటావ్?"

"ఆ అమ్మాయిని కోడలుగా చేసుకోడానికి మీకేమైనా అభ్యంతరమా?" మొహం దించుకునే అడిగేశాడు ధైర్యాన్ని కూడదీసుకుని.

"ఏవిటీ? ఆ తురకలమ్మాయినా నువ్వు ప్రేమించింది? నీకేమన్నా మతిపోయిందా ఏవిట్రా?" గర్జించినట్టన్నాడు శివయ్య.

స్తంభించిపోయాడు హరిబాబు. తండ్రి మొహంలోకి కంగారుపడిచూశాడు.

"అదేవిటి నాన్నా! ఇప్పుడేకదా చెప్పారు. మతాంతర వివాహాన్ని ప్రోత్సహిస్తానని మళ్ళీ ఇలా మారిపోయారేవిటి? తెల్లబోతూ అన్నాడు.

"నాయకుల పనేవిటి? ఒకరికి చెప్పడం వరకే కదా? వాళ్ళ వరకూ వస్తే, చెప్పింది-చెయ్యరు. మరి, నేనూ ఆకోవకి చెందినవాణ్నేగా! అందుకే, ఆచరణలో పెట్టడం మనకి ఆనవాయితీ కాకూడదు" ఖచ్చితంగా చెప్పాడు.

హరి మొహంలో నిరుత్సాహం, నిస్పృహ ఛాయలు దోబూచులాడినాయి.

"కాని... కాని మీరు అంగీకరిస్తారన్న నమ్మకంతో,విశ్వాసంతో ఆమెను వివాహం చేసుకుంటానని మాటిచ్చా నాన్నా! అసలు జరిగిందేవిటంటే.."అంటూ నసీమ్ వివాహం నిశ్చయమవ్వడం, వాళ్ళొచ్చి మళ్ళీ రద్దు చేసుకోవడం, హుస్సేన్ బాధపడ్డం, తాను మాటివ్వడం-ఇవన్నీ ఎలా యాంత్రికంగా జరిగిపోయాయో సవివరంగా చెప్పాడు హరిబాబు.

"ఈ పరిస్థితుల్లో నేనూ వెనక్కిపోతే ఆ అమ్మాయి ఏ అఘాయిత్యానికో పూనుకోవడం మినహా మరో మార్గముండదు నాన్నా. అంతేకాదు నేనూ మొహమెత్తుకు ఇళ్ళో తిరగలేను...." ఆవేశనాభరితంగా అన్నాడు హరిబాబు.

శివయ్య ఒక్కసారి నవ్వేశాడు.

"ఒరేయ్ హరీ! నీ చర్యను నేనెంతగానో హర్షిస్తున్నాన్రా! నసీమ్‌లాంటి అందగత్తె, అణకువగల అమ్మాయి ఈ ఇంటికోడలు కాబోతున్నందుకు నేను గర్విస్తున్నాను. ఒక ముస్లిమ్ యువతిని మనింటికోడలుగా చేసుకుంటున్నందుకు ఎవరేం అనుకున్నా, చెవులు కొరుక్కున్నా మనం లక్ష్యపెట్టకూడదు. నిస్వార్థంతో మనం ఓ మంచి పనిచేస్తున్నపుడు ఒకరికి భయపడకూడదు. న్యాయబద్ధంగా ఒకరికి హాని కలిగించకుండా వుండే ఏ చర్య అయినా మనకి తృప్తిని కలిగిస్తుంది. మనలాంటి వాళ్ళమే అటువంటి మార్పుకి మార్గదర్శకులం కావాలి. ఆదర్శజీవులం కావాలి. నిజం చెప్పాలంటే ఈ విషయం నేను ముందుగానే పసిగట్టాను. అయితే నీవుగా చెప్పవలసినరోజు తప్పకుండా వస్తుందని ఎదురుచూశాను. నేను పోయి హుస్సేన్‌తో మాట్లాడుతాలే" అంటూ ముగించాడు శివయ్య.

హరిబాబు సంతోషం చెప్పనలవికాదు. "మీరెంత సహృదయులు నాన్నా! మీలాంటి తండ్రులే అందరికీవుంటే ఎందరో ప్రేమెకజీవుల జీవితాలు నందనవనాలయ్యేవి. హుస్సేన్‌గారు ఈ విషయంలో ఆరాటంజెందుతూ వుంటారు. మీరువెళ్ళి మీ అభయం ఇవ్వండి నాన్నా"

"అలాగేలేరా. రేపు సాయంత్రమే వెళ్తాలే నిజానికి అతడూ మన కుటుంబంలోని సభ్యుడిలాంటివాడే"

"మీ విశాలహృదయం పుణ్యమా అంటూ నా సమస్య పరిష్కారమయినట్టే. కాని నరహరి మావయ్య మనసు మీ మనసులాంటిది కాదు. అందుకే కాంతం జీవిత సమస్య ఎలా పరిష్కారమవుతుందో అయోమయంగా వుంది" కాంతం సమస్యకూడా పరిష్కరించాల్సిన నైతికబాధ్యత తనపై వుందిగాబట్టి అలా కదిపేడు ప్రస్తావన్ని.

శివయ్య సూటిగా కొడుక్కేసి చూశాడు. "కాంతం సమస్య ఏమిట్రా హరీ! నీలాంటిదే ఏదో ప్రేమ వ్యవహారములో చిక్కుకుందా అదీను" అడిగాడు శివయ్య.

"ఔను నాన్నా! అమెది కులాంతర వివాహ సమస్య"

"ఓస్ దానికేనా? ఈ రోజుల్లో కులాంతర వివాహాలు సాధారణమైపోయాయి. దానికోసం ఇంత కంగారెందుకు? అదో పెద్ద సమస్యగా పరిణమించడమేమిటి?" తేలికగా అన్నాడు శివయ్య.

హరిబాబు భారంగా ఓ నిశ్వాసం వదిలాడు.

"అసలు విషయం తెలీక మీరలా అంటున్నారు నాన్నా! తెలిస్తే అదెంత జటిలమయిన సమస్యో మీకే బోధపడుతుంది"

"ఏమిట్రా ఆ అసలు విషయం? ఎవరా అబ్బాయి?" అసహనంగా అన్నాడు శివయ్య.

"ఆ అబ్బాయి మన గంగులుకొడుకు దాసు నాన్నా"

"ఆ... దాసా?" కాస్తంత చలించినట్టయ్యాడు శివయ్య.

"ఔను నాన్నా దాసే. కాంతం అమధ్య వాళ్ళమ్మకి అనారోగ్యంగా వున్నపుడు వాళ్ళేరులో వుందికదా. అప్పట్లో వాళ్ళిద్దరూ తరచూ కలుస్తూ వుండేవారట. ఎందుకో మరి ఆమె అతణ్ని అభిమానించింది. వారి పరిచయం క్రమంగా అభివృద్ధి చెందింది. అయితే పర్యవసానాన్ని మాత్రం వాళ్ళు దృష్టిలో పెట్టుకోలేదు.




కాంతం ఇప్పుడు మన సహాయాన్ని అర్థిస్తోంది నాన్నా. వాళ్ళ నాన్న సంగతి మీకు తెలిసిందే కదా? మావయ్య మనసు మార్చడానికి నేనూ ఎంతో ప్రయత్నించాను పరోక్షంగా. కులాంతర వివాహాలూ, మతాంతర వివాహాలూ దేశానికెంతో మేలుచేకూరుస్తాయన్నాను. నామట్టుకు నేను ఓ ముస్లిము యువతిని పెళ్ళాడతానని కూడా చెప్పాను. ఇన్ని చెప్పినా వాటిని మనస్ఫూర్తిగా సమర్థించడం లేదు మావయ్య. అయితే సూటిగా చెప్పేయటం నాకిష్టం లేకపోయింది. మరి మీరే ఏదో ఆలోచించాలి నాన్నా!" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

శివయ్య గట్టిగా వూపిరిపీల్చుకున్నాడు. "గట్టి సమస్యేనా యిది. మనం ఆలోచించిన తీరులో అందరూ ఆలోచించరుకదా! అయినా మీ మామయ్య మనసు మార్చాలంటే అతడికి పదవులు ఎరగా చూపించాలి. పైవాళ్ళ మెప్పుకోలు అందించాలి" సాలోచనగా అన్నాడు శివయ్య.

హరిబాబుకి తండ్రిమాటల్లోని అంతరార్థం అవగాహనయ్యింది. ఎంతయినా అనుభవం వల్ల వచ్చే తెలివితేటలేవేరు. తండ్రికి కలిగిన ఆలోచనలు తనలో రాలేదే మరి! తనకి ప్రాపంచికానుభవం తక్కువ గాబట్టి. నిజమే మామయ్యకి పదవీ వ్యామోహం, పైఅధికారుల మెప్పుకోలు వ్యామోహం అధికమే! అయితే అదెలా సాధ్యం?

"అదేదో మీరే పథకం ఆలోచించాలి నాన్నా! కాంతం అమాయకురాలు. పరిస్థితి ఎదురు తిరిగితే ఆమె హృదయం

పగుల్తుంది. దాసుకూడా పరాయి వ్యక్తి కాడు. నాకు స్నేహితుడు. ఒకప్పుడు మీకు సన్నిహిత బంధువుగావుండే గంగులు కొడుకు. వాడి మనసూ దెబ్బతింటుంది. మీరే ఈ సమస్యను పరిష్కరించాలి"

శివయ్య క్షణంపాటు ఆలోచించాడు. అతని మెదడులో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది. చిన్నగా మందహాసం చేశాడు.

"సరేలేరా ! మన ఎమ్మెల్యేతోపాటు నేనెలాగూ హైదరాబాద్ వెళ్తున్నాను కదా! ఈ సమస్య పరిష్కారాన్ని అక్కడికి వెళ్ళాక చేస్తాను. తర్వాత చెప్తాలే" తృప్తిగా అన్నాడు శివయ్య.

హరిబాబు మరేం మాట్లాడలేదు ఆ విషయంలో. ఎందుకూ అంటే, తండ్రి అలా ఎప్పుడన్నాడో ఆయనప్పుడే ఏదో పథకాన్ని వేసుకున్నారని అవగతం చేసుకున్నాడు.

"సరేనాన్నా! మరి మీరు రేపు సాయంత్రం హుస్సేన్‌గారి దగ్గరికి వెళ్తున్నట్టేనా?" అన్నాడు.

"అది మర్చిపోను"

హరిబాబు అక్కడ్ణించి బైటపడ్డాడు. అరుణ దగ్గరికి వెళ్ళి విషయాన్నంతా చెప్పాడు. ఆమె ఎంతగానో మురిసి పోయింది. తన స్నేహితురాల్ని అభినందించడానికి తెల్లవారగానే వెళ్ళాలని నిర్ణయించుకుంది.

* * *

సాయంత్రం ఏడుగంటలు దాటింది హుస్సేన్ ఏదో అర్థంటు పనుంటే చేతికుట్టు కుడుతూ కూచున్నాడు.

అదేసమయంలో శివయ్య అక్కడికి వెళ్ళాడు. శివయ్యని చూడ్డంతోనే కంగారు పడిపోతూ లేచినుంచున్నాడు హుస్సేన్. అతని గుండెలు అప్రయత్నంగా జోరుగా కొట్టుకోవడం ప్రారంభించాయి. కొంపదీసి హరిబాబు నసీమ్‌ని పెళ్ళి చేసుకుంటానని చెప్పడం వల్ల తనని చీవాట్లు పెట్టడానికే ఇలా వచ్చివుంటారని లోలోపల శంకించాడు హుస్సేన్.

"నమస్కారం బాబుగారూ! దయ చెయ్యండి. మా ఇల్లు పావనమయ్యిందండీ మీ రాకతో. మీరే రావాలా? నాకు కబురంపితే నేనే వచ్చేవాణ్ణి కదండీ. కూచోండి" ఓ గుక్కలో అంతా ఏకరువు పెట్టాడు హుస్సేన్ - లోలోపల ఓ విధమైన భయం పీకుతూవున్నా.

శివయ్య కుర్చీలో ఆశీనుడయ్యాడు

"హూ. ఏమిటోయ్... ఎలా వుంది నీ దుకాణం పరిస్థితి" అన్నాడు గంభీరంగా శివయ్య.

"ఏదో, తమరి ధర్మమా అంటూ అంతా సజావుగానే వుందండీ! ఇదంతా మీరు పెట్టిన భిక్షేకదా" సవినయంగా అన్నాడు హుస్సేన్.

"అబ్బే! అలా అనకోయ్. ఇదంతా నీ శ్రమ ఫలితమే! సరేగాని, ఓవిషయం నీతో అడగాలని వచ్చానోయ్"

"చెప్పండి బాబుగారూ! మీరేంచెప్పినా చెయ్యడానికి సంసిద్ధంగా వున్నాను. సెలవియ్యండి"

"మరేం లేదోయ్. ఇది చాలా సున్నితమైన విషయం. మతపరమైన సమస్య. మా అబ్బాయి మీ అమ్మాయి నసీమ్‌ని ప్రేమించాడట. ఆమె కూడా మావాడంటే అనురాగంతో వుందట. ఇవన్నీ మావాడు చెప్పిందే. మీ అమ్మాయిని మా ఇంటి కోడలుగా చేసుకోడానికి నాకెటువంటి అభ్యంతరమూ లేదు. మరి, నీ విషయం

చెప్పు. మన మతాలు వేరయినా మనసులు ఒకటే. నీకు అంగీకారమైతేనే చెప్పు" లౌక్యంగా అడిగాడు శివయ్య.

అంతవరకూ మనసులో పీడిస్తున్న భయంతో అల్లల్లాడిపోతోన్న హుస్సేన్ ఆనందంతో ఎగిరి గంతులు వేసినంత వుత్సాహానికి లోనయ్యాడు. హరిబాబు చెప్పినట్టుగానే జరుగుతున్నందుకు మురిసి పోయాడు.

"బాబుగారూ! జీవితంలో ఎప్పుడైనా గొప్ప ఆనందాన్ని అనుభవించానంటే అది ఈరోజునేనని చెప్పుకోవాలి. మతపర మైన అడ్డంకులు ఏమీ లేవు. మీకు తెలుసు నా భార్య ఎవరో! మా మతం వాళ్ళు మా అమ్మాయి వివాహ విష యంలో ఎంత నిర్దయగా ప్రవర్తించారో అబ్బాయి చెప్పే వుంటాడు. అటువంటి పరిస్థితిలో నేను నా మతం గురించి ఎందుకు ఆలోచించాలి? క్లిష్ట సమయంలో మీరు నన్నాదుకున్నారు. నా జీవితానికో వెలుగు చూపారు. మీ ఆదరాభిమానాల వల్లనే యింతవరకూ వచ్చాను. ఇప్పుడు మా అమ్మాయి మీ కోడలవుతుందంటే, అంతకంటె గొప్ప ఆనందం మరోటి వుండదు నాకు. ఈవిధంగా మళ్ళీ మరో సారి మీ చేయూతనిస్తున్నారు. మీ రుణాన్ని ఈ జన్మలో తీర్చుకోలేను. ఇక మతం అంటారా? నేను జీవించింది మీ అందరి మధ్య. నా మతమన్నది నాకున్నా మత సామరస్యంతో మసలడమే నా కర్తవ్యం. ప్రేమకు, పెళ్ళిళ్ళకు,బంధుత్వా లకు, స్నేహానికి మతం, కులం అడ్డు రాకూడదని నా అభిప్రాయం" అంటూ తన అంగీకారాన్ని తెలియజేశాడు హుస్సేన్.

"చాలా సంతోషం హుస్సేన్. మనం ఇలా వియ్యంకులమవుతామని కలలో కూడా అనుకోలేదోయ్. ఇది ఏనాటి అను బంధమో ఎవరికి తెలుసు"

"అది నిజమే బాబుగారూ! లేకుంటే యిదిట్లా జరిగివుండేది కాదు" అంటూ కూతుర్ని కేకవేశాడు.

నసీమ్ లోపల్నించి వస్తూనే-

"నమస్కారమండీ" అంది రెండు చేతులూ సవినయంగా జోడించి.

"నమస్కారం. ఇకనుంచి నువ్వు నన్ను 'మావయ్యగారూ' అని పిలవాలి తెలుసా?" నవ్వుతూ అన్నాడు శివయ్య.

నసీమ్ అలాగే అన్నట్టు తలూపి, సిగ్గు దొంతరలు అడ్డురాగా మొహం దించు కుంది.

"అమ్మాయ్!కాఫీ తీసుకురా"చెప్పాడు హుస్సేన్.

"ఇప్పుడెందుకు లేవోయ్"

"ఫరవాలేదు బాబుగారూ! రాకరాక మీరొచ్చారు. మాలాంటివాళ్ళం యింకే మిచ్చుకోగలం చెప్పండి"

"అబ్బ నీతో యిదే చిక్కోయ్. సరే తెప్పించు" అన్నాడు ముసిముసిగా నవ్వుతూ శివయ్య.

నసీమ్ లోపలికి వెళ్ళి అయిదు నిము షాల్లో కాఫీ తెచ్చి అందించింది.

శివయ్య కాఫీ తీసుకుని బైలుదేరాడు. "వస్తానోయ్ హుస్సేన్. మీ అక్కయ్యని తీసుకుని వస్తాలే తర్వాత" అంటూ వెళ్ళి పోయాడు.

హుస్సేన్ అతనితోపాటు పదడుగులు వెళ్ళి అతని దగ్గర సెలవు తీసుకుని యింటికొచ్చాడు. భార్యతో అంతా చెప్పే సరికి ముంతాజ్ ఆనందానికి అంతులేక పోయింది. సమస్య పరిష్కారమయ్యింది.. అదేచాలు అనుకుంది.

* * *



హరిజన వాడలోనివారికి వసతి సౌకర్యాలుకలిగించాలని ప్రభుత్వం నిర్ణయించి ఆ వూరికి ఓ లక్షరూపాయలు మంజూరు చేసినట్టు జిల్లా కలెక్టరు స్వయంగా చెప్పడం శివయ్యని ఆనందంలో ముంచెత్తింది.

''మరి, నది వుప్పొంగినపుడు పల్లపు ప్రాంతమైన హరిజన వాడ మునిగిపోకుండా వుండడానికి అక్కడో రాతిగట్టును ఏర్పాటు చెయ్యాలండీ. దానికి ప్రత్యేకంగా ఏమీ మంజూరు చెయ్యలేదా" అడిగాడు శివయ్య.

"ఈ పైకంలోనే అదీ కట్టుకోమన్నారు. మనం అది అడ్జస్టు చేసుకుందాం శివయ్యగారూ" అన్నాడు కలెక్టరుగారు.

"అలాగే కానివ్వండి సార్! అయితే మనం ఓ కంట్రాక్టర్ని చూసుకోవాలన్న మాట"

"ఆ బాధ్యత మీదేనండీ! పట్నం నుండి తీసుకెళ్తారో, లేక మీ వూళ్ళోనే ఏర్పాటు చేస్తారో మీ యిష్టం"

శివయ్యకి చప్పున నరహరిబావ గుర్తుకొచ్చాడు. అప్పట్లో నరహరితో అభిప్రాయ భేదాలున్న రోజుల్లో రామినాయుడికి కొన్ని అవకాశాలిచ్చినా, యిప్పుడు మళ్ళీ సన్నిహితంగా వుంటున్నారు గాబట్టి నరహరికే అవకాశం యిప్పించాల్సిన బాధ్యత తనకి వుందనుకున్నాడు.

"సరేసార్! ఆ ఏర్పాట్లు నేను చూసుకుంటాను"

"పునాదిరాయి ప్రారంభోత్సవానికి ఎవర్నయినా మంత్రిగారిని పిలుద్దామంటారా?"

"పిలిపిస్తే మంచిదే సార్! వూరి ప్రజలంతా హర్షిస్తారు. నేను మన ఎమ్మెల్యే గారితో హైదరాబాద్ వెళ్తున్నాను కదా! మంత్రిగార్ని కలుసుకుని, వారినే ఆహ్వానిస్తాను. వారిచ్చిన తేదీని బట్టి మనం మన ప్రోగ్రాము ఏర్పాటు చేసుకుందాం సార్"

"అలాగే కానివ్వండి శివయ్యగారూ"




శివయ్య కబురందుకుని నరహరి వచ్చాడు వాళ్ళింటికి.

"కూచో బావా" ఆప్యాయంగా అన్నాడు శివయ్య.

నరహరి శివయ్యకి అభిముఖంగా కూచున్నాడు.

"నువ్వు కబురు పంపించావంటే ఏదో విశేషం వుండే వుంటుందని వున్నపాటున వచ్చేశాను బావా" అన్నాడు నరహరి.

"ఔను! బావా విశేషం వుంది గాబట్టే కబురు పంపించాను"

"ఏవిటో అది"

"ఆతృత పడితే ఎలాగోయ్"చిన్నగా నవ్వేడు నరహరి.

"నాకు ఆరాటం అధికమవుతూ వుంటే నువ్వు నవ్వుతున్నావేంటి బావా?"

"విషయం ఏమిటంటే హరిజనవాడలో వసతి గృహాలు నిర్మించడానికి గ్రాంట్లు వచ్చేశాయట కలెక్టరుగారు చెప్పారు"

మెల్లగా అన్నాడు శివయ్య.

"అలాగా! అయితే, ఆ కాంట్రాక్టు ఎవరికిస్తున్నట్టు?" ఆతృతతో ప్రశ్నించాడు నరహరి కాస్త ముందుకువంగి.

"అక్కడే కొంత పేచీవస్తోంది"

"పేచీనా! దేని గురించి? ఎవరికయినా పర్సెంటేజి కావాలంటే పారేద్దాం బావా! అది మామూలేగా?"

"అటువంటి పేచీ అయితే దాన్ని వెంటనే పరిష్కరించేయొచ్చు. కాని, ఈ పేచీ కొత్త తరహాది..."

"ఏమిటో చెప్పమరి"

"హరిజనవాడలో వసతిగృహాలు గాబట్టి, కంట్రాక్టరుహరిజనుడేఅయ్యుండా లంటున్నారట..."

నరహరి ఆశ్చర్యంగా కళ్ళింతలు చేసుకుని శివయ్యకేసి చూశాడు.

"ఇటువంటిఆంక్షలు నేనెక్కడాఇంత వరకూ చూడలేదుబావా! వింతగావుందే! అసలు, ఇటువంటి భారీకాంట్రాక్టు తీసుకోవల్సినసోమత ఏ హరిజనుడికి వుంటుందంటావు?"తనసందేహాన్ని బైటపెట్టాడు.

"మనవూళ్ళో లేకపోవచ్చు. కాని, పట్నంలో వుండొచ్చు. హరిజనుల్ని వుద్ధరించాలని ప్రభుత్వం ఎన్నో పథకాలు తయారుచేస్తున్నదికదా! అందులో ఇది ఒకటయ్యుండొచ్చు. వాళ్ళకాస్తోమత లేకపోతే, గవర్నమెంటు బ్యాంకుల్నించి అప్పులిచ్చి కాంట్రాక్టరుగా నిలబెట్టినా ఆశ్చర్యంవుండదు" అన్నాడు శివయ్య.

నరహరి మొహం వాడిపోయింది. ఆ కాంట్రాక్టు ఎప్పటికియినా తనకే లభిస్తుందన్న ఆశతో వున్నాడతను. అయితే, ఇప్పుడు ప్రభుత్వం పెట్టిన ఈ ఆంక్షవల్ల తనకి దొరకదన్నది నిర్ధారణమైపోయింది.

"ఆ కాంట్రాక్టు మనం దక్కించుకోవాలంటే మర్గో మార్గమేదిలేదా బావా?"

"వున్నట్టేం అగుపించడంలేదు. అయితే, కలెక్టరుగారుదానికి అనుబంధంగా మరో సలహా చెప్పారు"

"ఏమిటది?"

"కాంట్రాక్టరు హరిజనుడు కాకపోయినా హరిజనులతో బంధుత్వం నెరపినవాడైనావుంటే ఫరవాలేదట. హరిజనులకంటే ఇటువంటివారికే ఎక్కువ విలువిస్తారట..."

నరహరి మొహం ఎర్రబారింది క్షణంలో. "ఛా!ఛా! ఈ వెధవకాంట్రాక్టు కోసం దిక్కుమాలిన ఆ హరిజనులతో బంధుత్వం నెరుపుతామా ఏమిటి? ఆ కాంట్రాక్టూవద్దు, గాడిదగుడ్డూ వద్దు..." ఆవేశంతో అన్నాడు నరహరి.

శివయ్య చిరునవ్వు చిందించాడు పెదవులపై, "ఆవేశపడకు బావా! ఒక్కొక్కప్పుడు పరిస్థితులు ఎటువంటి రూపం దాలుసాయంటే, మనం వూహించని వ్యక్తులతో స్నేహంచెయ్యొచ్చు. లేదా బంధుత్వమూచెయ్యొచ్చు. నా విషయమే ఆలోచిద్దాం. నేనింకా నీతోచెప్పలేదుగాని, నేను మన టైలరు హుస్సేనుతో వియ్యం జరుపుకుంటున్నాను తెలుసా?"

నరహరి స్తంభించిపోయినట్టు శివయ్యకేసి కన్నార్పకుండా చూస్తూ క్షణం వుండిపోయాడు.

"అంటే..."అని ఇంకేదో నరహరి అనబోతూవుంటే శివయ్య అందుకున్నాడు చప్పున.

"అంటే మా హరిబాబుకి హుస్సేన్ కూతుర్ని చేసుకుంటున్నాను బావా!"

"నిజంగానా?" నరహరి స్వరంలో మార్పు వచ్చేసింది.

"పరిహాసం కాదు బావా! వాళ్ల

ప్రేమించుకున్నారట. నాకు చూచాయగా ఆ విషయం తెలిసిందనుకో...ఏం చేస్తాం? బలవంతంగా వాళ్ళ ప్రేమబంధాన్ని తెంచడం వారి సున్నిత హృదయాన్ని గాయపర్చడమేననిపించింది. అందుకే నేనేం అనలేకపోయాను. మా వాడు ధైర్యంచేసి నాతో చెప్పాడావిషయాన్ని. తమని ఆశీర్వదించమని అర్థించాడు. అటువంటి పరిస్థితిలో ఏం చెయ్యాలో తోచలేదు. ఆ అమ్మాయిని చూశాను. మన అరుణ స్నేహితురాలు, సన్నిహితురాలు. అమ్మాయి రూపలావణ్యాల్లో ఎవ్వరికీ తీసిపోదు. ఏమాత్రం అసమ్మతి తెలిపినా, ప్రతిఘటించినా వాళ్ళు మనకి దూరమౌతారే తప్పించి మన ఆజ్ఞకు లోబడి ఉండరు. అదీ ఈతరంవాళ్ళ మన స్తత్వం. ఇవన్నీ ఆలోచించే నేనూ అంగీకరించాను. కులాంతర వివాహాలు, మతాంతర వివాహాలు నేనెప్పుడూ సమర్థిస్తాను. గొప్ప గొప్ప వ్యక్తులే వీటికి అతీతులు కాలేకపోయారని చరిత్ర చెబుతోంది. అదీగాక ప్రస్తుత సమాజంలో ఇటువంటి చైతన్యం రావాలి. రాకపోతే పురోగమనం ఉండదు. అటువంటి చైతన్యం మొదట మనలాంటి పెద్దల మనసులలో రావాలి. మనం మార్గదర్శకులం కావాలి. అందుకే హుస్సేన్ దగ్గరికి వెళ్ళి నా అభిప్రాయం చెప్పాను. మతపరమైన అడ్డంకులేమైనా ఉన్నాయేమోనని మొదట్లో భయపడ్డాను. అయితే అటువంటి అపరోధాలేవీ లేవనడమేగాకుండా హృదయపూర్వకంగా ఈ వివాహానికి అంగీకరించాడతను. మన అరుణ వివాహంతోపాటు వీళ్ళ వివాహమూ జరిపించేయాలని అభిప్రాయపడుతున్నాను" అంటూ వివరించాడు శివయ్య.

"ఎంత సాహసం చేస్తున్నావు బావా! దీని పర్యవసానం ఎలా ఉంటుందో ఆలోచించావా?" అన్నాడు నరహరి.

"అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను బావా! ఈ యుగంలో మనుషుల ఆచారవ్యవహారాల్లో, జీవనసరళిలో ఎన్నో మార్పులొస్తున్నాయి. చైతన్యవంతమైన మార్పురానిదే ఏ దేశమూ, ఏ జాతీ పురోగమించలేదు. ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటనే వున్నానన్న సమాధానం రాకూడదు. మరి కొన్నాళ్ళకి ఈ కులమతాల ప్రసక్తే ఉండవని నా ఉద్దేశం"

శివయ్య వాదనని హర్షించలేకపోయాడు నరహరి. అతనికి అది మొండి వాదనగానే అనిపించింది.

"సరేబావా! నీకున్న ధైర్యసాహసాలు, చైతన్యవంతమైన దృక్పథం అందరికీ ఉండవు. ప్రస్తుతం ఆ కాంట్రాక్టు విషయం ఆలోచించు. తర్వాత మిగతా విషయాలు ఆలోచిద్దాం" అన్నాడు నరహరి కాస్తంత అసహనంగా.

"సన్నింకేం ఆలోచించమంటావు చెప్పు! కలెక్టరుగారి అభిమతమేమిటో చెప్పనే చెప్పాను. ఆపైన నేను హైదరాబాద్ వెళ్ళినపుడు మంత్రిగారితో మరోసారి మాట్లాడుతాను"

"ఏదోవిధంగా మనకి వచ్చేట్టు చూడు బావా! ఇంత పెద్ద టెండర్ని ఎవరో అనుభవించడమేమిటి?"

"అలాగేలే. అన్నట్టు మరి కాంతం వివాహ విషయం ఏం జేశావు? అదీ నిశ్చయమైతే ఈ మూడు వివాహాలూ వైభవోపేతంగా ఒకేసారి చెయ్యొచ్చును కదా?"




"ఔను. నేనూ అదే అనుకుంటు న్నాను బావా!"

"నువ్వు మరోలా అనుకోపోతే ఓ విషయం చెప్పనా?"

"చెప్పుబావా! మనం పరాయివాళ్ళం గనకనా ఏమైనా అనుకోడానికి? నువ్వు మా శ్రేయోభిలాషివి... చెప్పు"

"సంబంధాల్ని వెదికేముందు కాంతంని అడుగు ఎవరినైనా ప్రేమించిందేమో! ప్రేమించినవాడు ప్రయోజకుడూ, యోగ్యుడూ అయితే అతణ్ని నిశ్చయిం చేద్దాం"

"అమ్మాయి ఎవర్నో ప్రేమించిందని నువ్వెట్లా పసిగట్టావు బావా?" ఆశ్చర్య పోతూ అడిగాడు నరహరి.

"ఇదేం దివ్యదృష్టి ప్రభావం కాదు గాని ఈ రోజుల్నిబట్టి అనుకోవడంఅంతే"

"నువ్వు వూహించింది నిజమే! ఎవరో మెడిసిన్ చదువుతున్న ఓ అబ్బాయిని ప్రేమించిందట వాళ్ళేరులో. పరస్పరం ఉత్తరాలు రాసుకుంటూ ఉంటారు"

"అయితే మరింకేం? ఆ అబ్బాయిని రప్పించు. లేదా నువ్వయినా వెళ్ళి నిశ్చయం చేసుకుని వచ్చెయ్. నన్ను రమ్మంటే నేనూ వస్తాను" అన్నాడు శివయ్య సౌమ్యంగా సలహాయిస్తూ.

"నేను రెండుసార్లు చెప్పాను అమ్మాయితో ఆ అబ్బాయిని రప్పించమని. ఏదీ ఇంతవరకూ ఆ అబ్బాయి జాడేలేదు. నేనే వెళ్లాల్సి ఉంటుందేమో"

"అయితే వెళ్ళోసారి. అవసరమైతే నేనొస్తాను లేదా హరిని తీసుకుపో"

"ఏ సంగతీ చెప్తాలే. మరి నేను వెళ్తాస్తా" లేవబోయాడు నరహరి.

"కూచోవోయ్! కాఫీ తీసుకోకుండా వెళ్ళేదెట్లా? కమలా... అరుణా" అంటూ కేకలు వేశాడు శివయ్య.

కమల వచ్చింది. వస్తూనే బావని పలుకరించిందికూడా.

"ఏమన్నయ్యా!అరుణ ఇప్పుడేనసీమ్ ఇంటికెళ్ళింది"

"సరేనమ్మా! మీ బావగారికి కాఫీ తెచ్చియివ్వు"

"ఇప్పుడే తెస్తానుండు" లోపలికి వెళ్ళిపోయింది కమల.

"ఔనూ మరి నువ్వా తురకమ్మాయిని కోడలుగా తెచ్చుకుంటున్నావుకదా... అదే పేరు వుంచుతావా?"

శివయ్య నవ్వాడు నిండుగా.

"పేరులోఏముందిబావా! ఈ రోజుల్లో హరిజనులు కూడా 'శాస్త్రి' పేరుని తగిలించుకోవడంలేదూ? అలాగే మనిష్ట మెచ్చిన పేరు పెట్టుకుందాం. అసలు హుస్సేన్ భార్య ఎవరోతెలుసా?"

"ఎవరు" అదోలా చూస్తూ అడిగాడు నరహరి.

"ఆమె హిందూ స్త్రీ! హుస్సేన్ని పెళ్ళిచేసుకున్నాక ఆమె పేరు ముంతాజ్ అయ్యింది"

"ఓ! అలాగా... అర్థమయ్యిందిలే"

కమల కాఫీ తెచ్చి ఇరువురికీ అందించింది. కాఫీ తీసుకున్నాక నరహరి నిష్క్రమించాడు.

శివయ్య తృప్తిగా తనలోతానే నవ్వుకున్నాడు.

* * *

నరహరి ఇల్లు చేరుకునేసరికి కాంతం ఏదో నవల చదువుకుంటోంది. శాంతమ్మ వంట గదిలో వుంది. శివయ్య చెప్పింది నరహరి మెదడులో ఇంకా పన్జేస్తూనే వుంది. కాంతం వివాహం గురించి ఏదో ఒకటి తేల్చుకోవాలనుకున్నాడు.

కాంతం తండ్రిని చూడగానే లేచిపోయి పుస్తకం పట్టుకుని లోపలికి పోబోయింది.

"చూడమ్మా" అంటూ వెనక్కి పిల్చాడు నరహరి.

"ఏం నాన్నా" వెనక్కి వస్తూ అంది కాంతం.

"ఆ అబ్బాయి విషయం ఏంజేశావు?"

"ఏ అబ్బాయి నాన్నా?"

"అదేనమ్మా నీకు వుత్తరాలు రాస్తుంటాడే... ఆ అబ్బాయి గురించే అడుగుతున్నాను ఓసారి రప్పించమని చెప్పానా"

కాంతం మొహం కళావిహీనమయ్యింది అయినా తెచ్చిపెట్టుకున్న ధైర్యంతో అంది.

"వుత్తరం రాశానాన్నా! ఇంకా రావడం లేదు"

"ఈ రోజుల్లో అబాయిల్ని నమ్మమని ఎవరు చెప్పారమ్మా? ఏవిటో నాకు అపనమ్మకం కలుగుతోంది. ఆ అడ్రసు నాకివ్వు. నేనే వెళ్ళి వాకబు చేస్తాను"

కాంతం గుండెలు గుభేలుమన్నాయి. అడ్రసు యిస్తే యింకేమన్నా వుందా? ఇప్పుడేం చెయ్యడం? కంగారుపడింది.

"ఏవిటమ్మా ఆలోచిస్తున్నావు? అక్కడికి వెళ్ళి నేను అసభ్యంగా ప్రవర్తిస్తానని భయమా? అదేం జరగదులే. హరిబాబుని నాతోపాటు తీసుకెళ్తాలే" అని అంటున్నంతలో హరిబాబు స్వయంగా అక్కడికి వచ్చాడు. కాంతం కాస్తంత స్థిమితపడింది.

"ఏవిటి మావయ్యా నన్ను తలచుకుంటున్నావు?" అంటూ లోపలికి వచ్చాడు హరిబాబు.

"ఆ....ఆఁ....రావోయ్! విశాఖపట్నం వెళ్తే నా వెంట నిన్ను తీసుకు వెళ్తానని అంటున్నాను"

"ఎక్కడికేవిటి విశాఖలో?"

"ఎవరో మెడికల్ స్టూడెంటుని లవ్వాడిందటగా మీ మేనకోడలు. ఇక్కడికి రమ్మంటే రావడం లేదతను...మనమైనా వెళ్ళి ఈ వ్యవహారమేదో సెటిల్ చేద్దామని"

హరిబాబు కాంతం కేసి చూశాడు. కాంతం బెదురు చూపులు ప్రసరిస్తోంది. ఈ దాగుడు మూతలు, దాపరికం యింకెన్నాళ్ళు? నిజాన్ని చెప్పేస్తేపోయేదిగా అనుకున్నాడు. పరిస్థితి క్లైమాక్సుకి చేరుకున్న ఈ తరుణంలో తాను కలిగించుకోకపోతే లాభం లేదనుకున్నాడు.

"ఇంతకీ ఆ అబ్బాయెవరో నీకింతవరకూ చెప్పలేదా మావయ్యా"

"చెప్పలేదోయ్"

"కాంతం! ఇంకా దాపరికం ఎందుకు చెప్పు? ఎప్పటికయినా నిజం బైటపడక తప్పదుకదా అది ఎంత చేదుగావున్నా, ఆ చేదును ఎప్పుడో ఓసారి మింగక తప్పదు.నాన్నగారితోచెప్పేయ్" అన్నాడు కాంతంని వుద్దేశించి.

అయితే కాంతం ఎలా చెప్పగలదు? అప్పటికే ఆమెలో కంపరం ప్రారంభమయ్యింది. రానున్న తుఫానుని ఎదుర్కొడానికి ధైర్యాన్ని కూడదీసుకుంటోంది.

నరహరికి పరిస్థితి చూచాయగా అర్థమౌతోంది. ఏదో విశేషముంటుందని, ఆ విశేషం హరిబాబుకీ తెలుసునని అనుకున్నాడు.

"అయితే ఆ అబ్బాయి ఎవరో నీకూ తెలుసునన్న మాట. ఏవోయ్ హరీ?" సూటిగా అడిగాడు. అతనికి తెలిసికూడా తనతో చెప్పలేదన్న వుక్రోషం నరహరిలో మొలకెత్తుతోందిప్పుడే. అతని మొహంలో రంగులు మారుతూ వుండటాన్ని గమ

 

నించాడు హరి.

"ఈ విషయం నాతో మొన్ననే చెప్పింది కాంతం. ఇంక నీతో మాట్లాడ్డానికి అవకాశం కోసం చూస్తున్నాను మావయ్యా! ఈరోజు వచ్చింది కూడా అందుకే"

"పోనీ నువ్వయినా చెప్పు ఆ అబ్బాయెవరో మనిద్దరం వెళ్ళి మాట్లాడుదాం"

"మనం వెళ్ళాల్సిన అవసరం వుండదు మావయ్యా! పేరు వింటే అది మీకు చేదు నిజంగానే వుంటుంది. కాని మింగుడు పడాలి... తప్పదు"

"అంటే గంగులు కొడుకు దాసేనా?" కాళిదాసు చెప్పిన వైనం గుర్తుకొచ్చి హరిబాబు 'చేదునిజం' అని అంటుంటే బహుశా అతడే అయ్యుంటాడనుకున్నాడు. అందుకే తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"ఔను మావయ్యా... దాసే" తడబడుతూ అన్నాడు హరి.

అంతే! కాంతం చెంప ఛెళ్ళుమంది.

"నా కడుపున చెడబుట్టావే భ్రష్టురాలా! ఇంత చదువు చదువుకున్నావు. ఆపాటి యింగితమైనా లేకపోయిందా ? నిన్ను ఏం చేసినా పాపం లేదు" అంటూ మళ్ళీ మరోచెంప వాయించాడు.

హరిబాబు అడ్డొచ్చాడు. లోపల్నించి శాంతమ్మ కంగారుగా వచ్చేసింది.

"శాంతా! నీ కూతురేంజేసిందో చూడు. మన పరువు ప్రతిష్టల్ని మంటలో కలిపేసింది. మనల్ని మొహమెత్తుకోకుండా చేసింది" గర్జించాడు నరహరి.

శాంతమ్మకి ముందుగానే విషయం తెలుసుగాబట్టి, ఈ తుఫాను ఎప్పుడో ఓసారి చెలరేగుతుందనుకుంది. కూతుర్ని



పొదివి పట్టుకుని లోపలికి తీసుకు పోయింది.

"కూచో మావయ్యా... ఆవేశపడకు" అంటూ నరహరిని పట్టుకుని వాలు కుర్చీలో కూచోబెట్టాడు హరిబాబు.

"ఆవేశంగాక ఏవిట్రోయ్ హరీ? ఈ విషయం వూళ్ళో తెలిసిందంటే ఎంత అప్రతిష్ట?" కోపంతో వూగిసలాడుతూ అన్నాడు నరహరి.

"అప్రతిష్ట అనుకుంటే అప్రతిష్టే! కాని, దీన్ని సాంఘిక చైతన్యంగా,సమాజ పురోగమనంగా చూసుకుంటే మనలో ఆత్మతృప్తి ఎంతో వుంటుంది మావయ్యా! నీకు నాన్న చెప్పేవుంటారు నేనా ముస్లిము యువతిని వివాహం చేసుకుంటున్నట్టు. అయితే మ ప్రేమను నాన్న కాదనలేదు. కలిసిన హృదయాల్ని విడదీయాలన్న తలంపు ఆయనకు రాలేదు...రాదు.అలాగే కాంతం విషయం కూడాను. దాసు హరిజనుడే కావొచ్చు. కాని, అతడూ మన లాంటి మానవుడే! నాగరికత పెంచుకున్న మానవుడు. దాసుని చూస్తే అతను హరిజ నుడని ఎవరైనా అనుకుంటారా చెప్పు? మనకి తెలుసు గాబట్టి మనం అనుకుం టున్నాం. రేపు అతడు డాక్టరైతే, అతడి అంతస్తే పెరుగుతుంది. అప్పుడు మనమే అతణ్ని పూలదండలు వేసి సత్క రిస్తాం. మీ అమ్మాయినిచ్చి గొప్ప త్యాగం చేశావని, సంఘాన్ని వుద్ధరించా వన్న పొగడ్తలు నీకందుతాయి. ప్రభుత్వమే నిన్ను గౌరవిస్తుంది. అప్పుడు నీపేరు పత్రికల్లో పడుతుంది. రానున్న పంచాయితీ ఎలక్షన్లలో నాన్న ఎలాగూ పోటీ చెయ్యరుగాబట్టి, మేమూ నిన్ను బల పరుస్తాం. ఇన్ని సదుపాయాలున్నాయి. కాస్తంత శాంతంగా ఆలోచించండి. నీ కూతురు భవిష్యత్తూ బావుంటుంది. నీ భవిష్యత్తు కూడాను. నువ్వెప్పుడూ వూహించనంత గౌరవం లభిస్తుంది" అంటూ నచ్చజెప్పే ధోరణిలో చిన్న ఉపన్యాసం దంచాడు హరిబాబు.

నరహరి మావయ్యకి నచ్చజెప్పా లంటే ఫలానావిధంగా వివరణ ఉండాలని ఇంతకు ముందే ఆలోచించుకుని ఉన్నాడు కాబట్టి అదంతా వల్లె వేసినట్టుగా చెప్పేశాడు హరిబాబు.

నరహరి మెదడు ఆలోచనల యంత్ర మయింది. ఒకపక్క కూతురు చేసిన పని ఆవేశాన్ని, అవమానాన్ని కలిగి స్తున్నా, హరిబాబు చెప్పిందాంట్లో చివరి భాగం అతణ్ని బాగా ఆకర్షించింది. ఇప్పుడు తాను అవరోధపర్చినా, అప్రేమ జీవులు వేరుపడ్డం అసాధ్యమే! ఈనాటి యువతీ యువకుల్లో ఆవేశం ఎక్కువ. ప్రాణాలు త్యజించడానికయినా సిద్ధపడ తారుగాని ప్రేమను త్యజించరు. అటు వంటి పరిస్థితుల్లో తాను సాధించగల దేమిటి? హరిబాబు చెప్పినట్టు తనకి ప్రభుత్వం మద్దతు, వూరివారి మద్దతు లభించిననాడు తనని కించపర్చే వాళ్ళిం కెవరు? కాంతం, దాసుల వివాహమే ఖాయ మైతే, శివయ్య బావ చెప్పిన పద్ధతిలో, ఆ కాంట్రాక్టు కూడా తనకే లభ్యం కావాలి. ప్రయోజనంలేని అశాంతిని పెంచుకోవడమెందుకూ? కాస్తంత తనే రాజీపడితే అన్ని అవకాశాలతోపాటు ఆదర్శవంతుడనే పేరూ వస్తుంది - ఇలా సాగినయ్ అతని ఆలోచనలు.

హరిబాబు నరహరి మొహంలోకే చూస్తూవుండిపోయాడు. అతని మొహం లోని రంగుల మార్పుల్నిగమనిస్తున్నాడు.

"ఏవిటి మావయ్యా అంతగా ఆలో

 

చిస్తున్నావు? నీలోని బూజుపట్టిన ఆలో చనల్ని బైటికి నెట్టివేయి. శరవేగంతో నడుస్తోన్న నవయుగపుటాలోచనల్ని నింపుకో" మరోసారి వెన్ను తట్టినట్టు చెప్పాడు నరహరి.

"అయితే, నువ్వు చెప్పినవన్నీ జరుగుతాయంటావా ?" గంభీరంగా అన్నాడు నరహరి.

హరిబాబు హృదయం ఆనందంతో గంతులేసింది. మనిషిలోని బలహీనత లేమిటో అతనికి తెలుసు. నరహరిలోని మొండిపట్టును జయించినందుకు ఆనం దంగా వుందతనికి.

"తప్పకుండా జ రు గు తా యి మావయ్యా! నువ్వే చూద్దువుగాని"

"మీనాన్నతో సంప్రదించొద్దూ?"

"అవసరంలేదు మావయ్యా! మా నాన్నకి తెలుసు. నేనంతా చెప్పాను. ఆయన ఇటువంటి విషయాల్లో ఎప్పుడూ అవరోధపర్చరు. అసలే గాంధేయవాది. అందునా, చైతన్యవంతమైన భావాలుగల వారు. ఆయన అంగీకారం ఎప్పుడూ వుంటుంది."

"అలాగా ! మీరంతా అంగీకరిస్తు న్నపుడు నాకేవిటోయ్? సరే! కానివ్వండి మరి. ఈ విషయాన్ని మనకి అను కూలంగా ఎలా ప్రచారం చేస్తావో నీ ఇష్టం."

"అదంతా నాకొదిలేయ్ మావయ్యా! ఈరోజు నాకెంతో ఆనందంగా వుంది. కాంతం....కాంతం" అంటూ కేకలేశాడు హరిబాబు.

కాంతం మొహం దించుకునే వచ్చింది. తుడుచుకున్న కన్నీటి చారలు స్పష్టంగా అగుపిస్తున్నయ్. శాంతమ్మ ! కూడా వచ్చి ద్వారండగ్గరే కూచుండిపోయింది.

"కాంతం ! నీ ప్రేమ ఫలించింది. మీ నాన్నగారి విశాలహృదయానికి జేజేలు చెప్పాలి. ఆయనకి నమస్కరించు" అన్నాడు హరిబాబు.

కాంతం హృదయంలో అమృత వర్షం కురిసింది. కొత్త వెలుగును పుంజు కున్న మొహం ప్రకాశవంతమయ్యింది. వాడిన ఆ సన్నని పెదాలపై మంద హాసం లాస్యం చేసింది! కొత్త వుత్సా హంతో చరచరా వెళ్ళి తండ్రి పాదాలకు నమస్కరించింది.

"లే అమ్మా! నీ సుఖమే నేనూ కోరు కునేది" అన్నాడు నరహరి మెల్లగా.

శాంతమ్మ ఆనందభాష్పాల్ని చీర చెరగుతో ఒత్తుకుంటోందక్కడే నిలబడి.

కాంతం హరిబాబు దగ్గరికి వచ్చింది. అతనికి పాదాభివందనంచేస్తూ-

"నీ సహాయానికి నేను జీవితాంతం ఋణపడి వుంటాను బావా!" అంది.

"దానికేముందిలే కాంతం! మీనాన్న మంచితనమే ఈ సమస్యాపరిష్కారానికి హేతువయ్యింది. లే..." అంటూ లేవ నెత్తాడు.

"కూచో బావా! కాస్త హార్లిక్సు తీసు కుని వెళ్దువుగాని" అంటూ చరచరా లోపలికి వెళ్ళింది కాంతం. శాంతమ్మ కూతుర్ని కౌగలించుకుంది.

"చూశావా మావయ్యా ఆ వుత్సాహం! ప్రేమకి ఎంత శక్తి వుందో అనుభవ మైతేనేగాని అర్థంకాదంటారందుకే..." అన్నాడు హరి.

"నిజమేనోయ్..." ముక్తసరిగా అనే శాడు నరహరి.

అంతలోనే కాంతం రెండుగ్లాసుల్లో హార్లిక్సు తీసుకొచ్చి తండ్రికీ, బావకీ అందించింది. హార్లిక్సు తీసుకున్నాక

లేచాడు హరి.

"మావయ్యా... నేనొస్తామరి"

"మంచిదోయ్... నాన్నతో చెప్పు నేను సాయంత్రం వస్తానని."

"అలాగే! వస్తా కాంతం" అంటూ అక్కణ్నించి బైటపడ్డాడు హరి.

కాంతం ఖాళీ గ్లాసుల్ని తీసుకుని చరచరా లోపలికి వెళ్ళిపోయింది. తన గదిలోకి పోయి దాసుకి ఉత్తరం రాయ డానికుపక్రమించింది.

మధ్యాహ్నం మూడున్నరకి శివయ్య నరహరి ఇంటికి వచ్చాడు. 'టీ' తీసుకుంటున్న నరహరి శివయ్య బావని చూసి ఆశ్చర్యపోయాడు.

"రాబావా! నేనే రావాలని బైలుదేరుతున్నాను" అంటూ లేచి, శివయ్యకి ఆసనాన్ని చూపించాడు.

"ఆ అవకాశం నీకివ్వను. నిన్నభినందించడానికి నేనే ముందుగా వచ్చేశాను. అబ్బాయి అంతా చెప్పాడు. నాహృదయం ఆనందంతో వెల్లివిరిసిందంటే నమ్మ. మా కోడలేదీ?" అన్నాడు శివయ్య.

"అమ్మాయ్ కాంతం!" కేకవేశాడు నరహరి.

కాంతం చప్పున వచ్చింది. శివయ్యని చూసి సిగ్గు దొంతరలు ముంచుకురాగా మొహం దించుకుని "ఏం మావయ్యా? ఇప్పుడే వచ్చారా!" అంది.

"ఏం పెళ్ళికూతురా! సాధించావు ఎట్లాగైతేనేం..." నవ్వుతూ అన్నాడు శివయ్య.

కాంతం ముసిముసి నవ్వుకుంది.

"మీ అందరి ఆశీర్వాదబలం మామయ్యా!" అంది.

"కాదమ్మా! మీ నాన్న విశాలత్వం" నరహరిని పైకెత్తడానికే అలాఅనేశాడు.

"మామయ్యకి 'టీ' తీసుకురా అమ్మా" అన్నాడు నరహరి.

"ఇప్పుడేంవద్దుబావా! సరేగాని, ఆ కాంట్రాక్టు ఇక నీకు దక్కినట్టే! నువ్వ



అన్నీ సరంజామములూ సిద్ధంచేసుకునిఉండు. నిర్మాణ ప్రారంభోత్సవం తేదీ నిర్ణయించి వస్తాను. ఎలాగో హైదరాబాద్ వెళ్తున్నాను కదా! ఆ రోజు ఓ చిన్న సభలా ఏర్పాటు చెయ్యాలి. మంత్రిగార్ని తీసుకురావ డానికే ప్రయత్నిస్తున్నాను. ఆ సభలో నీ పేరు మారుమోగుతుంది చూడు...'' అన్నాడు శివయ్య.

నరహరి మందహాసంచేశాడు. "మీ తండ్రికొడుకులదే ఆ బాధ్యతంతాను" అనేశాడు.

"ఆరోజు నేనుచెప్పినట్టు ఈ మూడు వివాహాలూ ఒకేసారి నిర్ణయించుదాం...''

"అలాగే!''

"నేను హైదరాబాద్‌నించి వచ్చాక అవన్నీ ఆలోచించుదాం. మరో చోటికి వెళ్ళాలి...వస్తా...అన్నట్టు మరోవిషయం చెప్పడం మర్చాను... రాతిగట్టుకట్టే పనిమాత్రం మన రామినాయుడికి అప్ప గిస్తున్నాను బావా!''

"మంచిపనిచేశావుబావా! ఇప్పుడతనూ పరాయివాడు కాదుకదా.... మనవాడే!''

"వస్తామరి...''

"మంచిది...''

శివయ్య వెళ్ళిపోయాక తృప్తిగా నిట్టూర్పువిడిచి వాలుకుర్చీలో చేరగిల బడ్డాడు నరహరి.

* * *

హైదరాబాద్‌నుంచి శివయ్య తిరిగి వచ్చాడు. మహాత్మాగాంధీ పుట్టిన రోజయినఅక్టోబరురెండోతేదీన అపూరును సందర్శించడానికి, అదేసమయంలో హరి జనవాడలో కట్టబోయే వసతిగృహాల నిర్మాణప్రారంభోత్సవాన్ని జరిపించడా నికి మంత్రిగారు అంగీకరించినట్టు నర హరికి, మిగిలినపెద్దలకు తెలియజేశాడు శివయ్య.

''శివయ్యగారూ! ఆనాటి కార్య క్రమాన్ని నిర్వహించేబాధ్యత మీ అబ్బా యికి అప్పజెప్పండి...'' అన్నారు అందరూ.

''అలాగే!''

"డబ్బుఖర్చుకి వెనుకాడకండి. మంచి వేదిక ఏర్పాటుచేసి మంత్రివర్యులు ఆనం దంతో పుక్కిరిబిక్కిరయ్యేలా కార్య క్రమం ఏర్పాటుచెయ్యండి"

"అలాగే ఆ కార్యక్రమంలో మరో ముఖ్యాంశం కూడా ఉంటుందనుకోండి"

"ఏమిటది?"

"జా తి పి త మహాత్మాగాంధీ ఆలోచనలకు, ఆశయాలకు అనుగుణంగా మతాంతర వివాహమొకటి, వర్ణాంతర వివాహం మరోటి మంత్రివర్యుల సమ క్షంలో జరుగుతాయి" సగర్వంగా చెప్పాడు శివయ్య.

"అలాగా! మన వూళ్ళో ఇటువంటి ఆధునాతన భావాలుగల వ్యక్తులెవరున్నా రండీ?" ఆశ్చర్యకరంగా అడిగారు వారు.

"ఎందుకులేరండీ..ఉన్నారు. ఆరోజు మీరేచూస్తారుగా" చిరునవ్వుతో అన్నాడు.

"ఇంతకీ వాళ్ళెవరో తెలుసుకో వచ్చునా ?" ఆగలేక మళ్ళీ అడిగారు అందరూ.

"మా అబ్బాయికి, టైలరు హూస్సేన్ కుమార్తె నసీమ్‌కి – అదే మతాంతర వివాహం; మరోటి గంగులు కుమారుడు దాసుకి, మా బావమరిది నరహరి కూతురు కాంతంకి వర్ణాంతర వివాహం..ఈ రెండు వివాహాలు సూత్రప్రాయంగా ఆరోజు జరిపిస్తాము"

"అదీ...అలా చెప్పండి. ప్రత్యక్షం గానూ, పరోక్షంగానూ మీ సంకల్పం,

ప్రయత్నం వున్నాయిగాబట్టి ఇటువంటి అసాధారణ విషయాలు సాధ్యపడుతున్నాయి. మాకు చాలా ఆనందంగా వుందండీ శివయ్యగారూ! మిమ్మల్ని చూసి మేమెంతో గర్విస్తున్నాం. ప్రతి పల్లెలోనూ మీలాంటి వ్యక్తులుంటే పల్లెలు ఎందుకు పురోగమించవూ?" అభినందన పూర్వకంగా అన్నారు అందరూ ఒకవంక ఆశ్చర్యపోతూనే.

శివయ్య తృప్తిగా నవ్వుకున్నాడు.

నరహరి కాలర్ ఎగరేసుకున్నాడు.

అక్టోబరు రెండు రానేవచ్చింది.

ఆరోజు ఉదయమే హరిబాబు ఉత్తరం ప్రకారం దాసు వాల్తేరునుండి వచ్చేశాడు. అప్పుడు దాసుని చూసినవాళ్ళెవ్వరూ అతడే గంగులు కొడుకని అనుకోరు. మనిషి బాగా మారిపోయాడు. ఎంతో హుందాగా అగుపిస్తున్నాడు. దాసు రావడంతో హరిబాబుకి మరింత సహకారం లభించింది.

కాలం కలిసి రావాలేగానీ అన్నీ వాటంతటవే సమకూరుతాయంటారు.

అదేరోజు రామినాయుడు కొడుకు రామరాజు కూడా వచ్చేశాడు. వూళ్లో జరుగుతున్న ఈ కార్యక్రమాన్ని విని మురిసిపోయాడు. హరిబాబు, దాసుతోపాటు రామరాజుకూడా వేదిక నిర్మాణం, మిగిలిన కార్యక్రమంలో చేయికలిపాడు.

సాయంత్రం అయిదుగంటలయ్యింది. దూరంలో జీపులు, కారులూ అగుపించే సరికి మంత్రిగారు వస్తున్నట్టు గ్రహించాడు హరిబాబు. మైక్‌లో చెప్పడం ప్రారంభించాడు - అందర్నీ నిశ్శబ్దంగా కూచోమని. పూలమాలల్ని వేదికమీదే ఓ పక్కగా పెట్టుకున్నాడు.

 

కారు హారను, జీపు హారన్లతో పరిసరాలు ప్రతిధ్వనించాయి. అవి వూరు బైట ఆగినయ్. అక్కణ్నించి మంత్రి గార్ని సగౌరవంగా తీసుకొస్తున్నారు - ఎమ్మెల్యే విశ్వనాథం, కలెక్టరు, శివయ్య మొదలగువారు. వేదిక దగ్గరికి తీసుకొచ్చి ముందు వరుస కుర్చీల్లో మంత్రిగారిని, ఎమ్మెల్యేగార్ని, కలెక్టరుగార్ని ఆశీనుల్ని చేశారు. వాళ్ళ పక్కనే శివయ్య, నరహరి, మరికొందరు రాజకీయ నాయకులు కూచున్నారు. రెండో వరుస, మూడో వరుసల్లో ఆ వూరి ప్రముఖులు కొందరు, శివయ్యగారి కుటుంబం, నరహరి కుటుంబం, రామినాయుడు కుటుంబం, హుస్సేన్ కుటుంబం కూచున్నారు. ఆ తరువాత వరుసల్లో హైస్కూలు ఉపాధ్యాయులు మొదలగువారు ఆశీనులయ్యారు. వెనుక ఖాళీ స్థలంలో జనం కూచున్నారు.

హరిబాబు మైకు ముందుకొచ్చి సుస్వాగతం చెప్పాడు. తరువాత అసలు విషయంలోకి వచ్చాడు.

"మా వూరు ప్రగతిపథంలో ముందుకు సాగాలని మా ఆకాంక్ష. మాకు ఆసుపత్రి లేదు, గ్రంథాలయం లేదు. వీటి నిర్మాణానికి తగు ఏర్పాట్లు చెయ్యాలని ఈ వూరి ప్రజల తరఫున నేను ప్రభుత్వాన్ని అర్థిస్తున్నాను. ఈ విషయంలో మంత్రిగారిని, ఎమ్మెల్యేగార్ని, జిల్లా కలెక్టరుగారిని సహకరించమని సవినయంగా కోరుకుంటున్నాను'' అంటూ ఆగాడు హరిబాబు.

ప్రేక్షకులంతా వుత్సాహంతో కరతాళ ధ్వనులు చేశారు. హరిబాబు మళ్ళీ మైకు ముందుకొచ్చాడు. తరువాత పెద్దల ఉపన్యాసాలు సాగాయి.

ప్రారంభోత్సవ సూచనగా మంత్రిగారి

చేత పునాదిరాయి వేయించాడు. ఆ కార్య క్రమాన్ని జరిపిస్తున్న నరహరిని మంత్రి గారికి పరిచయంచేశాడు కాంట్రాక్టరుగా, తనకి బావగా.

మళ్ళీ అందరూ యధాస్థానాలకి వచ్చే శారు.

ఎమ్మెల్యే విశ్వనాథంగారు లేచి మైకు ముందుకొచ్చారు.

''మన మంత్రిగారు ఈ వూరు రావడం అదీ నా నియోజకవర్గానికి రావడం నాకెంతో ఆనందంగా వుంది. ఇదే తరుణంలో గాంధీ జన్మదినమైన ఈరోజు, జాతిపిత ఆదర్శాలకు అను గుణంగా మంత్రివర్యుల సమక్షంలో మతాంతర వివాహమొకటి, వర్ణాంతర వివాహమొకటి. జరుగుతాయి. ఈ సందర్భంలో శివయ్యగారని, నరహరి గారిని, హుస్సేన్‌గారిని అభినందించ కుండా వుండలేకపోతున్నాను. ముఖ్యంగా నరహరిగారి హృదయ వైశాల్యాన్ని ఎలా చెప్పాలో, ఎలా పొగడాలో అర్థంకాదు. ఆయన నిజమైన గాంధీవాది. మాట లెన్నయినా చెప్పొచ్చు. కార్యాచరణలో పెట్టడం చాలా కష్టం. తన కూతుర్ని ఓ హరిజన యువకుడికిచ్చి వివాహం జరిపిస్తున్న నరహరిగారిని మనందరం మనసారా అభినందించాలి. అంతేకాదు హరిజనవాడలో నిర్మించబడుతున్న ఉచిత వసతుల నిర్మాణకార్యక్రమాన్ని కూడా ఆయనే చేపట్టడం అతని సహృదయానికి తార్కాణం. ఇహపోతే, ఈ వూరికి మార్గదర్శకుడిగా వుంటూ ముందుకి నడిపిస్తోన్న శివయ్యగారు తన కొడుక్కి ఓ సామాన్య దైలరు కూతుర్ని అదీ ఓ ముస్లిము యువతిని అర్థాంగిగా చేసుకోవడం, అతని ఆధునిక భావాలకు, గాంధీ తత్వానికి గీటురాయిగా చెప్పు కోవాలి. అతనికి, వాళ్ళబ్బాయి హరికీ మనందరి అభినందనల్ని చెప్పుకోవడం చాలా అవసరం. ఇప్పుడు మంత్రిగారి చేతుల మీదుగా వివాహాలు వీక్షించండి" అంటూ ముగించాడు.

ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. వధూవరులు నలుగురూ సిగ్గు దొంతరులు చెక్కిళ్ళను ఎరుపెక్కించగా మొహాలు దించుకుని వేదికమీదికి వచ్చారు.

మంత్రివర్యులు వారికి పూలహారాల్ని అందించి మార్చుకోమన్నారు. పూల హారాలు మార్చుకుని, నూతన వధూవరులు వేదికమీదున్నవారికి ప్రేక్షకులకు నమ స్కారాలు చెప్పారు.

అక్కడితో కార్యక్రమం ముగిసింది.

శివయ్యగారింట్లో ఫలహారాలు తీసు కుని మంత్రిగారు, వారి బలగం పట్నం బైలుదేరారు.

నరహరి ఎంతగా మురిసిపోయాడో చెప్పడానికి మాటలు చాలవు. నరహరిలో ఇప్పుడు ఎటువంటి దిగులూ లేకపోయింది. గర్వంతో అతని హృదయం వుప్పొంగి పోయింది.

ఓ మంచి ముహూర్తాన మళ్ళీ నసీమ్, హరిబాబులకు; కాంతం, దాసులకి శాస్త్రో క్తంగా వివాహం జరిగింది ఒకేరోజు. అదే రోజు అరుణ, రామరాజులకూ్కడా వివాహం జరిగింది.

ఊరంతా తరలి వచ్చి ఆ వధూ వరుల్ని ఆశీర్వదించారు.

"సర్వేజనాః సుఖినోభవంతు''అంటూ కృష్ణయ్య ఆశీర్వచనం పలికాడు అందర్నీ వుద్దేశించి.

శివయ్య ముసిముసిగా నవ్వుకున్నాడు.



# బహుమతి

ప్రఖ్యాతి చెందిన ఆ సబ్బుల ఫాక్టరీ ఆవరణంతా కోలాహలంగా వుంది. కొందరు కార్మికులు ఎంతో ఉత్సాహంగా రంగురంగు కాగితాల తోరణాలను అమర్చసాగారు. కొందరు షామియానా బిగించడంలో, మరికొందరు స్టేజీమీద కుర్చీల, మైకుల అమరికలో సహాయ పడుతున్నారు. మైకులో బిగ్గరగా కార్మికుల బృందగానం వినవస్తోంది. మొత్తానికి కార్మికులందరిలో ఉత్సాహం వెల్లువై ప్రవహిస్తోంది ఆ ప్రాంతంలో.

ఇంతలో చిన్న సైజు విమానంలాంటి బ్లూరంగు కాడిలాక్ కారొకటి ఆవరణలోకి ప్రవేశించింది.

"అయ్యగారొచ్చేశారు...తప్పుకోండి!" అంటూ జనాన్ని పక్కకి తొలగిస్తూ కారులోకి తొంగిచూసి నమస్కారం చేశాడు కార్మిక నాయకుడు.

ప్రతినమస్కారాలుచేస్తూ చిరునవ్వుతో కారు దిగి స్టేజీ వద్దకు నడిచాడు ఫాక్టరీ యజమాని వైకుంఠరావు. అప్పటికే అక్కడ ఆసీనులయిన అతిథులు గౌరవ సూచకంగా కుర్చీలలోంచి లేచి అభివందనాలు చేశారు. వాళ్ళవంకోసారి సాభిప్రాయంగా చూసి పేరు పేరునా పలకరించి, తర్వాత కార్మికులు వేసిన పూలమాలలను అందుకుంటూ మైకుముందుకు చేరాడు వైకుంఠరావు.

"కార్మికులకు, అతిథి మహాశయులకు వందనాలు. వేదిక నలంకరించిన పెద్దలకు నమస్కారములు. మన ఫాక్టరీ కష్టపడి చిత్తశుద్ధితో పనిచేసే కార్మికుల అభ్యున్నతికి ఎంతో తోడ్పడుతుందన్న విషయం మీకందరకూ తెలిసిందే! ఇప్పుడు మన ముందు కూర్చున్న వ్యక్తి మీకందరికీ సుపరిచితుడే. ఫాక్టరీలో చేరిన సంవత్స



# కతలు

రంలోనే ఎంతో అభివృద్ధి చూపాడు ఇంత తక్కువ వ్యవధిలోనే జీతం నెలకు వెయ్యి రూపాయలవరకు సాధించుకోగలి గాడు. ఇతడి కార్యదీక్షకు నేనెంతో సంతోషిస్తున్నాను. ఈ శుభ సందర్భంలో ఇతడి జీతాన్ని ఐదువేలకు పెంచుతూ ఫాక్టరీ జనరల్ మేనేజర్‌గా ప్రమోషన్ ఇస్తున్నాను. ఈ శుభవార్త తెలియజేయడానికి నేనెంతో ఆనందిస్తున్నాను" చెప్పటం ఆపి టేబుల్ మీదున్న గ్లాసులోని నీళ్ళను గడగడా తాగాడు వైకుంఠరావు.

సభంతా చప్పట్లతో మార్మోగిపోయింది. "జనరల్ మేనేజర్ కుమార్ జిందాబాద్" అంటూ జేజేలు కొట్టారు కార్మికులు.

నిశ్శబ్దం అన్నట్లు చేతులూపి తన ఉపన్యాసం తిరిగి ప్రారంభించాడు వైకుంఠరావ్ "కుమార్‌కి నా తరపున, మన ఫాక్టరీ తరపున శుభాకాంక్షలు తెలుపుతున్నాను. ఇప్పుడు కుమార్‌ను వేదిక మీదకు వచ్చి ఈ చిన్న బహుమతి నందుకోమని కోరుతున్నాను"

వైకుంఠరావు అందించిన ట్రోఫీ అందుకొంటూ "చాలా థాంక్స్ నాన్నగారూ!" అని మాత్రం చెప్పి కూర్చున్నాడు కుమార్.

## గారడి

"పిల్లలంతా ఒక్కసారి చప్పట్లు కొట్టండి" చేతిలో ఢమరుకాన్ని ఆడిస్తూ చెప్పాడు గారడీవాడు.

పిల్లలు హుషారుగా చప్పట్లు కొట్టారు.

గారడీవాడి మేజిక్కులన్నీ గంట నుండి శ్రద్ధగా గమనిస్తున్నాడు గజ దొంగ మల్లన్న తన ముఠాతో సహా!

"ఇప్పుడో గొప్ప ఫీట్ చేస్తాను చూడండి. ఏదీ పిల్లలంతా మరోమారు చప్పట్లు కొట్టండి!" అన్న గారడివాడి పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు మల్లన్న.

చప్పట్లు కొట్టారు పిల్లలు.

పది మీటర్ల పొడవాటి కర్రను నిలబెట్టాడు గారడీవాడు. వాడి పెళ్ళాం జోరుగా మద్దెల వాయించగా ఎలాటి ఆధారం లేకుండా ఆకర్ర చివరికంటా ఎక్కేశాడు గారడీవాడు.

ఆ ఫీట్ చూస్తున్న మల్లన్న బుర్రలో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది. వెంటనే తన ఆలోచనను పక్కనున్న అనుచరుల చెవిలో ఊదాడు. వాళ్ళంతా ఆనందంగా బాగుందన్నట్లు తల ఊపారు అతని ప్లాన్‌కి తబ్బిబ్బవుతూ! మరో పది నిముషాల తరువాత గారడీవాడి గారడి ముగిసింది. ఎక్కడి జనం అక్కడ వెళ్ళిపోయారు. ఇప్పుడు రోడ్డుమీద గారడీవాడి కుటుంబంతోపాటు మల్లన్న ముఠా మాత్రం మిగిలింది.

"చూడవోయ్! నీ పేరేమిటి?" గారడీవాణ్ని అడిగాడు మల్లన్న.

"కోటేశు!"

"కోటేశూ! నువ్వు మాతో వచ్చి నీ విద్య ప్రదర్శిస్తే వెయ్యిరూపాయలిస్తాను. ఇష్టమేనా?"

గొట్టి లోనికి ప్రవేశిస్తారు" అంటూ తన ప్లానంతా చక్కగా వివరించాడు మల్లన్న.

"అంత ఎత్తు ఎలా ఎక్కేది?" అడిగాడు కోటేశు సందేహంగా!

"ఉదయం కర్ర నిలబెట్టి చివరంటా ఎలా ఎక్కి వెళ్ళావో, అలాగే ఇప్పుడు కర్ర సాయంతో కిటికీ వద్దకు చేరుకో"

కదల్లేదు కోటేశు.

"ఏం ఈ పని ఇష్టం లేదా?"

"అబ్బె...కాదు!"

"వెయ్యి రూపాయలు సరిపోవా? అయితే పని పూర్తయితే మరో వెయ్యి ఇస్తాములే"





"అంతకంటేనా బాబూ!" సంతోషంగా ఒప్పుకొన్నాడు కోటేశు.

కోటేశును తమ వెంట తీసుకుపోయి సుష్టుగా భోజనం పెట్టించి అర్ధరాత్రి దాకా హోటల్‌లోనే గడిపి రాత్రి రెండు దాటాక నెమ్మదిగా చీకట్లో బయలు దేరారు మల్లన్న ముఠా. నేషనల్ బాంకు దాకా వచ్చాక "కోటేశూ! ఇప్పుడు నీ చాకచక్యం చూపించాలి. మూడో అంతస్తులోని నేషనల్ బాంకులోకి దూరి ఆటోమేటిక్ యంత్రాల స్విచ్ ఆఫ్ చేయాలి. తర్వాత మావాళ్లు ప్రధాన ద్వారం పగల

"ఉహూ...అది కాదు''

''మరేమిటి నీ సందేహం?''

"మరేం లేదు. మద్దెలెవరు వాయిస్తారు మీలో?"

"మద్దెలెందుకిప్పుడు?" మండిపడుతూ అడిగాడు మల్లన్న.

"నేను కర్ర ఎక్కాలంటే ఎవరో ఒకరు మద్దెల వాయించాల్సిందే! ఆ చప్పుడు నా చెవుల బడందే నే ఒక్క అడుగు కూడా పైకెక్కలేను...!" చావు కబురు చల్లగా చెప్పాడు కోటేశు.

-కె. హరిబాబు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/ HD